శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయము

రజతోత్సవ సంచిక

1926

శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా
నిలయము - 1901.
హైదరాబాదు.

# విన్నపము

నిజాం రాష్ట్రాంధ్ర దేశములోని మొట్టమొదటిదగు నీయాంధ్రభాషానిలయము వెలసి యిరువదియైదు వత్సరములు గడచుటచే నేఁడు జరుపఁబడుచున్న రజతోత్సవసందర్భమున నీచిన్ని పుస్తకమును ఆంధ్రలోకమున కర్పించు భాగ్యము లభించినందున కెంతయు సంతోషము కలుగుచున్నది.

జీర్ణకర్ణాట సామ్రాజ్య ధౌరేయుఁడు, ఆంధ్రకవిజన కల్పవృక్షప్రాయుఁడును నగు శ్రీ కృష్ణదేవరాయల నామాంకితమై ఈరాష్ట్రములోని యన్నిటికంటె ముఖ్యమైనదగు నీయాంధ్రవాఙ్మయ విషయిక సంస్థపక్షమున ప్రకటితమగుచున్న ఈసంచికయందు ఎట్టివ్యాసములుండుట యవసరమో అట్టివాని సంపాదించి పొందుపరచితిమి. అయినను మాతలంపున నున్న కొన్ని వ్యాసములు సమయమునకు రానందున మాయుద్దేశము సంపూర్ణముగ నెరవేరదయ్యెను.

ఈరాష్ట్రములోని ఆంధ్రప్రాంతమునందలి చారిత్రికప్రదేశములను గూర్చి యొకవ్యాసము వ్రాయింపఁబడినది. కాని స్థలసంకోచముచే దానినిందుచేర్చ వీలుకలుగలేదు. కొన్నిసంస్థానముల చరిత్రము లీసంపుటమున వచ్చినవి; ఇంకను కొన్ని సంస్థానముల చరిత్రము రావలసియున్నది. ఈ వ్యాసములను రెండవసంపుటమునఁ బ్రకటింప సంకల్పించి యున్నాము.

నిజామురాష్ట్రములోని యన్ని ఆంధ్రగ్రంథాలయముల వృత్తాంతమును దీనియందు చేర్ప నుద్దేశించి ౧౧౦ గ్రంథాలయములకు వ్రాయఁగా ౬౩ సంఘములవారు మాత్రము వృత్తాంతము నంపియున్నారు. వచ్చినవాని వివరములిందు ప్రకటించుచు, మిగిలినవాని వృత్తాంతములకై మరల ప్రయత్నించియు వచ్చినచో రెండవసంపుటమున నట్టివానికి తావియ్యఁ దలఁచితిమి.

## పటములు.

సంచికయందు ముద్రితములైన పటములలో కొన్నింటిని నిజాం సర్కారు వారి ఆర్క్యలాజికల్ డిపార్టుమెంటు వారును, మద్రాసు ఆంధ్ర పత్రికా కార్యాలయము వారును, బొంబాయి తెలుఁగుసమాచార్ వారును, బెజవాడవిజ్ఞాన చంద్రికామండలివారును, లక్ష్మీరాణి పత్రి

కాధి పతిగారును నొసంగిరి. వీరికి మేమెంతయు కృతజ్ఞతా బద్ధులమైయున్నాము. కొన్ని
క్రొత్తగాఁ జేయించియున్నాము. మరి కొన్ని పటములను వేసియుందుము
వీలుపడలేదు. వానిని రెండవ సంపుటములో వేయఁ గలము. దయతో ఈ సంచిక
ముఖ పత్రమును చిత్రించి యిచ్చిన చిత్రకారులు శ్రీమాన్ కే. రామాచార్యులుగారి
అష్ట దిగ్గజముల పటములను చిత్రించి దయచేసిన విఖ్యాత చిత్రకలా విశారదులగు శ్రీ
రంగధామ నాయఁడు ఎం. ఎ. సీ. (లండన్) ధారియొక్కయు ప్రతిభను ప్రశంసించు చు

వందనములు.

రజతోత్సవ సంచికను సిద్ధము చేయుపని శ్రీయుతులు వేలూరి రంగధామ
సురవరము ప్రతాపరెడ్డి, గాడేపల్లి సూర్యప్రకాశరావు, మాడపాటి హనుమంతరావుగారి
సదులుగాఁ గల యొక యుపసంఘమున కప్పగింపఁబడి యుండెను. ఈ సభా సదుల
నిలయమునకు చాల కాలమునుండి సభా సదులుగా నుండిన యుత్సాహపూరితులగు భా
నులు శ్రీయుత ఆదిరాజు వీరభద్రరావుగారు ఈకార్యమున నెంతో సహాయము చేసిరి. ఈ
పై మహాశయుల కృషియొక్క ఫలితమే. కనుక వీరందరు అందు ముఖ్యముగా శ్రీయుతులు
సూర్యప్రకాశరావు, ఆదిరాజు వీరభద్రరావు గార్లు జరిపిన యుత్కృష్టమగు సే
ప్రశంసార్హులు.

ఈ సంచికయందు ముద్రితములైన వ్యాస కర్తలకును, సంచిక ముద్రణము
సాయము చేసిన గోలకొండ ప్రెస్ వారికిని, బ్లాకులను జక్కఁగ ముద్రించిన, ఎక్సెల్సియర్,
కాంత ప్రెస్సుల వారికిని, రజతోత్సవ విషయమును ప్రచారము గావించుటకనేక విధముల
డిన గోలకొండ పత్రికా సంపాదకీయ వర్గమునకును, ఇతర విధముల కృషి సల్పిన
నీయులకును మా కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పించుచున్నాము.

నాయని వేంకట రంగారావు,
అధ్యక్షుఁ



# విషయ సూచిక

పుట

క్షాధి పతిగారును నొసంగిరి. వీరికి మేమెంతయు కృతజ్ఞతా బద్ధులమైయున్నాము. కొన్ని బ్లాకులను క్రొత్తగాఁ జేయించియున్నాము. మరి కొన్ని పటములను వేసియుందుము గాని, వీలుపడలేదు. వానిని రెండవ సంపుటములో వేయఁ గలము. దయతో ఈ సంచికయొక్క ముఖ పత్రమును చిత్రించి యిచ్చిన చిత్రకారులు శ్రీమాన్ కే. రామాచార్యులుగారి యొక్కయు అష్ట దిగ్గజముల పటములను చిత్రించి దయచేసిన విఖ్యాత చిత్రకలా విశారదులగు శ్రీ వేలూరి రంగధామ నాయఁడు ఎం. ఎస్. సి. (లండన్) గారియొక్కయు ప్రతిభను ప్రశంసించు చున్నాము.

వందనములు.

రజతోత్సవ సంచికను సిద్ధము చేయుపని శ్రీయుతులు వేలూరి రంగధామ నాయఁడు సురవరము ప్రతాపరెడ్డి, గాడేపల్లి సూర్యప్రకాశరావు, మాడపాటి హనుమంతరావుగారిలు సభాసదులుగాఁ గల యొక యుపసంఘమున కప్పగింపఁబడి యుండెను. ఈ సభాసదుల కోరికపైన నిలయమునకు చాల కాలమునుండి సభాసదులుగా నుండిన యుత్సాహపూరితులగు భాషాభిమానులు శ్రీయుత ఆదిరాజు వీరభద్రరావుగారు ఈకార్యమున నెంతో సహాయము చేసిరి. ఈ సంచికపై మహాశయుల కృషియొక్క ఫలితమే. కనుక వీరందరు అందు ముఖ్యముగా శ్రీయుతులు గాడేపల్లి సూర్యప్రకాశరావు, ఆదిరాజు వీరభద్రరావు గార్లు ఒనర్చిన యుత్కృష్టమగు సేవకుగాను ప్రశంసార్హులు.

ఈ సంచికయందు ముద్రితములైన వ్యాస కర్తలకును, సంచిక ముద్రణము గావించి సాయముఁ జేసిన గోలకొండ ప్రెస్ వారికిని, బ్లాకులను చక్కఁగ ముద్రించిన, ఎక్సెల్సియర్, చంద్రకాంత ప్రెస్సుల వారికిని, రజతోత్సవ విషయమును ప్రచారము గావించుటకనేక విధములఁ దోడ్పడిన గోలకొండ పత్రికా సంపాదకీయ వర్గమునకును, ఇతర విధముల కృషి సల్పిన మహాశయులకును మా కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పించుచున్నాము.

నాయని వేంకట రంగారావు,
అధ్యక్షుఁడు.





# విషయ సూచిక

పుట

# పటముల సూచిక

గోలకొండ మంత్రులు




అక్కన్న మంత్రి.



మాదన్న మంత్రి.

## ఆశీస్సు

ఏ రాష్ట్రజనుల పాలించిరో రుద్రమ
దేవియే మొదలగు ధీరమతులు

ఏ రాష్ట్రమున వన్నె కెక్కిరో అక్కన
మాదన మొదలగు మంత్రివరులు

ఏ రాష్ట్రమునను జన్మించిరో బమ్మెర
పోతన మొదలగు పుణ్యాకవులు

ఏ రాష్ట్రమునఁ బుట్టి యెలమినిఁ గాంచెనో
యోగ్య శుద్ధాంధ్ర కావ్యోత్తమంబు

అది నిజాంరాష్ట్ర మనుపేర నలరుచుండు
దాని నిప్పుడుస్మానలీ ఖాను బహాదు
రేలుచున్నాఁడు తత్పరిపాలనమునఁ
నాంధ్రభాష మహోన్నతి నందుఁగాత!

ఆదిపూడి సోమనాథరావు

# శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము.

శ్రీ వేల[illegible] రంగధామ నాయఁడు ఎం. ఎస్. ఏ. (లండన్)

సీసమాలిక

శ్రీమన్మహారాజశేఖర శ్రీకృష్ణ దేవరాయలకీర్తి దీప్తులెసఁగ
మునగాల ప్రభువరుఁ డనఘుఁడు నాయని రంగరా వధికానురాగమునను
భాగ్యనగరమందు భారతీపూజార్హ మాంధ్రభాషాగృహ మమరఁజేయఁ
గొద్దిలో భవనమొం డద్దెకుఁ గుదిరించి యందులో నాశాలఁ బొందుపరచి
విద్యాభిమానులు వేడ్క మీఱఁగ నందు గ్రంథకాలక్షేప కార్యనిరతి
వెలయ వార్తాపత్రికలఁ దారు పఠియింపఁ దగిన యేర్పాటు లెంతలో నొనర్చె
వీరికి నెయ్యంపు వినయమిత్రుఁడు రావిచెట్టు రంగారావు పట్టువిడక
ప్రత్యేకభవనమే బాగని తలపెట్టి కట్టింపనుండిన కాలమునకుఁ
బ్రారబ్ధవశతను బరమపదించెను వీరి సతీమణి విభుని కోర్కె
నీడేర్ప సమకట్టి యెంతయు నిష్ఠతో దానికిఁ దగు ప్రయత్నంబుఁ జేసి
నన్తైన స్థలమొండు రెసిడెన్సి బాజారునందునఁ గొని యీయఁ బొందుమీఱ
ధర్మాత్ములెంతట ద్రవ్యసహాయంబు సేయ నీనిలయము స్థిరపడియెను
ఇందులో నేర్పరులెందఱో పండితుల్ తరుచుగా దయచేసి పరమకృపను
దెలియని యంశముల్ దెలుపుచు నుపన్యాసములనిచ్చి జనులకు ముదముఁ గూర్ప
విద్యాభివృద్ధియు విహితమార్గాదులు సద్వృత్తులకు సహాయపడుచు
నాంధ్రభాషాసిద్ధి కభిరుచిఁ గలిగించి, పూర్వపండితకవిబుధుల ఘనుల
చారిత్రవిషయముల్ జదివి సంతసమందు, వసతులు గలయట్టి భవనమయ్యె
పూర్వుల గ్రంథముల్ పురుఁగుల పాలౌట, జూడనలవిగాని జాడఁ బొలిసె
నవియెల్ల నీ గృహమందున గననౌను, శ్రద్ధతోఁ జూచెదు చదువరులకు

నిరువదయి దేండ్లు నిండిన—యిట్టి నిలయ
కన్య దీర్ఘాయు వైజ్ఞాన—కాంతు లాంధ్ర
భూమి వెదఁజల్లఁ దోడ్పడి—పుణ్యులగుఁడు
ఆంధ్రజనులార! బుధులార! యార్యులార!

# శ్రీకృష్ణదేవరాయల

# ఆంధ్ర భాషా నిలయము

## చరిత్రము



శ్రీ బూర్గుల రామకృష్ణరావు, బి.ఏ. ఎల్.ఎల్.బి. కార్యదర్శి

### ప్రవేశకము

భారత జాతీయ పునర్నిర్మాణ చరిత్రయందు ఆంధ్రుల ప్రత్యేక వికాసమునకుం దోడ్పడిన ఆంధ్రోద్యమ మొక స్వతంత్రమగు విలక్షణ భాగము. ఆంధ్రోద్యమమను పేరం బేర్కొనంబడు రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక విషయములగు పలు పరిశ్రమలందు గ్రంథాలయోద్యమము ఆంధ్రుల ప్రత్యేక సభ్యతను వికసింపం జేయుటకు మిక్కిలి యనువైనదగుటచేతను, వారి విలక్షణ జాతీయ స్వభావమున కనుకూలమగుట చేతను, ఆంధ్రజన సామాన్యము చేత వారి సహజౌదార్యమును వెల్లడిచేయు స్వాగతమును బడసినది. ఇట్లు స్వాగత మొసంగంబడి నిరంతర కృషిచే దోహద మొనరింపంబడి కొంతకాలమునకాంధ్రేతర ప్రాంతముల కాదర్శప్రాయముగ దినదినాభివృద్ధినొందు చున్నది. ఆంధ్రుల విజ్ఞాన ప్రియత్వమును, ప్రశాంత జీవనాభిలాషను సూచించు గ్రంథాలయోద్యమ మప్పుడప్పుడే ప్రారంభమయి, ఇంకను జనాకర్షక దశ నొందని కాలమున విశుద్ధమగు విజ్ఞాన ప్రేమచే, ప్రేరితులై నిశ్చల మనంబుతో నిజశక్తుల వినియోగించి, యవ్యాజమగు భాషా సేవకై తమ జీవితంబుల ధారపోసి ఈ నిలయమును స్థాపించిన మహానుభావుల స్థైర్యౌదార్యాది సుగుణంబులను ఇరువది అయిదు సంవత్సరముల వయస్సునిండి, సంపూర్ణ యౌవనయౌ ఈ గ్రంథాలయ కన్య యొక్క పంచవింశతి వార్షికోత్సవ సందర్భమునం దలంచుకొని, శిరసావంచి గీర్తింప నలవి కాదు. ఏ మహా మహుల నిరంతర కృషిచేతను, సేవామృత వృష్టి చేతను, పెంపం బడి, అనేకాంతరాయములను ఇక్కట్టులను దాటి, యీ నిలయము నానాటికిం దన తేజః పుంజములను మరింత విరివిగా వెదజల్లుచున్నదో, వారి కీర్తి యజరామరమై వెలయుంగాత!

### ప్రారంభము

ఏ కాలమందైనను, ఏదేశమందైనను జనుల సభ్యతకుం గొలతబద్దగా నుండునది వారి భాషా స్థితియే. ఈ రాష్ట్రమునందు నూటికి ఏబది మంది తెలుఁగు మాటాడువారుండినను, రాష్ట్రమునందర్థభాగము ఆంధ్ర దేశముగా నుండినను, మొట్టమొదటి ఆద్య తెనుంగు కబ్బమునకు జన్మస్థానమై, పోతనాది సుకవి పుంగవుల కవితా వాగ్ఝరి ప్రవహించిన ప్రదేశమయి విలసిల్లి యుండినను, ఇప్పటి యాంధ్ర భాషా స్థితి యిరువది యయిదేండ్ల క్రిందం గడు శోచనీయావస్థలో నుండెను. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము రాష్ట్ర భాషగా నుండు గౌరవమును గోల్పోయిన ఈ యాంధ్ర భాషామతల్లిని దగుదీక్షం బోషించి, పూర్వపు వికాసినిం గావించుటకు, ఇప్పటికి రాజకార్యములపై నేతెంచిన మునగాల సంస్థానాధీశులగు శ్రీ శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహద్దరుగారు పూనుకొనిరి. శ్రీ వారి మంత్రి పుంగవులగు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు, ఎం.ఏ. గారు, తగు నాలోచన లిచ్చిరి. కీ. శే. రావిచెట్టు రంగారావుగారు కార్యసాధనమునకుం గడంగిరి. ఆదిపూడి సోమనాథ

రావు గారును, కీ. శే. మైలవరపు నరసింహ శాస్త్రిగారును తగు కృషి సలిపిరి. ఈ యిరువురు మహాశయుల భావనా ఫలితమే యీ శ్రీ కృష్ణ దేవరాయల ఆంధ్ర భాషా నిలయపు జన్మము. వీరే నిలయమునకు జనకులు. ఇదియే నిజాము రాష్ట్రమునందలి మొట్టమొదటి గ్రంథాలయము.

ఈ మహాశయుల యాశయములను విని డాక్టరు ముత్యాల గోవిందరాజులు నాయుడు గారును, (ఇప్పుడు సర్) ఆర్. వేంకటరత్నము నాయుడు గారును, కీ. శే. కొండా వేంకట్రావు నాయుడు బ్యారిస్టరు గారును, తమ యామోదము నొసంగి తోడ్పడిరి. ఇట్లు పలు భాషాభిమానుల సాహచర్యముతో క్షీణించుచుండిన ఆంధ్రభాషయొక్క పునరుద్ధరణమునకై యీ పుస్తక భాండాగారమును స్థాపింప సంకల్పించఁబడెను. అంత ప్లవ నామ సంవత్సర శ్రావణ బ॥3 భానువారము (౧౯౦౧ వ సంవత్సరము సెప్టెంబరు ౧ వ తేదీ) నాఁడు రామకోటి లోని రావిచెట్టు రంగారావుగారి బంగళా యందు, పాలవంచ సంస్థానాధీశులగు శ్రీ శ్రీ రాజా పార్థసారథి అప్పారావు సవాయి అశ్వారావు మహబూబు నరపురాజ్ వంతు బహద్దరుగారి యాధిపత్యమున నిలయ స్థాపనోత్సవము జరిగెను.

తరువాత క్రొత్త బజారులో నొక గదిని నెలకు రు. ౪—౦—౦ లకు అద్దెకుఁ దీసికొని నిలయము నందుంచిరి. నాఁటి నుండి నేటి వరకును శ్రీ మునగాల రాజా గారును, శ్రీ పాలవంచ రాజా గారును నిలయపు రాజ పోషకులుగా నుండి యున్నారు,

## ప్రాథమికము.

నిజాము రాష్ట్రమునందిది మొట్టమొదటి గ్రంథాలయమని పైన మనవిచేసి కొనియున్నాము. అయినను నిది సమస్తాంధ్ర భూభాగమున కంతటికి నిదియే మొదటి గ్రంథాలయ మన్న సత్య దూరము కాదని మా యభిప్రాయము. బ్రిటిషు ప్రాంతమునందు ఈ నిలయపు స్థాపనమునకుఁ బూర్వమునుండియు ఒకటి రెండున్నట్లు ప్రకటింపఁబడుచున్నది. కాని అవి ప్రత్యేకమగు ఆంధ్ర గ్రంథాలయములు కావని మా నిశ్చయము. ఈ సూత్రమును గమనించిన యెడల సక్రమ పద్ధతుల మీఁద స్థాపితమైన ఆంధ్ర గ్రంథాలయములలో నిదియే ఆంధ్ర దేశమునం దగ్రగణ్యమని నుడువక తప్పదు.

## తొలి కష్టములు.

సంస్కారమన్న భయపడు మన వారికిట్టి క్రొత్త పద్ధతి మొదలు మొదలు రుచించలేదు. పూర్వాచార పరాయణు లిది సంస్కారోద్యమ మని భయపడిరి, ఇంగ్లీషు, ఉరుదు భాషల వ్యామోహములోఁ బడిన మహాశయులు తెలుఁగు భాష నేవగించుచుండిరి. ఇట్టి పరిస్థితులలో నిలయపు భాషోద్యమ తత్త్వమును బోధించి, అభిప్రాయ భేదముల మాన్పి, నిలయపు టభివృద్ధికై పాటు పడిన మహనీయుల శ్రమ నూహించ వలసినదేగాని వ్రాయుట కలవి గాదు. కీ. శే. రావిచెట్టు రంగారావు గారు ప్రప్రథమము నుండి కార్యదర్శిగా నుండి, తమ వాక్చక్యము వలనను తమ సౌమ్య స్వభావము వల్లను అందరకు, దగురీతి సమాధానము లిచ్చి, నిలయాభివృద్ధి కెంతయుఁ దోడ్పడియుండిరి. ఈ దినములలోనే నిలయమును రెసిడెన్సి బజారు నుండి తీసికొనిపోయి గౌలీగూడెమునం దుంచుట సమంజసమని కొందరు సభ్యులు వాదించిరి. కొంత ఘర్షణ జరిగియుండెను. కాని రెసిడెన్సి బజారునందుంచుటకే తుదకు మహాజన సభవారు నిశ్చయించిరి.

## సహాయము.

నిలయపుఁ బ్రథమ దశయం దుదారభావు లనేకు లనేక విధములఁ దోడ్పడిరి. శ్రీ మునగాల రాజాగారు నాఁడును, నేఁడును చేసిన, చేయుచున్న యమూల్య సహాయము వర్ణింపక మా పాఠకుల యూహకు వదిలి వేయుచున్నాము. కీ. శే. రంగా రావు గారు పుస్తకములను, బీరువాలను, నిలయమున కొసంగిరి. భాషా పోషకత్వ సమర్థులగు గద్వాల, వనపర్తి, పాలవంచ, బొబ్బిలి, వేంకటగిరి మున్నగు ఆంధ్రసంస్థానాధీశులు తమకు [illegible] మొసంగి నిలయ సహాయమునకుఁ గడంగిరి. అప్పుడు యౌవనులును, ఇప్పుడు ముసలివారును (ఇందుఁ గొందఱు కీర్తిశేషులైనారు)

సభ్యులుగాఁ జేరి మిగుల యభినివేశముతోఁ దోడ్పడి యున్నారు.

## పండిత ప్రోత్సాహము

విజ్ఞాన నిలయములగు పండితుల సాహచర్యము లేనిదిట్టి భాషానిలయములు వృద్ధిలోనికి వచ్చుట సాధ్యము గాదు, కీర్తిశేషులయిన మైలవరపు నరసింహ శాస్త్రి గారును, కీర్తి విశేషులైన ఆదిపూడి సోమనాథ రావు గారును తమ కవితా రచనచేతను, తమ గంభీరోపన్యాసములచేతను, నిలయోద్యమమును గూర్చి జనుల యందు మంచి ప్రబోధము గావించిరి. నరసింహ శాస్త్రిగారు రచించిన నిలయ ప్రవర్ధమాన చరిత్రము ప్రతి సభ్యుఁడును జదివి యానందింప వలయునని కోరుచున్నాము. సోమనాథ రావుగారు స్థాపకులలో నొకరగుటను, వారు నిలయమునకుఁ జేసిన సేవను గమనించియు, నిలయమువారు వారిని గౌరవ సభాసదులుగాఁ జేర్చుకొని తమ కృతజ్ఞతను వెల్లడించి యున్నారు.

## ధన నష్టము

క్రమ క్రమముగాఁ బ్రజామోదమును బడసి దిన దినాభివృద్ధి నొందుచున్న యీ నిలయమునకు గొడ్డలిపెట్టువలె అర్బతునాట్ కంపెని దివాల వలన మూల ధనము రు. ౩౬౯—౧౦—౬ లు అంతరించెను. (౧౯౧౦) దాచిన ధనము దస్యులపాలు కాఁగా నిలయపుస్థితి తిరిగి మొదటికి వచ్చెను. అయినను నిలయపు నిర్వాహకులు నిరుత్సాహముపడక ద్విగుణితోత్సాహముతో నిలయమును నడపిరి. ఈ దివాలా బ్యాంకునుండి కొంతలోఁ గొంతరైన వచ్చునేమో యని నిలయము పక్షమున కే. శే. లక్ష్మణ రావుగారు కృషి సల్పియుండిరి.

## పాఠశాల

ఈ విధముగా మూలధనము నష్టమైన దినములలోనే, శ్రీమునగాల రాజాగారి నిశ్చలప్రేమ వలనను, కే. శే. రావిచెట్టు రంగారావు, కర్పూరం పార్థసారథి నాయఁడు గార్ల నిరంతర పరిశ్రమ వల్లను తెలుఁగు పాఠశాల యొకటి నిలయమున కంగముగా నేర్పాటు చేయఁబడెను. అర్థికముగా నిరుత్సాహకరమగు పరిస్థితులందుఁ గూడ పాఠశాలను స్థాపించి, భాషాసేవకుఁ గడంగిన వీరి ధైర్య సాహసములు, కృషి మిగుల ప్రశంసనీయము. ప్రప్రథమున నేయిట్టి పాఠశాలను స్థాపించు నుద్దేశము కలిగి యుండియు, లోకులు తగిన యుత్సాహముఁ జూపనందున స్థాపింపలేక పోయిరి. ఈ విషయము మిక్కిలి విచారపడుచు రంగారావుగారు వార్షిక వృత్తాంతము నందు వ్రాసిరి. ఆకొరతను బూర్తి గావించుటకు స్థాపింపఁబడిన పాఠశాల ౧౫ మాసములు నడిచి, తర్వాత ధనాభావము వల్లను, హెచ్చిన విద్యార్థుల సంఖ్యకుఁ దగిన వ్యవస్థను జేయఁజాలకను నిలిపివేయ వలసి వచ్చుట మిగుల శోచనీయము. దీనికిఁ గారణములు రెండు: మూలధనము యొక్క నష్టమొకటి; మూసీనది ప్రళయము రెండవది. ౧౯౦౮ సంవత్సరములో నదీప్రళయము వలన భాగ్యనగర మొకశ్మశానవాటికయై, దుర్భాగ్యనగర మగుటయే గాక నిలయపుసభ్యు లనేకులు ఎన్నియో నష్టములకుఁ బాల్పడిరి. అట్టి విషమ పరిస్థితులలో పాఠశాల ఎత్తివేయఁబడుట కేవల మనివార్యమై యుండెనని స్పష్టము.

## నాటక సంఘము

ఆంధ్ర భాషా వికాసమున కన్ని విధముల నిర్వాహకులు ప్రయత్నించుచుండిరి. ఆకాలములో „ఆంధ్ర భాషోజ్జీవని నాటక సంఘ” మొకటి నూతనముగా నేర్పడి యుండెను. ఈ నాటక సంఘము వారి కోరిక పయిని, అది నిలయపు శాఖగాఁ గొన్ని షరతుల మీఁద నంగీకరింపఁబడెను. కాని యీ నాటక సంఘము వృద్ధిలోనికి వచ్చినట్లు గనఁబడదు.

## రంగారావు—లక్ష్మణరావు

నిలయ మెట్టెటో అంత గాయములను సైరించుకొని నడచుచుండఁగా గోరుచుట్టుపై రోఁకటి పోటను సామెతగా నిలయమునకుఁ బెట్టని కోటవలె నుండి ప్రతిక్షణము భాషా సేవయందే, నిలయాభివృద్ధికర మగు కృషియందే తమ జీవితమును గడపుచుండు రావిచెట్టు రంగారావు గారు ౩—౩—౧౯౧౦ వ తేదినాఁడు స్వర్గస్థులైరి. ఈ మహాశయుని యకాల నిధనము వలన వారి కుటుంబము

నకే కాదు కన్న బిడ్డకంటె నెక్కుడు ప్రేమతోఁ బెంచు నీ నిలయమునకే కాదు హైదరాబాదులోని యాంధ్ర సంఘమునకుఁ గూడ మహత్తరమైన నష్టము కలిగినదని చెప్పుటకు సందియము లేదు. వీరి జీవితాంశముల విపులముగా వ్రాయుటకిది సమయము గాకున్నను కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు గారికి ప్రథమ దివసములలో వీరొసంగిన ప్రోత్సాహమును, విజ్ఞాన చంద్రికా మండలి మొదలగు సంస్థాపనలకు వారొసంగిన చేయూతయు అప్పుడప్పుడే ప్రారంభించిన ఆంధ్రోద్యమమున కమితమైన సహాయమొనర్చినని మాత్రము పేర్కొనక తప్పదు. నిలయము వారును వారి స్మారక చిహ్నముగ భవనమును గట్టించి తమ కృతజ్ఞతను వెల్లడిగావించిరి.

నిలయపు స్థాపకులలో నొకరైన రంగారావు గారి మరణమునకే వగచుచుండ ౧౯౨౨ లో కొమర్రాజు లక్ష్మణరావు గారి యకాలమరణము సభాసముల దుఃఖవారిధిని ముంచివేసినది. రావుగారి మరణవార్త తెలియఁగానె దుఃఖసూచకముగ నిలయము మూసివేయఁబడెను. లక్ష్మణరావు గారి మరణముచే నాంధ్రదేశములోని విద్వన్మణులలో నొక దివ్యమణి జారిపోయినది.

## భవనము.

౧౯౧౦ వ సంవత్సరపు నివేదికాంతమున కొమరగిరి సీతారామరావుగారు నిలయమునకు శీఘ్రమే స్వంత భవనమేర్పడుటకు భగవంతుఁడు ప్రసాదించుగాక! అని గావించిన ప్రార్థనము భగవంతుని యంగీకారమును బడయుటకుఁ గొంత కాలము జరిగినది. ది ౧౫-౪-౧౯౧౦ నాఁడు కార్య నిర్వాహక సభ్యులు కీ. శే. రావిచెట్టు రంగారావుగారి స్మారక చిహ్నముగ నిలయ మందిరము నిర్మించ వలయునని తీర్మానించిరి. రు. ౧౨౦౦-౦-౦ ల వఱకు విరాళములు వాగ్దానములు చేయఁబడినవి. శ్రీమాన్ ధర్మవరము గోపాలాచార్యులు గారు తమ స్వంతము నుండి రు. ౩౦౦౦ లు వ్యయ పరచి భవనము నిర్మించుటకును, తరువాత చందాల వలన వసూలు చేసికొనుటకును దీక్ష పట్టిరి. కాని తరువాత నాలుగు సంవత్సరముల వఱకు నాందోళనము జరుగుచు వచ్చినను, కార్య రూపమునఁ బరిణమించలేదు. ౧౯౧౪ సంవత్సరము జూలై నెలలో కీ. శే. రంగారావు గారి ధర్మపత్ని కీ. శే. లక్ష్మీనరసమ్మగారు మందిరము కట్టించి యిచ్చెదమని వాగ్దానము చేసిన తరువాత సక్రమముగా కార్య నిర్వాహకులు కృషి సలిపిరి. ఆ సంవత్సరము సెప్టెంబరు ౩ వ తేదిని రెసిడెన్సీ మార్కెటు రోడ్డుపైన నీ మందిరమునకుఁ బూర్వము గల యింటిని, స్థలమును రు. ౨౪౦౦-౦-౦ లకుఁ గొనఁబడినది. అప్పు డుండిన గృహమునందే మార్పులు గావించ వలయునని కార్య నిర్వాహకు లుద్దేశించిరి. కాని సహాయౌదార్యపూరితయును, కీ. శే. రంగారావు గారి సహ ధర్మచారిణియగు నా పతివ్రతా తిలకము లక్ష్మీనరసమ్మగారు అంత కంగీకరింపక నిలయావసరములకు సర్వ విధముల యోగ్యమగు క్రొత్త మందిరమునే నిర్మింప వలయునని నిశ్చయించి రు. ౩౦౦౦ లు ధనము మందిర నిర్మాణమునకై యొసంగెను. ఈ ధనము చాలక పోయిన నింకను ఇచ్చుటకు సంసిద్ధురాలై యున్న ధన్యయగు నా సాధ్వీమతల్లి దైవ ప్రాతికూల్య వశంబున ౧౯౧౭ వ సంవత్సరము ౨౮ అక్టోబరు తేదీన స్వర్గీయుఁడగు పతి సాన్నిధ్యమును గాంచెను.

ఈ మహనీయురా లొసంగిన మూఁడువేల ధనము నవీన మందిర నిర్మాణమునకు చాలక పోయినందునఁ బ్రత్యేకముగాఁ మందిర నిర్మాణనిధి యను పేర విరాళములు వసూలు చేయఁబడెను. ఆనిధికి భాషాభిమానులుఁ, ధర్మాత్ములు, అనేకులు సహాయ మొనర్చిరి. శ్రీ శ్రీ మునగాల రాజాగారు రు ౧౨౫౦ లు విరాళ మొసంగి మహోపకార మొనర్చిరి. ఇట్లు రు ౫౭౮౮-౩-౨ లు నిధి వసూల్లును, కీర్తిశేషులైన కర్పూరం పార్థసారథి నాయఁడుగారి స్మారకనిధి యొక్క రు ౪౭౫ లును, నిలయపు చందా ద్రవ్యము, సినిమా వారి సహాయము కలిసి మొత్తము రు ౧౧౫౩౫-౮-౫ ల వ్యయముతో నీభవనము నిర్మింపఁబడియెను. మందిర నిర్మాణము నందు నిరంతరము కృషి సల్పి ధన సంగ్రహము గావించిన శ్రీయుత మాడపాటి హనుమంత రావుగారు ఈ నిలయాభి వృద్ధి గావించిన వారిలో ముఖ్యులని వేరె చెప్పనక్కరలేదు.

అప్పుడు కార్యదర్శిగా నుండిన సింగపెరుమాళ్లు నాయఁడుగారు గావించిన సేవ వర్ణనాతీతము కాలేదు. నాగపల్లి గౌరీశంకర వర్మగారు అవసరమైనప్పుడు ధన మప్పుగానిచ్చి దయతో దోడ్పడిరి. సేట్ లాల్‌జీ మేఘజీ గారు సౌకర్యములను గలిగించిరి. మందిర నిర్మాణము నకు సంబంధించిన ఇంజనీరింగ్ పనులు మొదలగు సర్వ కార్యములు ఉపాధ్యక్షులుగా నుండిన రాజు మొదలి యారుగారి యాజమాన్యమున జరిగి శోభాయమానమగు మందిర మేర్పడి నందున వారి పరిశ్రమ యొంతయు నభి వందనీయము.

ఇట్లు ౧౯౧౭వ సంవత్సరము నందు ప్రారంభమయి ౧౯౨౧ వ సంవత్సరము వరకు సమాప్తియైన యీభవ నము యొక్క ప్రవేశోత్సవము మహా వైభవముగా విస్తార కీర్తులగు కట్టమంచి రామలింగారెడ్డి. ఎమ్. ఏ గారి యధ్య క్షత క్రింద ౩౦–౯–౧౯౨౧ వ తేదీన జరిగినది.

నిలయమునకుఁ జక్కని హాలులభించినను సభలు జరిగినప్పుడు హాలులోని కొంత భాగము స్త్రీలకు ప్రత్యే కింప వలసి వచ్చుచుండెను. అందుచే నేర్పాటులు సుకర ముగా లేకుండెను. అదిగాక కమిటీ సభలు సమావేశ మగుటకు స్థలము సంకోచముగా నుండెను. ఇత్యాది యిబ్బందులను తొలఁగించు కొనుటకు హాలునందు బా ల్కనీ నిర్మాణము ఎంతయు నవసరమయ్యెను. ఏతన్ని ర్మాణమునకు ౨-౩ సంవత్సరములనుండి కృషిసల్పు చుంటి మిగాని యేమియుఁ గార్యకారి కాలేదు. శ్రీవేలూరి రంగధామ నాయఁడుగారి యవిశ్రాంత కృషిఫలితముగా సుందరమగు బాల్కనీ యిప్పుడు సిద్ధమయినది. ఇప్పుడు స్త్రీలు బాల్కనీమీఁద సుఖాసీనులయి సభా చర్య లను జక్కఁగ గమనింప వచ్చును. ఒక్క బాల్కనీ విష యము నందేగాక, నిలయాభివృద్ధియెడ నాయఁడు గారు చూపుచున్న మహోత్సాహము సభ్యులందరకును అనుకర ణీయము. బాల్కనీ నిర్మాణము కొఱకు శ్రీనాయఁడు గారి ప్రోత్సాహమున భోజరాజులు నాయఁడు గారును, రావుబహదురు రామన్న పుల్లయ్య గారును రావు బహద్దూరు సేటు లక్ష్మీనారాయణ గారును, సింగార వేలు మొదలియారు గారును, రాజాప్రతాప గిర్జి గారును దయతో సహాయము గావించి యున్నారు.

## అలంకారములు.

భవనము ఆకర్షణీయముగ నుండుట కవసరములగు అలంకారములు సమకూర్పఁబడెను. బల్లలు, కుర్చీలు, బెంచీలు మొదలగు ఫర్నిచరు అయాచితముగ వేలూరు రంగధామ నాయఁడుగారు, భోజరాజులు నాయఁడు గారు, రావు బహద్దరు రామన్న పుల్లయ్యగారు, రావు సాహెబు చినరా దూర్వాసులు గారు దానమొసంగి మహోపకార మొనర్చిరి. అల్లాడు లక్ష్మీనారాయణగారు దయతో నొక పెద్ద గడియారమును గొనియిచ్చిరి. రావి చెట్టు రంగారావుగారి యొక్కయు, లక్ష్మీ నరసమ్మ గారి యొక్కయు రూపపటములు పెద్ద యాకృతిని శ్రీమునగాల రాజాగారు వ్రాయించి యిచ్చిరి. నిలయము నకుఁ గార్యదర్శులుగను, ఉపాధ్యక్షులుగను నుండి య మూల్య సేవ యొనర్చిన కర్పూరం పార్థ సారథి నాయఁడు గారి పెద్దపటమును ,, పార్థసారథి నాయఁడు స్మారక సంఘము వారు దయతో నొసంగిరి. వీనిని నిలయ ప్రవేశోత్సవ సందర్భమున కట్టమంచి రామలింగారెడ్డి గారు బహిరంగ పరచిరి. నిలయస్థాపకులలో ముఖ్యులు నగు శ్రీమునగాల రాజా గారి రూపపటమును మాల్వీ శేఖు అహమ్మదు అను చిత్రకారులు వ్రాసి యిచ్చి నిలయము నకుఁ జాల సహాయ మొనర్చిరి. శ్రీరాజా గారి రూపపట మును డాక్టరు ముత్యాల గోవిందరాజులు నాయఁడు గారు బహిరంగ పరచిరి. (౧౯౨౩) చారిత్రక విలువగల శ్రీవిజయనగర సామ్రాట్టగు రామరాజు పటమును మిగుల ప్రయాసముతో ఆంధ్ర పరిశోధక సంఘము వారు సంపాదించి విపులము చేయించి నిలయమున కొసంగిరి. దీనిని న్యాయమూర్తి పండిత కేశవరావు గారు బహిరంగ పరచిరి. (౧౯౨౪) శ్రీకృష్ణ దేవరాయల వారిరంగుల పటమును, అష్టదిగ్గజముల పటములను వేలూరు రంగధామ నాయఁడు గారు చిత్రించి యిచ్చిరి. వీనిని లక్ష్మణరావు గారియొక్కయు రంగధామనాయఁడు గారి యొక్కయు పెద్ద యాకృతిపటములను రజతోత్సవ సందర్భమున బహి రంగ పరుప నుద్దేశించి యున్నాము.

## సంస్కృత గ్రంథములు.

నాగరలిపియందు ముద్రితములైన సంస్కృత గ్రంథావళి కీ. శే. రావిచెట్టు రంగారావు గారి వలన మాకు లభించినవి. ఇవన్నియు సంస్కృత వాఙ్మయ మందలి యుద్గ్రంథములు. వేదములు ఉపనిషత్తులు, పురాణములు, తత్త్వగ్రంథములు, కావ్యనాటకాలంకార గ్రంథములు కలిగి యీసంస్కృత గ్రంథాలయము విద్వద్విద్యార్థులకుపకరించు చున్నది. సంస్కృతాంధ్రములకుఁగల సన్నిహిత సంబంధముచే, ఈ యాంధ్ర భాషా నిలయమున సంస్కృత గ్రంథముల యునికి ఎంతయు నొప్పియున్నది. ఈగ్రంథములను తత్సంబంధమయిన రు. ౧౦౦౦౦-౦-౦ లను ఈ నిలయమునఁజేర్చి కార్యనిర్వాహకులు సంస్కృత గ్రంథాలయమును గాపాడిరి. ప్రజాసంస్థకుఁ జెందిన యిట్టిగ్రంథరాజము లొకానొక వ్యక్తి స్వంత సొత్తు గాక, ప్రజా సంపత్తులోనే యుండి, పలువురకుపయోగకరముగా నుండుట భావ్యము గదా!

## గ్రంథముల పట్టిక.

ఆంధ్ర దేశ గ్రంథాలయములను విమర్శించుచు నీ మధ్య నొకానొకరు గ్రంథముల పట్టికను ముద్రించిన గ్రంథాలయములు లేవని వ్రాసిచ్చి యుండిరి. ఈ విషయమునందును ఈ నిలయము తన విధిని విస్మరించియుండలేదు. ఈ నిలయగ్రంథముల పట్టిక ( )లోనే మొదటి సారి ముద్రింపఁబడెను. దానిని సంస్కరించి విపులము చేసి ౧౯౩౪ లో రెండవ కూర్పు వేయఁబడెను. ఈ క్రొత్త కూర్పును సిద్ధము చేయుటలోఁ గార్యదర్శి యగు నాంపల్లి గాగి శంకర వర్మ గారు అత్యంత శ్రద్ధ తీసికొని యున్నారు.

## జయంతులు

విజ్ఞాన వ్యాప్తి గావించుటకు గ్రంథ సంగ్రహముగ్రంథ పఠనా సౌకర్యము లుండుటయే చాలవు. ఆంధ్రుల కొఱకు, ఆంధ్ర భాష కొఱకుఁ గృషి సల్పిన మహనీయుల సంస్మరించి, యువకులం దుత్సాహము ప్రజ్వలింపఁ జేయుటయు గ్రంథాలయముల విధి. కావున ఆంధ్ర భోజుని నామాంకితముగ స్థాపితమైన ఈ నిలయమునం దా మహనీయుని జయంతి ప్రతి వత్సరము వైభవముగ జరుపఁబడుచున్నది. అట్టి రాజ పుంగవుని, అట్టి భాషా పోషకుని, జయంతి జరుపు నట్టి గ్రంథాలయ మిది యొక్కటియే యనిన నెంత మాత్రము అతిశయోక్తి కాదు. మేము చేసిన యాందోళన పైని కొంత కాలము క్రిందటఁ గొన్ని సమాజములు రాయల వారి జయంత్యుత్సవమును జరిపి యుండెను. కాని తరువాత విస్మరించుట విచారకరమగు విషయము. ఆంధ్ర మహాజనులకిది తగినట్టి మేల్కొలుపు కాక!

రాయల వారి జయంతియే గాక నన్నయ, తిక్కన, వీరేశలింగము, లక్ష్మణరావు లవర్గంతులు జరిపి వారి వారి కవితా శక్తిని, రచనా సామర్థ్యమును, భాషా సేవను నుగ్గడించు విమర్శకోపన్యాసములు జరిపించు చున్నాము. ఇట్లు కవుల, పండితుల యశోగానము సక్రమముగఁ జేయుటలో ఈ నిలయమునే మున్ముందు పేర్కొనవలయును. పూర్వాంధ్ర కవి తల్లజాల కవితామృతమును గ్రోలుట కవకాశ మిచ్చు నీ సముద్యమ మింక నెక్కుడు ప్రచారములోనికిఁ దెచ్చుట కాశించుచున్నాము.

## సన్మానములు

ఈ నిలయ మొనరించుచున్న కార్యములలోఁ బండిత సన్మాన మొక ప్రశంసనీయమయిన భాగము. ఇట్టి సన్మాన సభల వలన, దేశీయులకు విద్వన్మణుల దర్శన భాగ్యము లభించుటయే కాక, వారి వాగమృత ధారను గ్రోలుటకు మంచి యవకాశము కలుగఁగలదు. విజ్ఞానపేటిక లగు పండితుల సన్మానించుట భాషా సంస్థల ప్రత్యేక విధియై యున్నది. ఈనిలయము దానినియథావిధి నెరవేర్చుచున్నది. ఆంధ్ర నాటక పితామహులగు కీ. శే. ధర్మ వరము కృష్ణమాచార్యుల వారు బంగారు పతకముచే బహూకరింపఁబడిరి. (౧౯౧౭) శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు నిలయ వార్షికోత్సవ సందర్భమున సత్కరింపబడిరి. (౧౯౧౪) శ్రీ చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రిగారు తిక్కన జయంత్యుత్సవమున సభ్యతులుగా రాఁగా నూటపదునారు రూప్యములచే బహూకరింపఁబడిరి. ప్రొఫెసరు కోడి రామమూర్తి నాయఁడుగారికిని, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికిని, (౧౯౩౪)

ఆంధ్రభోజుఁడగు



- శ్రీ కృష్ణదేవరాయలు

నిలయపు

స్థాపకులు—పోషకులు—అధ్యక్షులు



శ్రీ శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరు,

మునగాల సంస్థానాధీశులు.



వనపర్తి సంస్థానాధీశులు, కీ. శే. మహారాజా
(ప్రథమ) రామేశ్వరరావు బహద్దరు.



వనపర్తి సంస్థానాధీశులు : శ్రీశ్రీమహారాజా రామేశ్వర రావు బహదూరు;
కుమారులు, శ్రీరాజాకృష్ణదేవ రాయలవారు, శ్రీరాజా రామదేవ రాయలవారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు గారికిని, (౧౯-౨౬) గాన విద్యా ప్రవీణులగు మాస్టరు మనోహరం బర్వే గారికిని సన్మాన పత్రములు సమర్పింపఁ బడెను. ప్రొఫెసరు రామమూర్తి నాయుఁడు గారికి „జగదేకవీర” బిరుద మొసంగఁబడెను (౧౯-౨౭)

## ఉపన్యాస సభలు

వివిధ విజ్ఞాన విషయములను గూర్చి యవకాశము దొరకినప్పుడెల్ల ఉపన్యాస సభలను సమావేశ పరచు చున్నారము. శ్రీ కల్యాణానంద భారతీ స్వాముల వారు, సుప్సారి రామిరెడ్డిగారు, అదిపూడి సోమనాథరావు గారు, విద్వాన్ మేడేపల్లి వేంకట రమణాచార్యుల వారు, ఓరుమళ్ల రాజగోపాలరావు, బి.ఏ.ఎల్.టి గారు, శేషాద్రి రమణ కవులు, యామినీపూర్ణ తిలకమ్మగారు చాట్రాతి లక్ష్మీనరసమ్మగారు అదిపూడి ప్రభాకరరావు గారు, అష్టావధాని శ్రీపతిత్ర్యంబకరావుగారు మున్నగు విద్వాంసులు నిలయ భవనమున ఘనోపన్యాసము లొసంగి యున్నారు.

## గ్రంథాలయ సభలు

ఈ నిలయము కాకినాడలో జరగిన గ్రంథాలయ సభకును, మధిరలో సమావేశమయిన సభకును ప్రతినిధులను బంపియున్నది. సభలయం దిట్టి ప్రాతినిధ్యము వలన గ్రంథాలయ యోద్యమ నాయకుల సందర్శనమును, పరస్పర భావ వినిమయమును గలిగి నిలయాభివృద్ధి కెంతయుఁ దోడ్పడునని యూహించుచున్నాము.

## ఇతర సంస్థలు

కొంత స్థల సంకోచము చేతను, కొంత ధనాభావము చేతను ఈ నిలయము చారిత్రిక పరిశోధనమును గడంగుట కవకాశము లేకపోయెను. అయినను పరిశోధనోద్యమమునకీ నిలయము సమస్త విధములఁ దోడ్పడుచున్నది. పరిశోధన కొరకుఁ బ్రత్యేకముగ నేర్పడిన „ఆంధ్ర పరిశోధన సంఘము”నకు ఈ నిలయము తావొసంగినది. ఆంధ్ర పరిశోధన సంఘము వారు సంపాదించిన వస్తుసామగ్రి ఈ భవనము నలంకరించు చున్నవి.

ఈ నిలయ భవనము ఆంధ్రోద్యమ కేంద్ర స్థానముగా నుపకరించు చున్నది; ఆంధ్రులను, కొన్ని సమయములం దాంధ్రేతరులును జేయు బహిరంగ సభలకు నియ్యఁబడుచున్నది. ముఖ్యముగా ఆంధ్ర సోదరీ సమాజము వారు ప్రతి వార మీ భవనముననే సమావేశమయి తమ సభలను జరుపుకొనుచున్నారు. ఇట్లు స్త్రీల యభ్యుదయము కొరకును ఈ నిలయము సమస్త విధములఁ బాటుపడుచున్నది. ఈ నిలయ స్థాపనాదినుండి యిచట ఆంధ్రనారీమణులును సభ్యురాండ్రుగఁ జేరియు, సభలయందును, సమావేశములయందును బాల్గొనుచున్నారు. ఆంధ్ర సోదరీసమాజము వారు చేసికొనిన విన్నపముపై ని స్త్రీల కన్నికరగతుల యందును అగ్రచందా యిచ్చు సౌకర్యము నొసగించి యున్నాము. నిలయ యాజమాన్యమున జరుగు సభలందేమి, వారికి జయంతులు మున్నగు ఉత్సవ సందర్భములందేమి సోదరీమణులు పాల్గొనుట క్రమేణ వృద్ధియగుచుండుట మిగుల సంతృప్తికరము

## ఆగంతుకులు.

ఆయావిషయ సందర్భములందు ఈ నిలయమును సందర్శించిన మహనీయులను పైనఁ బేర్కొని యున్నాము. మరియు దివాను బహదూరు నెమలి పట్టాభి రామరావు పంతులు బి. ఏ. గారు, దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులు బి. ఎ. బి. ఎల్. గారు, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, బ్యారిష్టరుగారు. చిలుకూరి నారాయణరావు పంతులు, ఎం. ఏ. ఎల్. టి. గారు రాజా పరిటాల గిరిజీ గారు, శ్రీశ్రీ అమరచింత రాజావారు, పెనపర్తి సంస్థానాధీశులు కీ. శే. శ్రీకృష్ణ దేవరాయల వారు పూనానిమ్న జాత్యుద్ధరణ సంఘాధ్యక్షులగు శింధే గారు, గ్రంథాలయ సభాసంచార కార్యదర్శియగు దంటు సుబ్బావధానులు గారు, సివిల్ జడ్జియగు రంగనాయకులు నాయుఁడుగారు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు, వావిలికొలను సుబ్బారావుగారు, గుండు అచ్చమాంబ గారు, అయ్యంకి వేంకటరమణయ్యగారు, సుసర్ల శ్రీరామనరసింహముగారు, వేలూరి శ్రీరామశాస్త్రిగారు. వేలూరి శివరామ శాస్త్రి గారు, చిల్లరిగె శ్రీనివాసురావు గారు, మున్నగు ప్రముఖులును ఈ నిలయమును శీలకించి సదభిప్రాయముల నొసంగియున్నారు.

### సానుభూతి.

పూండ్ల రామకృష్ణయ్య, గురజాడ అప్పారావు, కోపల్లె హనుమంతరావు, కొమర్రాజు లక్ష్మణరావు, ఒంగూరి సుబ్బారావు, పురాణపండ మల్లయ్య శాస్త్రి గారు మున్నగు పండితుల మరణమునకును జగోదాలోని గ్రంథాలయ భవనము పరశురామ ప్రీతి యయినందులకును చింతించుచుఁ దీర్మానములు గావింపఁబడినవి. గద్వాల సంస్థానాధీశులగు సీతారామ భూపాలు బహదూరు, వనపర్తి సంస్థానాధీశులగు రాజా కృష్ణదేవరాయల వారి యకాల మరణమునకీ నిలయ సభ్యులు తమ పరితాపమును వెల్లడించినారు.

### ఆంధ్రదేశీయుల సహాయము

భవన నిర్మాణ సందర్భమున మహారాష్ట్ర, కర్ణాటక, గుజరాతి, తమిళ మహాశయులనేకులు భూరి విరాళము లొసఁగి యెంతయో మేలుగావించి యున్నారు. వారి పవిత్ర నామముల నిదివరలో నివేదించియుండు స్మరించి యున్నాము. భాగ్యనగరమునందు నాయకులగు ధర్మవీర వామన రామచంద్ర నాయకు, జాగీర్దారుగారీ నిలయమునెడ చూపుచున్న యభిమానము అనుపమానము. శ్రీవారు మా నిలయమునకు రాజపోషకులు. కావున శ్రీవారినిఁ బ్రత్యేకముగఁ బ్రశంసించుచున్నాము. రాజా నరసింగిర్జీగారి అంత్యక్రియల సందర్భమున రాజా శ్రీ ధనరాజగిర్జీగారు రు. ౨౦౦ ల విరాళ మొసఁగియుండిరి. శ్రీవారి దాతృత్వమును గొనియాడుచున్నాము. ఈ మహాశయుల భాషాసేవ తత్పరత, నిష్కళంక దేశాభిమానము, దానశీలత ఆంధ్రుల కందరకును అనుకరణీయము.

### కృతజ్ఞత

ఎవ్వారి శుభ సంకల్పముల చేతను, ఎందరెవ్వరి యనుపమాన కృషిచేతను ఈ నిలయ మింత యభివృద్ధి నొచ్చెనో సందర్భానుసారమునఁ బైన వ్రాసిచ్చియున్నాము. ఇంక నెందరో యకుంఠిత దీక్షతో నిలయాభివృద్ధికిఁ బ్రయత్నించిన వారు గలరు. వారందరి నామముల నిచ్చుట స్మరించుట కష్టసాధ్యము. అయినను కొందరి నామములనుమే మిచ్చుట స్మరించుట విధాయక కృత్యము. కస్తూరి శివరామ రావుగారు, రాయప్రోలు వేంకట్రామ సోమయాజులు గారు, జొన్నలగడ్డ శేషాద్రి శాస్త్రి గారు, ధర్మవరము గోపాలాచార్యులుగారు పబ్బరాజు సుబ్బారావుగారు, వత్తుల హనుమంతరావు గారు గుమ్మళ్లలేటి నరసింహారావుగారు, వేలాల సుబ్బారావుగారు, అలంపల్లి వేంకట్రామారావుగారు, దిట్టకవి లక్ష్మీనారాయణ గారు, కలపటపు భానుమూర్తి గారు, నడింపల్లి జానకి రామయ్యగారు, చేసిన సేవ యమూల్యమైనది. శ్రీశతావధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు దయచేసి నప్పుడు కశిపాటి వేంకటరమణయ్యగారు, మిగుల పరిశ్రమయు, సహాయమును నొసఁగిరి. మల్లాది లక్ష్మీనరసింహారావుగారు ఆంధ్రపరిశోధక సంఘకార్యమునకుఁ దోడ్పడు నాంగ్లేయ గ్రంథములకై రు ౩౦౦-౦-౦ ల రూప్యముల విరాళము తమ మిత్రులచే నిప్పించిరి. కర్తయు, కారకులును నభివందనీయులు.

### శుభ చిహ్నములు.

ఈ నిలయాదర్శమును గైకొని నిజాము రాష్ట్రమునం దనేక గ్రంథాలయములు నెలకొల్పఁబడినవి. ఆంధ్రభాషాభివృద్ధియెడ యౌవనులు సముచితోత్సాహముతో గృషిసల్పుచున్నారు. గ్రంథమాలికలు, వార్తా పత్రికలు బయలు దేరినవి. నిలయస్థాపకులు నాటిన గ్రంథాలయోద్యమ బీజము వివిధ శాఖలచే నొప్పెడు మహాతరువై నలుగడల వ్యాపించి సత్ఫలముల నొసఁగు శుభచిహ్నములు పొడకట్టుచున్నవి. లేఖకులు, ఉపన్యాసకులు, గ్రంథకర్తలు పెక్కుబయలు దేరుచున్నారు. మాతృభాషాభిమానముతో శ్రీమంతులు భాషాదేవి నుపాసించి, తమ ధనమును సద్వ్యయము చేయుచున్నారు. ఇరువది యయిదేండ్ల క్రింద యాంధ్రభాష నికృష్టస్థితిఁ గని, ఇప్పటి సౌభాగ్యస్థితికి మూలకందమైన యీ భాగ్యనగరాంధ్ర భాషానిలయ జన్మము సార్థకమైనది. ఆంధ్ర మాతను వనసార సేవించి, ఆంధ్ర భాషకుఁ జక్కని దోహద మొసఁగి, యాంధ్రజనులు కృతకృత్యులగుదురుగాక!

### ముగింపు

ఈ రజతోత్సవ సందర్భమున నిలయపు చరిత్రను నివేదించు భాగ్యము కలిగినందులకు నేను మిగుల సంతసించుచున్నాను. ఏమహారాజు శుభనామ ప్రేరణ వలన ఆంధ్రభాషా విషయక కార్యములకొక యుత్తేజము జనించునో, ఏసర్వంసహాధీశుని చంద్రశాలాంగణము ఆంధ్ర భారతి కిరవై సావిడి యయ్యెనో, ఏసార్వభౌముఁడు ఆంధ్ర కర్ణాటక సామ్రాజ్యములనే గాక, భాషాసామ్రాజ్యమును గూడ నధిష్ఠించెనో అట్టి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, ఆంధ్రభోజ శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయల వారి పట్టాభిషేక శుభదినమును స్మరించుచు, నీచరిత్రను ముగించుచున్నాను.

శా. శ. ౧౮౪౮ అక్షయ సంవత్సర మాఘ శు|| ౧౪ మంగళవారము.

4-2-1927

అనుబం

ఆదాయ వ్యయములు మొ

| నెం. | సం॥ నుండి సం॥ కు. | ఆదాయము. | వ్యయము. | చదువరులు. |
|---|---|---|---|---|
| 1 | 1901—1902 | 747—10—0 | 333— 6—5 | ... |
| 2 | 1902—1903 | 349—12—4 | 262—10—2 | 242 |
| 3 | 1903—1904 | 105— 0—6 | 380— 1—0 | 322 |
| 4 | 1904—1905 | 394— 1—9 | 314—2—10 | 324 |
| 5 | 1905—1906 | 304—12—0 | 233— 1—8 | 345 |
| 6 | 1906—1907 | 373— 2—6 | 1065—10—8 | 178 |
| 7 | 1907—1908 | 376—12—0 | 412—2—0 | 396 |
| 8 | 1908—1909 | 314—5—11 | 219—5—6 | 400 |
| 9 | 1909—1910 | 502—10—10 | 357—0—0 | 799 |
| 10 | 1910—1911 | 616— 7—1 | 370—13—11 | 1412 |
| 11 | 1911—1912 | 475— 9—1 | 322—6—11 | 1496 |
| 12 | 1912—1913 | 541— 7—0 | 276—15—7 | 1900 |
| 13 | 1913—1214 | 562—9—10 | 406—13—5 | 2065 |
| 14 | 1914—1915 | 849— 7—0 | 594—1—10 | 1580 |
| 15 | 1615—1916 | 3963—8—0 | 5050—11—10 | 2323 |
| 16 | 1916—1917 | 746—6—11 | 560—10—0 | 1248 |
| 17 | 1917—1918 | 3625—12—0 | 613—10—0 | 1596 |
| 18 | 1918—1919 | 8335—15—10 | 6585—7—0 | 1498 |
| 19 | 1919—1620 | 1382—5—9 | 2226—4—8 | 1726 |
| 20 | 1920—1921 | 1794—11—6 | 1872—0—4 | 1960 |
| 21 | 1921—1922 | 1122—10—1 | 1024—7—6 | 2673 |
| 22 | 1922—1923 | 1098—4—8 | 523—4—10 | 4050 |
| 23 | 1923—1924 } | 2613—9—11 | 2323—14—3 | 8850 |
| 24 | 1924—1925 } | | | |
| 25 | 1925—1926 | 995—12—9 | 797—2—5 | 5270 |

ధము ౨.

దలగువాని వివరము.

| కా. ని. సభలు. | బహి. సభలు. | కార్యదర్శి. | షరా. |
|---|---|---|---|
| 10 | 15 | రావిచెట్టు రంగారావు | |
| 9 | 7 | ,, ,, | |
| 10 | 4 | ,, ,, | |
| 12 | 8 | ,, ,, | |
| 7 | ... | ,, ,, | |
| 13 | ... | కర్పూరం పార్థసారధి నాయఁడు | బ్యాంకుదివాల. |
| 7 | 1 | ,, ,, ,, | |
| 13 | 2 | జొన్నలగడ్డ శోభనాద్రిశాస్త్రి | |
| ... | ... | కొమరగిరి సీతారామరావు | |
| ... | ... | కర్పూరం పార్థసారధినాయఁడు | |
| ... | ... | ,, ,, | |
| ... | ... | ,, ,, | |
| 6 | ... | ,, ,, | |
| 7 | ... | మాడపాటి హనుమంతరావు | |
| 6 | ... | సింగపెరుమాళ్లు నాయఁడు | మందిర నిర్మాణ ప్రారంభము. |
| 7 | ... | ,, ,, | |
| 9 | ... | ,, ,, | |
| 5 | ... | ,, ,, | |
| 6 | ... | ,, ,, | |
| 12 | ... | ,, ,, | |
| 11 | 1 | మల్లాది లక్ష్మ్మనరసింహారావు | మందిర ప్రవేశోత్సవము. |
| 12 | 6 | నల్లకొండ నరసింహారావు | |
| 10 | 11 | ఐ. నరసింహారావుగారి శంకరవర్మ<br>చె. రామచంద్రరావు పి.వి. శర్మ | |
| 17 | 1 | వారణాసి సుబ్బారావు | |

# అనుబంధము ౩

## ఆస్తి వివరము.

| సంఖ్య. | పేరు | | విలువ |
|---|---|---|---|
| **1.** | భవనము (బాల్కనీ హాల్) | | రూ॥ 12,000 |
| 2. | పుస్తకములు | | 5,000 |
| 3. | నిలువ ధనము | | 1,857 |
| 4. | పటములు | 19 | 550 |
| 5. | గ్రంథముల పెట్టికలు | 460 | 345 |
| 6. | బీరువాలు | 7 | 250 |
| 7. | ఎలెక్ట్రిక్ ఫిటింగ్సు-డిపాజిటు | | 175 |
| 8. | కుర్చీలు | 26 | 150 |
| 9. | బెంచీలు | 13 | 125 |
| 10. | మేజాలు | 6 | 120 |
| 11. | గడియారము | 1 | 30 |
| 12. | ఎలెక్ట్రిక్ బల్బులు | 12 | 15 |
| 13. | బోర్డులు | 2 | 10 |
| 14. | చిలుమానులు | 6 | 10 |
| 15. | సైకిలు స్టాండు | 1 | 8 |
| 16. | చిల్లర సామానులు | | 5 |
| | | మొత్తము | రూ॥ 20,650 |



# శ్రీకృష్ణ దేవరాయలు

శ్రీ ఆదిపూడి-సోమనాథ రావు.

సీ. శ్రీసరస్వతులకుఁ జెలిమినిఁ గలిగించి
కీర్తిఁ గాంచిన దివ్యమూర్తి యనఁగ
శైవ వైష్ణవులకు సఖ్యత నొనరించి
నన్నికెక్కిన భక్తవర్యుఁ డనఁగ
విక్రమకృపలకు విమలమైత్రినిఁ గూర్చి
వెలసిన వీరాతివీరుఁ డనఁగ
నాంధ్రకర్ణాటుల కైకమత్యముఁ గొల్పి
దనరుచుండిన మహోదారుఁ డనఁగ
దేజరిల్లిన శ్రీకృష్ణదేవరాయ
చక్రవర్తికి సముఁడు భూచక్రమందుఁ
గడఁగి వెదకిన నెచటనే కాలమునను
గానరాఁడు నిజమ్ముగాఁ గానరాఁడు.

సీ. ఇతని చక్కఁదనంబ దెంతటిదో తెల్ప
నాచిన్నమాదేవి నడుగవలయు
నితని పరాక్రమం బెంతటిదో తెల్ప
నాయదిల్ఖానుని నడుగవలయు
నితని కారుణ్యంబ దెంతటిదో తెల్ప
నాకళింగాధీశు నడుగవలయు
నితనిరసజ్ఞత యెంతటిదో తెల్ప
నాపెద్దనకవీంద్రు నడుగవలయు
ననిన శ్రీకృష్ణదేవరాయాఖ్యనృపుని
దివ్యగుణముల నెల్లను దేటపరుప
నొక్కనరునకుఁ బరమాత్మ కొక్కఁడేని
తరముగాదు నిజమ్ముగాఁ దరముగాదు.

సీ. చొచ్చె నారణమున హెచ్చిన కడకతోఁ
ద్రచ్చును రిపుల వివ్వచ్చుపగిది
యిచ్చె నాదీనుల కిచ్చలెల్లను సిరి
కలిమిలో మించును కర్ణుపగిది
మెచ్చె నాకవులను మేల్మేలనంగను
బూజించు నాభోజరాజు పగిది

వచ్చెనాసభలోని వారలెల్లనుబొంగ
నెంతయుఁబొల్చు దేవేంద్రు పగిది

యిట్టి నిర్వక్రవిక్రమం బిట్టి యీవి
యిట్టి సౌజన్యవినయంబు లిట్టి ఠీవి
యిలను శ్రీకృష్ణదేవరాయలకుఁ దక్క
నొరున కేనృపునకు నేని నుండఁ గలవె?

సీ. తల్లి ఋణంబు దాఁ దీర్ప నెవ్వండు
మాతృభాషకు నిచ్చె మండనముల
దండ్రి ఋణంబును దాఁ దీర్ప నెవ్వండు
ప్రజలకుఁ గూరిచెఁ బలు సుఖములు
తాతల ఋణమును దాఁ దీర్ప నెవ్వండు
కర్ణాటరమ కిడె గౌరవముల
దైవఋణమ్మును దాఁ దీర్ప నెవ్వండు
ధర్మమునం దుంచెఁ దనవి యెల్ల
నట్టి శ్రీకృష్ణదేవరాయాఖ్యనృపుని
కన్మ సత్కృతు లొనరించి యందఱమును
ధన్యులగుదము లెండు వదాన్యులార
యమలగుణసాంద్రులార యో యాంధ్రులార.

సీ. ఆంధ్రభాషానిలయమ్ము నానృపుపేర
నీ భాగ్యపురిని నిర్మింప నదియు
నిరువదియైదేండ్ల యెలప్రాయమును బొంది
యలరారు చుంటకో హర్ష మొంది
రమణీయ మగురీతి రజతోత్సవమ్మును
సలుప నెంచిరి సభాసదులు గాన
రండు మీకానుకలఁ దెండు సద్భక్తితో
నిండు దీవెనల గైకొండు లెండు
దీనికంటెను శ్రీకృష్ణదేవరాయ
చక్రవర్తికి మన కృతజ్ఞతను దెలుప
నాచరింపంగ వలసిన దన్య మున్నె?
యమలగుణసాంద్రులార యో యాంధ్రులార!



శ్రీ. శ్రీ. సీతారామభూపాల బహద్దురు, గద్వాలసంస్థానాధీశులు.



# కృష్ణదేవరాయల విద్వత్సభ

(భావనాకల్పిత వర్ణనము.)

శ్రీ గాడేపల్లి సూర్యప్రకాశరావు. ఎం. ఏ., ఎల్. టి.

నేనొకసారి హంపికి బోయియుంటిని. విజయనగర మహారాజ్యమునకు రాజధానిగానుండిన హంపికి. మహోచ్ఛ్రితైశ్వర్యములం దులదూగి, భారత జనని కంఠహారమున వ్రేలాడిన అమూల్యమణి హంపికి. కృష్ణదేవరాయని కనిపెంచి, అతనిచే ప్రేమింపబడి పాలింపబడిన, హంపికి. అలసాని పెద్దనాదులు తమ కవితా గాన మాధురిచే మారుమ్రోగించిన పుణ్యభూమి హంపికి. విజయనగర మహారాజ్యము నాశనమంది జనులచే మరవబడినదై ప్రస్తుతము ఎట్టిదైన సరిగ పోవుటకు వీలులేని మూలమూల పడియుండి సుందరమగు నామమును గోల్పోయి, ప్రస్తుత వికృత నామమును ధరించినదై, తన ఐశ్వర్య, సౌఖ్యభాగ్యముల గోల్పోయి వైధవ్యము ననుభవించుచున్న హంపికి. లెక్కలేని మణిరాసులతో మూల్గుచుండిన అంగళ్లవరుసలుగల్గిన ఆవీధులం దిపుడు రండుసకాగము లున్నవి, మురమరాలమ్మునవి, ఉప్పుమిరపకాయ లమ్మునవి. నిరంతర ఆనంద వైభవములం దోలలాడిన జనులతో నేలయీనినట్లుండిన ఆనగరమం దిప్పుడు, ఆబాలగోపాలము జనాభా ఏబది మంది. రాజరాజు లూరేగిన పురవీధు లిప్పుడరాజకములై మృగరాజుల స్వేచ్ఛావిహారముల కనువైయున్నవి. కవిగాయక ప్రసంగములతో సెల్లవేళల ప్రతిధ్వనించిన యాప్రాంతములం దిపుడు కాకులైన అరవుటలేదు. దేవాలయములు దయ్యములకును, గుళ్లగర్భాలయములు గబ్బిలములకు నాలవాలములు. పాటియిండ్లు, వాకిళ్లు, నేడు పాముదిబ్బలు జొన్నపొలములు.

అనూ్యా! ఏమిది? ఐశ్వర్యలక్ష్మీ! కవితామతల్లీ! యని పిలచిన, ఓ! యని మార్మ్రోలికిన ఆప్రాంతములు కంతేకె పరవశ్యపట్టినది గదా యని దిగులుపడుచు, అట్టేపోవుచుండ ఎంతదూరముపోతినో తెలియకనే యుండెను. ఎన్నెన్ని స్థలములనో జూపిరి నామార్గదర్శకులు: ఏటులు కాపురము లుండినయిండ్లు, ఏనుగులుగట్టుసాలలు, రాణివాసపు ప్రాకారములు, రాణులుండిన యాగారములు, జలక్రీడలకై నిర్మింపబడిన వినోదస్నానగృహములు ఎన్నెన్నియో జూపిరి. ఎన్నెన్ని ముచ్చటలో ప్రసంగించిరి. మఱియు చెవొడలు తెప్పరకున్నడెను. ఇంకనుపోయితిని. మరికొన్ని ప్రాకారములు గాన్పించినవి. తన్మధ్యమున కొన్ని పెద్ద దిమ్మలు రాజుల గృహములందలి పెద్ద అరుగులవంటివి, అంతకన్న ననేకరెట్లు పెద్దవి, కొన్ని చినవి. అవి యేమని ప్రశ్నింప విజయనగరరాజులు సింహాసనాసీనులై దర్బారు గావించిన మహలులని చెప్పిరి. ఒకచోటు జూపి సింహాసనముండినగది యనిరి. కొన్ని రాళ్లు మనినవి ఇంక మఱేమియు రాలేదు. ఇంతకు పూర్వమే స్మృతి దప్పుచుండిన అవస్థలోనుండిన నాకిప్పుడు బాహ్యవిషయములతో సంబంధము తెగిపోవుచుండెను. ఇంతకు పూర్వమే ప్రాపంచిక విషయముల పూర్తిగ మరచిన నా భావాకాశమున మబ్బులన్నియు వెడలి, ఒక్కసారిమ్రగ్గమ్రొ వేసెను. దేశకాలపాత్రములు, కార్యకారణ సంబంధముల జ్ఞాపకములేకయే చిత్తవీధిని చిత్రవిచిత్రభావము లెగయుచ్చెను. అచ్చట నెల్లెడ పడియుండిన బండలు, అచ్చట స్వేచ్ఛగా మొలచిన తుప్పలు, అచ్చట బాయుమయమైన నిర్జనత్వము, నాకు గోచరమే కాలేదు. దేహము పైకెముగ్గి మ్రొగ్గెను. ఆత్మ తన్మయత్వముననుండెను. మెలకువగానుండియు నొక అవ్యక్తస్వప్నావస్థయందు బడిపోయిని.

ఓహో! ఏమి సుశోభనదృశ్యము! బండ్లన్నియు జయ జయ ధ్వానములు మ్రోగించు దిక్కులనెల్ల గాన్పించినవి. తుప్పలన్నియు నగరునలంకరించు రంగు రంగుల మొక్కలై చూపట్టినవి. అనిర్జన ప్రదేశమంతయు, జనసంకీర్ణమై, అప్రాకారమంతయు, అపూర్వప్రభాసంతమై, ఎప్పటితేజముతో నిండిపోయినది. ఎట్టయెదుట మహాలు మహావైభవముగ నలంకరింప బడియుండెను. ఎల్ల చోటుల జను లుత్సాహముతో దిరుగుచుండిరి. ఏకారం తరుగులేక సుఖజీవనమును జేయుచుండు బ్రదెల్ల ఆ ఆత్మ సంతుష్టిని ప్రతిబింబించు ముఖబింబములతో దిరుగాడు చుండిరి. ఇంక కొంచెము ముందునకు నడిచిన. నగరు సింహ ద్వారము గన్పట్టెను. నెంతినడచినను. ద్వారపాలకులు కసరక, విసువక, అతిగౌరవమును జూపుచు లోనికేగ దారి జూపిరి. ఇట్లే రెండుమూడు ద్వారములు దాటితిమి. ఆద్వారముల చక్కదనము, ఆకట్టడముల సొగసు, అచ్చటి మహాశోభను వర్ణింప నలవి కాదు. మానవనిర్మితములేనా యని అచ్చెరువునొందెను. చిత్రముల జూచి నది సమయము కాక పోవుటచే తిన్నగ బోతిని. అనేవనాంతరమున నొక పెద్దచావడియందు మహాసభయొకటి తీరియుండెను. కన్నుల వైకుంఠమైదోచెను. కేవలము ఇంద్రసభ ననుకరించి యుండెను. ఆసభామధ్యమున, రత్నమణులతో పొదిగిన, యొకయున్నత వేదికపై ధగధగద్యుతులతో వెల్గుచుండిన, విజయనగరసింహాసనము, అత్యంత శోభావంతమగు నాకృష్ణదేవునికనకపీఠము ఇంద్రనీల కాంతులతో, శత్రునేత్రముల కసూయాజనకమై, మిత్రహృదయముల కానందదాయినియై, శోభిల్లుచుండెను. తత్సాన్నిధ్యమున, సామంత రాజులనేకులు అర్హాసనముల నాసీనులైయుండిరి. సింహాసనమున కొకప్రక్క రాజపురోహితుడును, ఇంకొకప్రక్క తిమ్మరుసును ఉపస్థితులైయుండిరి. సభ క్రిక్కిరిసి యుండెను. కవిగాయక పండితప్రముఖులతో, చక్కని కోలాహలము జనించుచుండెను. మున్ముందొక ముసలి బ్రాహ్మణుడు, శిరముపై నెరిసిన వెంట్రుకలు, వంగినంగ బోవుచున్న దేహము, చెవ్రలరత్నకుండలములు, భుజమున ముత్యాలువలుధరించి, తత్సభాబృహస్పతియే యనునట్లు దోచుచుండెను. ఆయన యెవ్వరనియడుగ, ఆంధ్రకవితాపితామహ అల్లసాని పెద్దనామాత్యుడని చెప్పిరి అక్కడివారు. మనుచరిత్రయింకయు నాతనిహృదయకుహరమున నెచ్చటనోదాగియుండెనప్పటికి. అతనికి కొంచెము దూరమున, అంతటికవితాకాంతులతో ప్రభవిల్లుచుండిన, అట్టిరత్నకుండలముల, అట్టిముత్యాలువల ధరించి యింకొక మహనీయుడాసీనుడైయుండెను. వారెవరని ప్రశ్నించితిని. అతని నెరుంగవా? నందితిమ్మనామాత్యుడాతడేయని, అతనిముద్దు పల్కుల మృదుమధుర్యమును పలువిధముల పొగడుచు సమాధానము జెప్పిరి. తర్వాత కొంతకాలమునకు తన చక్కని, పారిజాతాపహరణము, ను కృష్ణదేవుని కితడు కృతి యిచ్చెనని విన్నప్పుడు, నాడు జూచిన యామధురకవి స్వతియవతారము కన్నులగట్టినట్లు గాన్పించెను. ఆప్రక్క నింకొకరిని జూపి యాతడే కవిధూర్జటియనిరి. ఈతడప్పటి కింకయు కృష్ణదేవుని మన్ననలనంతగా నందలేదు. తతనయ సుహాసయినప్పటికిని తన భావిఘనతను, కాళహస్తీశ మాహాత్మ్యసత్వమును హృదయ గోళమందిముడ్చుకొని నొక్కచో కూర్చొనియుండెను. ఇంకయు నిరువురిం జూపి యొకరిని అయ్యలరాజురామభద్రకవి యనిరి. ఇంకొకరిని మాదన్నగారి మల్లనకవియనిరి. వీరు మాసభాదిగ్గజములని గర్వముతో బల్కిరి. ఇంకొకరు, మరిముగ్గురను జూపివారి నామముల జెప్పిరి. సభాకోలాహలములో స్పష్టముగి వినరాలేదు. భట్టు, రామకృష్ణ, సూరయ. అనునట్లు ఒకానొక మాత్రము వినవచ్చెను. తర్వాత కొంతకాలము పిమ్మటనీవిషయములగూర్చి వారే వసుచరిత్ర కారకుడగు భట్టుమూర్తి, పాండురంగ మహాత్మ్యకర్తయు, వికటకవియు నగు తెనాలిరామకృష్ణుడును, ప్రభావతీప్రద్యుమ్న కళాపూర్ణోదయాది ప్రబంధరాజముల రచించిన పింగళి సూరనామాత్యుడును అనుకొంటిని గాని, కృష్ణదేవుని కొలువెక్కడ వీరెక్కడయని తెలిసికొని వారెవరో వేరనిగ్రహించితిని. ఇంతేగాక, అనేకులు, ఇతర రాజ్యముల కవి పండితోత్తములు రాజధర్శనార్థము వచ్చి సభామండపమున నాసీనులై యుండిరి.

నాడేవో పండిత చర్చలు, సమస్యాపూరణములు కవుల కత్సతేవేవో జరుగునని చెప్పుకొను చుండిరి. సభాకేదిక్కు కిరు ప్రక్కల సుదూరమున, సైనికభటులు బారులు దీర్చియాయుధపాణులై నిలచియుండిరి. ఎట్టయెదుట నొక్క నగరునందు, రాణులకును, స్త్రీలకును సభాదేదుకలుచూడ

చేర్పాట్లున్నట్లు దోచెను, ఆదాసదాసీజనుల కోలాహలమును, అక్కేల వైచిన పట్టుపరదాలను బట్టిజూడ. అనగరున కిరు ప్రక్కల, సభ కెదురుగ ఐరావతముల బోలినరెండు మదపుటేనుగులు, జల్తారు కొండలై నిలచియుండెను. ఇంక కొంచెము దూరమున సుశుభ్రధావళ్యముతో మిసమిసలాడుచుండిన అశ్వరాజములు రెండు, బంగారు హారములచే నొడలంతట నలంకరింపబడి, సరిగెల పచ్చడములుమూపున నమర్చబడి మణిమయములగు తురాయిలుముఖముల నమర్చబడి నిలవబడియుండెను. ఓహో! ఏమి ఆదృశ్యసౌందర్యము! ఆసభామండపశోభ! తలవని తలంపుగాబోయి ఆసభను జూచు మహాభాగ్యమును పొందినందులకు ఎంతయు పొంగుచు కండ్లజారుకొను చుంటిని దృశ్యమును. కస్తూరి జవ్వాజిగుమగుమ, మంగళారావములు, భేరికాస్వనములు, ఇంద్రియానందకరమగు శోభ, ఆత్మానందకరమగు వైభవము వర్ణింపనలవి కాకయుండెను. ఇంతలో నొక కదలిక పుట్టెను సభయందు. తిరిగినిశ్శబ్దము తిరిగి సంచలనము. మరల నిశ్శబ్దము మరల మాటలరొద. అంతనొక్కసారి చూడ్కులన్నియు తూర్పుదిశ తిరిగెను. ఒక్కటేనిశ్శబ్దమై పోయెను సభాప్రదేశమంతయు. తెలతెల్ల వారు ఝామున కులాయముల శకుంతములన్నియు చక్కనికలగానములం జేయుసమయమున, లోకమంతయు చల్లగనుండు సమయమున, మనుశేత పిల్లగాలులు, హాయినొసంగుచు చల్లగ, మెల్లగ విసరు సమయమున, విశ్వమంతయు సౌఖ్యసౌరభములతో అప్పుడె విడచుమొగ్గల గుమగుమలతో నిండియుండెడు సమయమున, తూర్పుదిశ తెల్లనై ఎర్రనై తోచెడు సమయమున, మేఘాల తెరలను, ఇట్టెదప్పించికొనివచ్చులేతసూర్యుని లావణ్యాంపుశీలితో. నగరుతూర్పుద్వారమున శ్రీకృష్ణ దేవోదయమయ్యెను. ॥ప్రజల రాజాధిరాజ వీరప్రతాప, బహుపరాక్!! రాజపరమేశ్వరార్ధమర్గాటటీశబహుపరాక్!! సాహితీసమరాంగణ సార్వభౌమ, బహుపరాక్!! శ్రీకృష్ణదేవరాయేంద్రచంద్ర, బహుపరాక్!!! అనుచు, రాజభటులు బహుపరాక్కుల బల్కు, సేవకబృందములు వెంటరా, పారిపార్శ్వకులు ఇరుపార్శ్వముల గొల్వ, వారి జేతులం జేతులానుకొని, మెల్లగ వచ్చుచుండెను, కృష్ణదేవుడు, సభావేదిక నాతడు. సభయంతయు సముద్రమువలె నొక్కసారిగ లేచెను, ఆనంద కోలాహలము గావించుచు. సభామండపమును ప్రవేశించి, కృష్ణదేవుడు మున్ముందు పురోహితునకు ప్రణమిల్లి ఆశీర్వచనముల బొందెను. తిమ్మరుసునకు నమస్కరించి దీవనలందెను. పెద్దనార్యుని చిరునగవునగారవించి హర్షమనస్కుడయ్యెను. చక్కని చూడ్కులతో సభనంతకలయజూచి, సింహాసనాసీనుడయ్యెను. ఇరువంకల సేవకులు వింజామరలు వీవసాగిరి. కనుసన్నల భృత్యులు మెలగజొచ్చిరి. తాంబూల పళ్లెరము ముందుంచ బడెను. హాజర్కబరి దారులు తమతావులందుండి తమకార్యముల గావించు చుండిరి. సభాసదులును యథారీతిగ నుపస్థితులైరి. సూర్యభగవానుని తేజస్ఫూర్తి వెలిపడచిన కమలముల వలె వికసించి యుండెను, ఎల్లరి ముఖసీమలు. ఓహో! ఎంతటి భాగ్యశాలురో కదా అట్టి చక్రవర్తి యేలుబడి యందుండెడి ప్రజలు అనిపించినది. వారిపరస్పర ప్రేమగౌరవములు సభయందంతట నొక నూతన రాగమును వెద జల్లినవి.

సింహాసనాసీనుడయిన ఆచక్రవర్తి వర్ణన, కవులు చేయవలసినదే కాని నా కలవికాదు. ప్రేమకాంతులవెదజల్లుచుండిన, ఆతని సౌందర్యము, పాండిత్యప్రభావమును చాటుచుండిన అనుభవర్చస్సు, ప్రేమయందు భయము, భయమునందు భక్తి, మెత్తదనమునందు కాఠిన్యము, కాఠిన్యమునందు కరుణారసమును జూపరుల హృదయముల పురిగొల్పు ఆగాంభీర్యసౌందర్యకళ వర్ణనాతీతములు. ఆతడు ధరించిన నీలి పీతాంబరములు, అతని కంఠ మందలి రత్నహారములు, అతని కిరీట మందలి వజ్ర వైడూర్యములు, కనకకాంతులీనుచున్నయుండిన కనక సింహాసనము అతనికి శోభ నొసగిన దనుటకన్న అతని సంపర్కము వల్ల నవియె శోభాయుతములై విరాజిల్లిన వనిన ఎక్కువ యదార్థముగ నుండును. అట్టిదేహధావళ్యము, అట్టి రూప లావణ్యము అవయవసౌష్టవము, ఆకన్నుల కాంతి, ఆఫాల వైశాల్యము, ఆభ్రుకుటులశా సౌందర్యముల విలాసములవి, ఎంత జూచినను తనివితీరనివి యుండెను.

కొంచెము కాలము తిమ్మరుసుతో ప్రస్తావించిన పిమ్మట, నాడు క్రొత్తగ దక్షిణ రాజ్యమునుండి యేతెంచిన కొందరు గాయకులను జూచి తన గానవిద్యా నైపుణ్య

ప్రవర్తింప నాజ్ఞాపించెను. రాజాజ్ఞయగుట తడవుగ తంబురలు శ్రుతుల్గని మోగినవి. మృదంగములు ధంధణుధణు ధంధిమల్లు ధ్వనించినవి. వీణెలు, కిన్నెరమెట్ల బంతులు సంగాతపు సన్న బంతుల, గోటు మీటు జల్ప్రవాతిల మేళగించినవి. జిల్లన సభయంతయు నొక్కసారి ఆనందములో మునిగి పోవునట్లు గాయకులు గాన లహరి ప్రవహింప జేసిరి. తమ అద్భుతగాన కౌశలముచే సభాసదుల హృదయముల నెంతయు రంజింప జేసిరి. నడుమ నడుమ చక్రవర్తియు, రాగభేదముల గూర్చియు, తాళభేదముల గూర్చియు, సాహిత్యముల గూర్చియు, సంగీత సాంప్రదాయముల గూర్చియు గాయకులతో జేసిన ప్రసంగముల బట్టిజూడ, కేవల వినోదార్థము సంగీతముల నాలకించుటయే కాక, గాన విద్యయందును చక్కని ప్రవేశము కూడ నాతనికి కలదని స్పష్టమయ్యెను. అంత గాయకుల కుచితసత్కారములం జేసి, అట్లే గాన విశేషముల గూర్చి ముచ్చటించుచు, గానమునకును, కవనమునకును గల సంబంధమును గూర్చి చర్చించుచు, క్రమక్రమముగ కవితా గోష్ఠిలోనికి దిగెను. అంత కవిత యెట్లుండవలెనని ప్రశ్న జనించెను. కొందఱు, పదకాఠిన్యము లేక, భావగూఢత్వమించుకయు లేక, ఒలచిన పండు చేతిలో నుంచినట్లు బట్టబయలుగ నుండునదే కవిత యనిరి. మరి కొందరు, అదేటి కవిత? పాండితీ ప్రాగల్భ్యమును జూపుచు, భావగాంభీర్య యుక్తమగుచు, నిగూఢముగా నుండునదే కవిత గాని వేరొండు కవిత గాదనిరి. కృష్ణరాయలీ యభిప్రాయముల చిన్న చిరునగవుచే బహూకరించి తన యెదుట నాసీనుడై యుండిన పెద్దనార్యుని వంక దృష్టి సారించి, తన యభిప్రాయమును ప్రకటింప హెచ్చరించెను. అంత నాకవి కుంజరము మెల్లన లేచి, గౌరవమునకు మిగుల నెగడుచుండిన కంఠస్వరముతో నీక్రింది చంపకమాలను ఆశుధారగ జదివెను.

చ॥ ఘనతరఘూర్జరీస్తనయుగ
క్రియగూఢము గాక ద్రావిడ
స్తనగతిఁ బేటగాక మఱి
చాటగు నాంధ్ర వధూటి చొక్కపుం
జనుగవ చీలగూఢత ను
జాటువనంబును లేక యుండఁజె
ప్పిన యదె పో కవిత్వ మని
పించు నగించుటు గాక యుండినన్

ఈ భావ సమంజసత్వమున కెంతయు సభాసదులు పొంగిరి. సభ యంతయు సంతస ధ్వనులతో నిండెను. కృష్ణదేవుడును అమితానందము నంది, "మహాశయులారా, మీరలలో నెవ్వరేని, ఆంధ్ర సంస్కృతి కవిత్వ లక్షణము లుండవలయు రీతి వర్ణించుచు, ఉభయ భాషా పాండిత్యము వెల్లడియగు నట్లొక్క యుత్పల మాలికం జెప్పి, వన్నానందింప జేసి యీ కవి గండ పెండేరము నందుకొనుడని కోరెను. ఎవ్వరును లేచి సాహసింప రైరి. సభ యంతయు నిశ్శబ్దమై యుండెను. అంత కొంత సేపటికి పెద్దనామాత్యుడే తిరిగిలేచి చక్రవర్తి కెదురుగ నిలచి, ఒక్కసారి నిమీలిత నేత్రుడై, చేయెత్తి, ఆకాశము నుండి గంగను ప్రవహింప జేయుచున్నట్లు, లేక ఏ మహా ప్రవాహమో ఏదియున్నత పర్వత తలము నుండి దూకుచు జారునట్లు తన కవితా ధారను సభా మంటపమున ప్రవహింప జేసెను.

అయ్యద్భుత భావస్ఫోరణకు, భావప్రావీణ్యతకు సభయంతయు నిశ్చేష్టత నొందెను. కృష్ణరాయలు పట్టరాని యానందమున, రాజరాజు లేతెంచిన లేవని తన సింహాసనమునుండి దిగ్గున లేచి, పనిచి ప్రక్కరమున నుండిన యా కవి గండ పెండేరమును దీసి స్వయముగ పెద్దన కవి పాదముల తానె తొడిగెను. పెద్దన కవితా ప్రావీణ్యతకు, కృష్ణరాయని రసజ్ఞతకు, సరసతకును మెచ్చి సభ యంతయు జయ జయ ధ్వానములతో చెలరేగెను. వాదముల కేతెంచిన పండితులు కూడ వచ్చెరు వంది పెద్దనను స్తుతింప సాగిరి. అంతటితో వారి వాదముల వదలు కొందు మనిరి. ఆశ్చర్యభరితులని, ఈ అద్భుత చర్యలను జూచి మేము రాజులు నట్టి విగ్రహులని, ఒక చేత కత్తి, ఇంకొక చేత పల్లెమును బూని యుండు వారని, ఎట్టివారలైన అంధులై తృణప్రాయముగ జూచు వారని, ఇట్టి యాచారముల కలవడిన నేని కోమల స్వభావమునకు, ఈ అద్భుత ఔదార్య సంపదకు, ఈ కవితా గౌరవమునకు,

అమితాశ్చర్యము నందితిమి. ఇదంతయు స్వప్న ప్రాయముగ దోచెను. మాకు రాజునాస్థానముపై గౌరవము జనించినది. అచ్చటి వారును, అమితోత్సాహ పూరితులై ఎవరి మట్టుకు వారే కవిగండ పెండేరము నందినట్లు సంతోషించిరి. నిజమే! భాషామాత కొనర్చిన గౌరవము, తద్భాషా సంతాన మందరిది గాక యొక్కరిదా? 'చతుర కవిత్వ తత్త్వ పటుసంపద యొక్కరి సొమ్ము కాదు. భారతీదయ సౌధవార్ధి' యనినట్లు, భారతి లోక పావని, లోక జనని, ఆమెను గౌరవించుట లోకమునంతను గౌరవించుటయే. గౌరవార్హమగు సందర్భము కలిగినప్పుడు, రాజైన నేమి, రాజ రాజైన నేమి, చేతులం జోడించి జోహారొనర్చ వలసినదే! మహారసికుడు గనుక కృష్ణదేవుడీ సంగతి గ్రహించెను. తర్వాత మనుచరిత్ర నందుకొనువేళ పెద్దన యూరేగ బోవుచుండ స్వయముగ పల్లకి తా జేత బట్టి యెత్తెనట! కృష్ణరాయలు భారతికి జూపిన యీ భక్తి గౌరవముల ప్రసాదము మీద నే మనమింకయు భాషాజీవనము జేయుగల్గు చున్నారము. ఎట్లుమరువగల మీమహానుభావుని మనము! మరచి ఎట్లు బ్రతుకగలము ఆంధ్రులమను పేరుతో?

ఇక సభ సంగతి. సంతోష కోలాహలము కొంచెము కొంచెము తగ్గుచుండెను. చక్రవర్తి యింకయు మందస్మిత వదనముతో నేదియో ముచ్చటించుచుండెను, పెద్దనామలతో. ఆసంభాషణల నింకయు బాగుగ విన వలెనని ముందుకు బోవుచుంటిని. హృదయ మానందము పట్ట జాలకుండెను. తిరిగి యెప్పుడో ఇట్టిభాగ్యము లభించుట జీవితమున యని, అంతయు నాడే యనుభవించవలెనను ఆశతో ముందు ముందుకు వంగి వినుచుంటిని.

ఇంతలో ఏమిది! పాదమునం దపరిమితమగు బాధ జనించెను! వెనుక నుండి భయంకరములగు ధ్వనులు వినవచ్చెను. హృదయము కొట్టుకొనజొచ్చెను. నలుప్రక్కల కూతలు వినవచ్చుచుండెను. ఎవరో మనుజు లిటు నటు పరుగు లిడుచుండిరి. గుండెలు ఝల్లు మనినవి!

ఆసభ యెక్కడ? ఆకృష్ణదేవుడేడి? పెద్దన యెటకు బోయెను? సభా భవనమేడ?! ఏమి యీ మాయ యంతయును! ఒక్క సారిగ రెక్కల గట్టుకొని గాలిలో కెగిరి పోయినదే సమస్తమును! అయ్యో! అయ్యో! అని బిగ్గరగ ప్రశ్నించి విలపింప జొచ్చితిని. నామార్గ దర్శకులు నన్ను జేరి, ,,అయ్యా! ఏమిది, ఎచ్చటెచ్చటకో అట్లె బోతిరి యొంటరిగ? చాల తడవైనది. సూర్యుడస్తమించినాడు. చీకట్లు చెలరేగుచో నిచట వాగిన ప్రమాదము సంభవించును. ఇప్పుడే లంబాడి వాండ్లు కొందరు మార్గస్థుల నెవ్వరినో గొట్టి పరుగులెత్తిరి. త్వరలో బండెక్కి ఈతుప్పలు వదలి ఇల్లు చేరనిచో ప్రమాదమగునని హెచ్చరించిరి. ఇంతటితో తెలివి తెచ్చుకొని, విజయనగర సామ్రాజ్యము నిట్లే గదా ఒక్క రోజులో మాయమైనది! ఈరాత్రి సుఖ వాయువులందేలు చుండిన సామ్రాజ్యము మరునాటికి దుఃఖనాళవ సముద్రములో మునిగి పోయినది గదా! నాకలయు నంత కల్లగాదనియను కొనుచు, ఇంక భావనాశీలనమును, భావోద్రేకమును గట్టిపెట్టి, కృష్ణదేవుని విద్వత్సభ కంచెల పార్శ్వసి, నేనిల్లు చేరితిని.



# తెలుఁగుభాష

శ్రీ సిరుగూరి-జయరావు, బి. యస్సి.

ఒకవంక నాంగ్లేయ సుకుమారి యిచ్ఛగింపులతోడ వలపింపఁ దలఁచుచుండ
మునుఁగులోదాఁగిలి మూఁతలాడుచునుర్దూభాషావనిత వలత్ బఱచుచుండ
అప్సరోభామినినంచు సంస్కృతకాంత పాలింపఁ బొంగారఁ బైఁబడంగ
“తగుదునమ్మా” యంచువగలాఁడి గ్రామ్యంపుఁ గులుకుమిటారితళ్కులునటింప
గీ. హిందీ కన్యను బెండ్లాడుమీ యటంచుఁ
పెద్దలండఱు బలవంతపెట్ట నకట!
చిన్నతనమునుండి నెచ్చెలిగనున్న
తెలుఁగుకన్నియ ముద్దులు తీఱ్చుటెపుడో?

సీ. చనుఁబాలు త్రాఁగునాఁడనురాగ మొలుకంగ “నమ్మా” యటంచుమాటాడునాఁడు
గోలికాయలనాడుకొనునాఁడు తగవులాటలలోనఁ దిట్టులుపలుకునాఁడు
అత్తింటికేగినక్రొత్తలో మఱదలిహాస్యోక్తులకు బదులాడునాఁడు
ముసలిముత్తాత నీరసముగా ‘వెళ్లిపోయెద’ నంచుఁ గడమాటవదలునాఁడు
గీ. చచ్చెనో! యెడలెఱుఁగదో! పిచ్చిపట్టి
రూపుమాసెనో? యన్యభాషాపిశాచి!
ఔర! యిటునుండి దాసరమాయెనేఁడు
తెలుఁగు కాఁపురమునఁ జెడ్డ తెగులువోలె?

సీ. తొలుతఁ గర్ణాటరాజుల సభాస్థలములో ముత్యాలసరులతో మురువుసూపె;
తమిళదేశములోనఁ దంజాపురంబులో రాజమర్యాదతో రహినెసంగె;
కుతుబషాహీనవాబతి గౌరవముసూప గోల్కొండలో ముద్దుపల్కులొలికె;
ఆంగ్లేయపండితులాలకించి శభాసునాఁ బ్రాచ్యపుటిటాలి నాఁగమించె;
గీ. అన్యభాషాపరులె తెన్గు నాదరింప
తన్నువిడనాడి పరభాష నెన్నుకొనుట

మౌర్ఖ్యమో? కైపా? తెగులా? యున్మాదమో? పి
శాచసావేశమో? పూర్వ శాపఫలమొ?

సీ. గోదావరీ తరంగోదాహృతనిదాన•విలసనంబులలోని కళలనెల్ల
కృష్ణాతరంగిణీ తూష్ణీకగతిలోని•లీలావిలాసినీ శైలినెల్ల
తుంగభద్రానదీ ద్రుతవిలంబితములోఁ•జెవికిఁపుకలిగించు రవళియెల్ల
కావేరికోర్మికా కలితసీమంతినీ•స్తనకుంభ గంధవాసనల నెల్ల
గీ. కలిపి మెలయించిన తెలుంగు కవితయుండ
ఖేంసునది మంచుగడ్డల దిగులు కొఱకు
అన్యభాషల నీరస స్తన్యమునకు
నాశచేసెదవేలనో యాంధ్రపుత్ర!

సీ సంస్కృత దాస్యమోహంబు కల్పించెను•రహిఁ భరతాన్వయరాజరాజు;
కర్ణాట శాసకక్రౌర్యంబు రానీక•రక్షించెననలఁ గర్ణాటరాజు;
పారశీకాగ్నిలోఁ బడిపోకఁ గాపాడెఁ•గుతుబషాహినవాబు గోలకొండ;
నాంగ్లభాషావ్యాప్తి సంతరింపగనుండ•"బ్రౌను"నామాంగ్లుఁడు ప్రాపునిచ్చె
గీ. అహహా! అన్యులె నిన్నిటు లాదరించి
కనికరించుచుఁ బోషించి గారవింప
ఆంధ్రమా! నీ కుమారులి ట్లంధులైరి
కాలపరిణామ మిటు ప్రతికూల మాయె

సీ. "గైటే" రచించినకావ్యంబులో పలి•రసమాంధ్రభాషలో నెసఁగుదాఁక
"మాకియవల్లియ" మహితరాజ్యాంగ తంత్రము•లాంధ్రభాషలోఁ దెమలుదాఁక
"ఐన్‌స్టైను" తారతమ్య నవీనసిద్ధాంత•గరిమంబు తెలుఁగులో నజలుదాఁక
భౌతికశాస్త్ర సంపద్వైభవము లెల్ల•మహితాంధ్రభాషలో మనెడుదాఁక
గీ. నిదుర నాఁకలిఁ బోనాడి నిత్యసాంప్ర
దాయముగ శ్రమకోర్చి యుద్దామగరిమ
భాషఁ బోషింప భూషింప వలయునంచుఁ
దెలుఁగుదేశంపుజనులార! తెలియరయ్య!!



# నిజాము రాష్ట్రాంధ్ర కవులు

శ్రీ శేషాద్రిరమణ కవులు, శతావధానులు

ఆంధ్ర దేశమునందుఁ జాలభాగము నిజాము రాష్ట్రమునం దున్నది. ఆంధ్రులలో సుప్రసిద్ధులగు రాజన్యులు పలువురు నిజాము రాష్ట్రము నందలి చరిత్ర స్థలములలో నివసించి వాఙ్మయమునకు శిల్పమునకు జాతికి నమోఘమగు సేవఁ గావించి కృతార్థులైరి. నిజాము రాష్ట్రములోని చాల భాగ మాంధ్రదేశ మనియు, సుప్రసిద్ధ పూర్వకవిపుంగవులలోఁ బలువురు నిజాము రాష్ట్రమునకుఁ జెందిన వారె యనియుఁ జాలమంది కింత వఱకుఁ దెలియదనియె చెప్ప వచ్చును. పరిశోధకులు బ్రిటిషు ఆంధ్ర దేశమునందె తమ దృష్టి ప్రసరింపఁజేసి చరిత్ర గ్రంథములు ముగించుటచే నిజాము రాష్ట్రము నందలి చరిత్ర మింత వఱకు మరుగున పడియె ననుటలో సాహసము లేదు.

నిజాము రాష్ట్ర వైశాల్యము ౮౨ వేల ౬౯౮ చదరపు మైళ్లు. అందాంధ్రభాగము ౪౧ వేల ౩౪౧ చదరపు మైళ్ల వైశాల్యమునఁ దెలుఁగు దేశము సగ భాగమునకుఁ జేరువలో నున్నది. నిజాము రాష్ట్రములోని పదియారు మండలములలో వరంగల్లు, కరీమునగరము, అత్రాపుబల్దా, మెదకు మహబూబు నగరు, నల్లగొండ యను నారు మండలములు సంపూర్ణముగా నాంధ్ర మండలములు. ఆదిలాబాదు జిల్లాలోని నిర్మల, చెన్నూరు, లక్సెట్టిపేట, తాలూకాలు తక్క మిగిలిన భాగము, నిజామాబాదులోని బోధను తాలూకా తక్క మిగిలిన భాగము, గుల్బర్గా జిల్లాలోని కొడంగల్లు తాలూకాయు రాయచూరు జిల్లాలోని అలంపూరు తాలూకాయు రాయచూరు తాలూకాలో మూడు వంతులు తెలుఁగు ప్రదేశములుగాఁ బరిగణింపవచ్చును. ఇటఁగల యాంధ్రులసంఖ్య ౭౪౧౯౫౭౭. ఇంత విశాలమగు ప్రదేశమును ఉపేక్షా దృష్టితోఁ జూచుట చేతనే ఆంధ్రుల చరిత్రము ఆంధ్ర కవుల చరిత్రము అసమగ్రములుగ భావింప వలసి వచ్చినది. యాదవ, చాళుక్య, చోళ, రాష్ట్రకూట, కాకతీయాది పూర్వ రాజన్యులు రాజధానిగాఁ జేసికొని పరిపాలించిన యీ నిజాము రాష్ట్రమున సమగ్రమగు పరిశోధనము జరుగునంత వఱకు మనదేశ చరిత్రము లన్నియు నసమగ్రములవక తప్పదు. ప్రకృతము నిజాము రాష్ట్రమునఁగల కవులెందఱో! సారస్వత మీ రాష్ట్రమున నెట్టి నూతన వికాసముల నొంది, యెన్ని యంతశ్శాఖలతో శోభించెనో! తెలుపుటకీ చిన్న వ్యాసము వ్రాయ నారంభించితిమి. విస్తరము ప్రత్యేక గ్రంథమున నివేదింతుము.

ప్రత్యేకించి నిజాము రాష్ట్రమునందు గల ఆంధ్ర కవులను దెలిసికొని చరిత్రము వ్రాయుట యవసరమై యున్నది. ఘనత వహించిన నిజాము ప్రభువుగారి పరిపాలనము నందున్న దేశములోని యాంధ్ర భాగమున గల పూర్వ కవుల చరిత్రములను సేకరించి నిజాం రాష్ట్రమందలి యాంధ్ర కవుల చరిత్ర వ్రాయుట చాల ముఖ్య కార్యము. నిజాము రాష్ట్రములోని కొంత భాగము సుప్రసిద్ధాంధ్ర దేశమను తలంపు జనసామాన్యమునకుఁ గలుగఁ జేయుటకుఁ బూర్వ ప్రశస్తి తెలిపి వాఙ్మయ నిర్వహణమునకు వర్తమాన నిజాము రాష్ట్రాంధ్ర సోదరులఁ బ్రోత్సహించుటకె యీ ప్రత్యేక చరిత్ర రచనము గావింప వలెనని మేము సంకల్పించితిమి

నిజాము రాష్ట్రము నందలి యాంధ్ర కవుల చరిత్రము వ్రాయుట సామాన్య కార్యము కాదు. ఈరాష్ట్రమునఁ గల ప్రాచీన గ్రంథములు సమగ్రముగా సేకరింపఁ బడలేదు. సమకూర్చి యుపయోగార్హముగా నుంపఁ బడిన



సహస్రస్తంభ దేవాలయాంతర్భాగము, హనుమకొండ.



సహస్రస్తంభ దేవాలయము, హనుమకొండ



సహస్రస్తంభ దేవాలయము, హనుమకొండ.

స్తోత్రములం జెను. సోమనాథుఁడు ఓరుగల్లునకు నాలుగామడల దూరమందున్న పాలకురికిలో సిద్ధిపొందెను. రుద్రదేవుని కాలమునఁగల కవులలో రామేశ్వర దీక్షితుఁడను సంస్కృత కవి యొకఁడు గలఁడు. హనుమకొండ శాసన మీయన రచించినది. ఈ కవినిఁ గూర్చిన వృత్తాంతము మనకేమియుఁ దెలియరాదు. గణపతి దేవుఁడు రుద్రమదేవుల కాలమునఁ గల విశ్వేశ్వర శివ దేశికుఁడు ఒక ప్రసిద్ధమహాకవి. ఈయన ఒకశతకము పురుషార్థ సారము అను పాత్రముల రచించెను. ఇంతవఱకున్న వర్ధమానపురమునందు రుద్రదేవుని కాలమునందున్న గోకర్ణుఁడు ఛందస్సును దెలుఁగులో వ్రాసెను. గోకర్ణ ఛందస్సును అప్పకవి పేర్కొనెను. కవి జనాశ్రయము భీమకవి కృతము కాదు గోకర్ణ కృతమను నొక వాదముగలదు. ఇది చర్చించుట ప్రకృతము కాదు. రుద్రమదేవి ప్రతాప రుద్ర చక్రవర్తులకు మధ్యకాలమునఁ గల కవులఁ బేర్కొనుటకు ముందు తిక్కన సోమయాజి ఓరుగంటికి వచ్చి గణపతి దేవునకు భారతము వినిపించి లోఁగొన్న సంగతి మఱువఁజనదు. ఈయన రాకకు ఫలితముగ సరస్వతీదేవి నిజామురాష్ట్రమునకుఁ బ్రసాదించిన కవి-మారన. ఈయన రుద్రమదేవి ప్రతాప రుద్రుల మధ్య కాలమునందుండి మార్కండేయ పురాణము తెనింగించెను. రంగనాథ రామాయణము కోన బుద్ధారెడ్డి యీ సంధి కాలముననే రచించెను. బుద్ధరెడ్డి యనియు బుద్ధరాజనియు నితని వ్యవహరింతురు. బుద్ధరాజు కుమార్తెయగు కుప్పాంబ వెలయించిన బూదపూరు శాసనము వలన రంగనాథ రామాయణము నిజాము రాష్ట్రమున జనించెనని విశ్వసింప వీలు చిక్కినది. బుద్ధరాజునకుఁ గుమారులగు కాచవిభుఁడు విఠ్ఠల రాజును గలసి తమ తండ్రి కంకితముగా నుత్తర రామాయణము ద్విపదగా రచించిరి. ద్విపద కావ్య రచనమునఁ బాలకురికి సోమనాథుఁడు ఆంధ్ర వాఙ్మయమున మొదటివాఁడు. తరువాతివారు బుద్ధరాజు, కాచవిభుఁడు, విఠలరాజు వీరందఱు నిజాము రాష్ట్ర వాసులే. కాన ద్విపద రచన జన్మస్థానము నిజాము రాష్ట్రమని చెప్పక తప్పదు. (ద్వితీయ) ప్రతాప రుద్రుని కాలములో రచింపఁబడిన కావ్యములలో సర్వోత్తమ గ్రంథము భాస్కర రామాయణము. ఇది ప్రతాప రుద్రునకింకిత ముండఁగ భాస్కరుఁడు తెనిఁగింప నారంభించెను. కడకీ రామాయణ మే కారణముల చేతనైన నేమి పలువురు పూర్తిచేసిరి. సమకాలిక కవులఁ బలువుర నొక్కమాఱు తెలిసికొనుటకీ రామాయణము తోడ్పడుచున్నది. భాస్కరుఁడు, హుళక్కి భాస్కరుఁడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్ర దేవుఁడు, అయ్యలార్యుఁడు భాస్కర రామాయణ భాగములఁ బూర్తిచేసిన కవులు. వీరందఱు నిజాంరాష్ట్ర కవులె. భాస్కరుఁడు సాహిణిమారన కంకితముగ అగ్న్యకాండమె గాక దశగతు లను గ్రంథము రచించెను. మల్లికార్జున భట్టు మహా విద్వాంసుని వలె నున్నాఁడు. ఇతఁడు సంస్కృతమున సరస్వతీ చంపు, ఉదార రాఘవ మను గ్రంథమును రచించెను. తక్కిన కవుల ప్రత్యేక చరిత్రములు సంగ్రహింప వలసియున్నది. రుద్రమ దేవి ప్రతాప రుద్ర దేవుల సంధికాలమున సంస్కృత కవులు కొందఱు గలరు. నృత్త రత్నావళి వ్రాసిన జాయ సేనాపతియు, గణమంజరి, విక్రమార్క చరిత్రము, నిఘంటువులు వ్రాసిన కవి భల్లటుఁడు, బాల భారతము వ్రాసిన అగస్త్యేశ్వరుఁడు, కపర్ది, విద్యా నాథుఁడు లోనగు సుప్రసిద్ధ సంస్కృత కవిరాజులు పలువురుగలరు. సూత్రములోఁ గాకతీయసామ్రాజ్యమునకు సంబంధించినకవులను దెలిపి కొంటిమి. సంస్కృత కర్ణాట భాషలో బహు గ్రంథములు వ్రాసిన రుద్రభట్టు, కేయూరబాహు చరిత్రము వ్రాసిన మంచనయు శివతత్వరసాయనము వ్రాసిన శివదేవయ్యయు, ప్రతాప చరిత్రము వ్రాసిన కాసె సర్వప్పయు, ద్వితీయ ప్రతాప రుద్రుని యాదరణము పడసిన ధన్యులు. ౧౩౨౩ తోఁ బ్రతాప రుద్రుని రాజ్య మంతరించెను. ఆంధ్రుల యైశ్వర్యము, స్వతంత్రముతోఁ బాటు చక్రవర్తియుఁ బరాధీనుఁడయ్యెను. అప్పటి సంఘటనమున నెన్ని యమూల్య గ్రంథములు పేరులేక రూపుమాసెనో నిర్ణయింపఁ జాలము. నాఁడు నశించిన రాజ్య చరిత్రము వాఙ్మయమునకు దెచ్చుకొని అరు వందల సంవత్సరములు గడచిన పిదప నిపుడు పరిశీలింప నిస్వల్ప సంఖ్యాకుల నామములు పుస్తకములు గోచరించినవి. సమగ్ర పరిశోధనము జరిగిన నెన్ని విస్మృతాంశములు బయలు పడునో!

కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమై యది మూడు భాగము లయ్యెను. ఒరంగల్లు, రాచకొండ, దేవరకొండ, మెదకులోనగు దుర్గములను లోఁబఱచి కొని కృష్ణ సరిహద్దు గాఁగల పశ్చిమాంధ్ర దేశమును (నిజాము రాష్ట్రము నంతయు) వెలమ వీరులు పరిపాలించిరి. ప్రతాప రుద్రుని రాజ్య పతనానంతరము యవన సేనా సముద్రమునకుఁ జెలియలి కట్టవలె నాగినవాఁడు రేచెర్ల సింగమ నాయఁడు. ఈయన యనంతరము ప్రసిద్ధులు తత్పుత్రులగు అనపోతా నాయకుఁడు మాధవ రాయలు. తరువాత విస్తృతమగు నీవెలమ రాజ్యము యవనుల దాడుల వలనను గద్వాల మెదకు ప్రాంతముల నున్న రెడ్డి దొరల తిరుగు బాటు వలనను శిథిల మయ్యెను. హరిహరరాయ బుక్క రాయలు విద్యారణ్యుల సహాయముతోఁ బ్రతాప రుద్రదేవుని ఐశ్వర్య శేషముతో నేఁగి తుంగభద్రా తీరమున విద్యానగర సామ్రాజ్యము నెలకొల్పిరి. ప్రోలరెడ్డి అద్దంకి చేరి రెడ్డి రాజ్యమును కొండవీడు కొండపల్లి దుర్గముల తోడ్పాటుతోఁ గ్రొత్తగా స్థాపించెను. మన కిపుడు గావలసినది వెలమ రాజ్యము గూర్చియే. దాని నాధారపఱచి కొని పదునేడవ శతాబ్ది వఱకు నిజాము రాష్ట్రము నందాంధ్ర వాఙ్మయ మెటు లభివృద్ధికి వచ్చెనో తెలిసి కొన వచ్చును.

ఇంచు మించు సింగమ నాయకుని కాలమున మహా విద్వాంసుఁడును బహు గ్రంథ వ్యాఖ్యాతయు సర్వజ్ఞ శిరోమణియు నగు మల్లినాథ సూరి మెదకు మండలములోని కొలిచలమ యందుండి యసంఖ్యాకములగు సంస్కృత గ్రంథములకు వ్యాఖ్యానములు వ్రాసెను. మఱి కొంత కాలమునకుఁ గుమారస్వామి సోమయాజి ప్రతాపరుద్రీయమునకు వ్యాఖ్యానము గావించెను. సర్వజ్ఞ సింగ భూపాలుఁడు రసార్ణవసుధాకరము వ్రాసెను. రావు మాధవ రావు రామాయణమునకు వ్యాఖ్య గావించెను. ఇది వెలమ వారు గావించిన సంస్కృత గ్రంథరచనా శేషప్రశంస. బమ్మెర పోతరాజు ఓరుగల్లు చేరి ఆంధ్ర భాగవతము మున్నగు గ్రంథముల వ్రాసెను. ఈయన వంశీకులగు కేసన మల్లనలు పాకాల తాలూకాలోని గురుజాడపాలకు నాశ్రయించి దాక్షాయిణీ పరిణయము, విష్ణు భజనానందమును రచించిరి. తద్వంశీయులలో నింకొకగగు వెల్లుట్ల నారాయణ కవి నక్షత్రాభ్యుదయమను ప్రబంధమును రచించెను. మాధవనాయకుని యాశ్రయ కుటుంబమునకుఁ జెందిన గౌరన నవనాథ చరిత్రము, హరిశ్చంద్ర ద్విపద రచించెను. జటప్రోలు పాలకుఁడగు మాధవ రావు చంద్రికా పరిణయ మను నపూర్వ ప్రౌఢ ప్రబంధము రచించెను. ఈకావ్యమునకుఁ దానె వ్యాఖ్య గూడ వ్రాసి కొనెను. గ్రంథరచనమున తోరణాల చొక్కయ తోడ్పడెనందురు. ఇది యెంత వఱకు విశ్వాసార్హమో గాని యీ సందర్భమున తోరణాల చొక్కయ్య యనుకవి లభించుట యొక విశేషాంశము. బమ్మెర పోతరాజు నిజాము రాష్ట్ర కవులలో మిగుల సుప్రసిద్ధుఁడు. ఈమహాకవి నామ మెఱుంగని ఈయన కవితా రసము చూడని యాంధ్రుఁ డుండఁడు. ఈకవి పతంగుని నివాసమగు బమ్మెర ఓరుగల్లునకు మూఁడు నాలుగామడల దూరమున నున్నది. భాగవత రచయితయగు పోతరాజుతోఁ బాటు పంచమస్కంధము వ్రాసిన బొప్పరాజు గంగనయు, షష్ఠస్కంధము వ్రాసిన ఏర్చూరి సింగన, పదునొకండు పన్నెండుస్కంధములు వ్రాసిన హరి శెట్టు మడికి సింగన వెలిగందల నారయాదులు నిజాము రాష్ట్ర కవులె యనుటకు బలమైన యాధారములు గలవు. భాగవతము ప్రాకృతము గావలయునని కోరిన యొకటి సర్వజ్ఞ భూపతి రాచకొండ పాలకుఁడు. శ్రీరంగారి షష్ఠమును గ్రంథనామము లక్షణ గ్రంథములందు వినవచ్చును. ఇది యెవరు రచించిరో గానియది భాగవత షష్ఠస్కంధ మనుటకుఁ గల యుపపత్తులను భాగవత పీఠికలో మేము వ్రాసితిమి. సమగ్ర గ్రంథము లభించిన గాని యీ గ్రంథ కర్త నిజాము రాష్ట్రములోని యే భాగమునకుఁ జెందినవాఁడో నిరూపింప వీలుకలుఁగదు. ఇవటూరు పిడుపర్తి, వెల్లటూరు, పాలకురికిలోనగు చోటులఁగల శైవ మతములకు నాంధ్ర సారస్వతమునకుఁగల సంబంధము పరిశోధింపఁదగినది. చేతరెడ్డి వామిరెడ్డి శాసనములు రుద్రదేవుని కావల నున్న రుద్రసేనాని శాసనము పాండసేనాని కొండిపర్తి శాసనము బూదపూరు నగ్నమాన ఘనములోని శాసనములు సంస్కృత శ్లోకములతోనుగూడ గూర కాలపు కవితా వికాసమును దెలుపు చున్నవి. గూడూరు చాళుక్య శాసనమునందు తెలుఁగు పద్యములు కన్నడ పద్యములు కలసియున్నవి. రుద్ర సేనాని ఉప్పరపల్లి శాసనము తెలుఁగు పద్దెముల నొప్పుచున్నది. ఇట్టి తెలుఁగు పద్యశాసనము నాగు

నూరింటిలో నుండి కరీము నగరము చేర్పఁబడినది. ఈ శాసన రచయితలు ఆంధ్ర సారస్వతమునను సంస్కృత సారస్వతమునను సుప్రసిద్ధ కవులనుటకు సంశయము లేదు గాని వారి జీవితములు ఇతర గ్రంథములు లభించిన గాని నిరూపింప వీలుండదు. వెలమ రాజ్యము చీలికలైన కొలఁది వంశీయులు దుర్బలులై కృష్ణకాఁటి బ్రిటిషు ఆంధ్ర దేశమునకు వలసపోయిరి. నిజాము రాష్ట్రమునందుఁ బరిపాలన స్వతంత్రముతో నిలిచిన వెలమ సంస్థానములలోఁ బ్రసిద్ధ మైనది జటప్రోలు సంస్థానము. కృష్ణదేవరాయల విద్యానగర సామ్రాజ్యమునకు జటప్రోలు సంస్థానమునకు గొన్ని సంబంధములు గలవు వానిని గుర్తించి మేని నాఁటి సారస్వత పరిణామము గుర్తింప వీలు చిక్కును. ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యాతయు మహోపాధ్యాయుఁడు నగు ఎలకూచి బాలసరస్వతి కవి మాధవ రాయల తండ్రియగు మల్ల నృపతి పేర మల్ల భూపాలీయమును, పరిటాల ప్రభువగు జూపల్లి వేంకటాద్రి పేర చంద్రికాపరిణయ మను వేఱొక గ్రంథమును రచించెను.

సర్వజ్ఞ సింగ భూపాలుని కాలమునకుఁ గొంచె మావల మడికి సింగన పెద్దపల్లి చెంజెఁగిల రామగిరి పేరి కందనామాత్యుని పేర సంకితముగా పద్మ పురాణమును, జ్ఞాన వాసిష్ఠ రామాయణము, సకల నీతి సమ్మతమను గ్రంథములు నీతి తారావళి రచియించెను. ఇంతియ గాక భాగవత దశమస్కంధములోఁ గొంతయు ఏకాదశ ద్వాదశ స్కంధములు ద్విపద కావ్యముగా వ్రాసెను. చరిగొండ ధర్మ కవియు నీకాలమున కించుక వెనుకలోనుండి చిత్ర భారతమను ప్రబంధ రాజము ధర్మపుర నృసింహ స్వామి ప్రశంసతోఁ జిత్తాపు ఖానుని (సీతాపతి) మంత్రియగు ఇమ్మలపల్లి పెద్దనామాత్యునకు సంకితము గావించెను. మాధవ నాయకుని యుమామహేశ్వర శాసనము వలన పశుపతి పండితు పుత్రుఁడగు నాగనాథ కవి పేరు తెలిసికొంటిమి. ఈయన విష్ణు పురాణమును వ్రాసెను. కొన్ని పద్యములు మాత్రము ప్రబంధ రత్నావళియందుఁ గలవు. చంద్రికాపరిణయ రచయితలు జటప్రోలు సంస్థాన ప్రభువులు నగు మాధవ రావు కుమారుఁడు నరసింగరావు క్షత్రఖేలనము, ఆయన కుమారుఁడు చిన మాధవ రావు శూద్ర స్మృతియు రచించిరి. ఈ రెండును సంస్కృత గ్రంథములు. పానుగంటి జగన్నాథరాయ కవి కుముదవల్లి విలాసము వ్రాసెను. ఇది యాంధ్ర కావ్యము.

రెడ్డి సంస్థానముల నాశ్రయించి కొందఱు కవులు గ్రంథ రచనము కావించిరి. గద్వాల సోమ భూపాలుని కాలమునఁ బలువురు కవులు గ్రంథ రత్నములు రచించిరి. అట్టి వారిలో వీరరాఘవ కవి, కాణాదము పెద్దన సోమయాజి, హరిభట్టు, సుప్రసిద్ధులు. సోమ భూపాలుఁడు గూడ స్వయముగాఁ గవియై రతి రహస్యమును తెలుఁగు చేసెను. దోమకొండ సంస్థాన ప్రభువు లా కాలమున బిక్కనోలులో నుండిరి. మల్లారెడ్డి కవి పద్మ పురాణము శివధర్మోత్తర ఖండము, షట్చక్రవర్తి చరిత్రము, ఎల్లారెడ్డి లింగ పురాణము వాసిష్ఠము లోనగు గ్రంథములు రచించిరి. రామాక లక్ష్మీపతి కవి ఈ కవి వంశీయుఁడగు రాజన్న చౌదరిపేర శూద్రాయురభ్యుదయము, శ్రీకృష్ణ విలాసము లోనగు గ్రంథములు రచించెను. వనపర్తి సంస్థాన ప్రభువులలో రాజా గోపాలరావు అష్ట భాషలలోఁ గవి. సంస్కృతమునఁ బెక్కు కావ్యములు వ్రాసెను. వనపర్తి సంస్థాన రాణులలోఁ గవయిత్రులు కలరు. వారిని గూర్చి ప్రత్యేకించి వ్రాయవలసి యున్నది. మల్లారెడ్డి కవి యన్నయగు కామిరెడ్డి కంకితముగా పట్టమెట్ట సోమనాథ కవి సూతసంహిత బ్రహ్మోత్తర ఖండముల రచించెను. హామ నృపాలుఁడు భార్గవ పురాణము తెనిఁగించెను. ఇతఁడు సురపుర సంస్థాన ప్రభువు. బిజ్జల తిమ్మ భూపాలుఁడు అనర్ఘ రాఘవమును పద్య కావ్యముగా రచించెను. ఈయన ప్రాకటూరి సంస్థాన ప్రభువు. గోంగిరెడ్డి పట్టాభిరామ రెడ్డి ఆంధ్ర యామునాచార్య ప్రభావము వ్రాసెను. ఇంక విచారించిన రెడ్డి వారిలోఁ బలువురు కవులు కలరు. కృష్ణమాచార్యులను సంస్కృత కవియు, అయ్యమాచార్యులను నాంధ్ర కవి రెడ్డి సంస్థానముల నాశ్రయించి బహుగ్రంథముల రచించియున్నారు. రెడ్డి కవుల వాఙ్మయసేవను గురించి యింకను కృషి చేయవలసి యున్నది.

ఆంధ్ర భాషకు నూతన వికాసములు కలుఁగఁ జేయుటలో మిగులఁ దోడ్పడిన యవన ప్రభువుల మనము

మనోరంజనము. అద్దంకి గంగాధర కవి పొన్నగంటి తెలగన్నయు మహమ్మదీయ నృపాలుర యాస్థాన కవులు. గంగాపరిణయాది కావ్యములు మను చరిత్ర వ్యాఖ్య వ్రాసిన సోమనాథ మహాకవి వేములవాడ నివాసి. పరిశోధించిన కొలఁది యెందఱు మహాకవులు నిజాము రాష్ట్రమునఁ గలరో కాలమే నిర్ణయింపఁగలదు. పరశురామ పంతుల లింగమూర్తి రామమూర్తి యను నిరువురు కవులు ఒరంగల్లు నివాసులు. కుందావఝ్ఝల గోపాలకృష్ణకవి కరీమునగర మండలవాసి. ఈయన కృష్ణజన్మ ఖండమను మహా గ్రంథము రచించియున్నాఁడు. కాండూరు రామానుజాచార్యకవి తిరువాయిమొళి. అయ్యమాచార్యుల రామేశ్వర విజయము, వీరరాఘవ కవి భారతోద్యోగ పర్వము, మరింగంటి నరసింహాచార్యుల తాలాంకనందినీపరిణయము, తెనాలి రామలింగకవి ధీరమనోరంజనము, విఠలదాసు కవి అధ్యాత్మ రామాయణము, బంగారురంగప్ప భేతాళ చరిత్రము ఆంధ్ర దేశమంతట వ్యాపకము గలదని యే చెప్పవచ్చును. వీరందఱు నిజాము రాష్ట్ర వాసులని నిరూపించుటకు ఇంక నిటువంటి విసుఁగుఁబాట్టువాఁకు కవులను గ్రంథములను చేర్చుకొనుటకుఁ బరికరముల సేకరించినారము.

కవుల చరిత్ర కొనులు నివాసములు నిరూపింపని కవులలో నాచన సోముఁడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, సారంగు తిమ్మయ్య, భీమకవి, పిడుపర్తి బసవన్న ఈ సోమనాథులు మరింగంటి సింగరాచార్యులు లోనగు మహాకవుల నివాసస్థానములు నిజాము రాష్ట్రములోని గ్రామములని నిరూపింపఁదగిన యాధారములు లభించినవి. ఏవిధముగాఁ జూచినను నిజాము రాష్ట్రము సారస్వత సేవయందు సందియములేదు. దిఙ్మాత్రముగా నిజాము రాష్ట్రమునఁ గల మహాకవులను గూర్చి నిర్ధారణాంశముల సూచించి వదలితిమి. నివాస స్థానముల గూర్చిన చర్చలు కాల నిరూపణమున కనుకూలము లగు చరిత్రాంశములు ఇందుదాహరింప లేదు. ఇప్పటికి సుప్రసిద్ధులగు మహాకవుల జీవితములు నూరింటికిఁ బైగ మాకు లభించినవి. ఇంకఁ గొన్ని జీవితములు విమర్శనీయములుగా నున్నవి. పలువుర జీవితము లీవ్యాసమున నుదాహరించుటకే తావులేక పోయినది. జైనాలయములలోఁ గొన్ని తావుల తాళపత్ర గ్రంథములు గలవు. మెదకు మండలములోని శైవమతములలో నాంధ్ర కర్ణాటక గ్రంథము లసంఖ్యాకములు గలవని వింటిమి. ఆంధ్ర సారస్వతమునఁ బూర్వము జైన గ్రంథములు పెక్కులు గలవు. అట్టి వానిలో నిప్పుడొక కవిజనాశ్రయము మాత్రమె కనిపించుచున్నది. మాటు మడఁగియున్న జైన గ్రంథములకై నిజాము రాష్ట్రములోని యాంధ్రుల యాలంబనములో నున్న జైనాలయములలో వెదక వలసి యున్నది. ఆంధ్ర కవులు కర్ణాట భాషలోఁగూడఁ బెక్కు గ్రంథముల వ్రాసియున్నారు. కర్ణాటకవి జీవితములో గొందఱాంధ్ర కవులు గలరు. కొందఱు కర్ణాట కవులాంధ్ర కావ్యములను ఖండించిరి. కన్నడ గ్రంథములను గొందఱాంధ్ర కవులు తెలిఁగించిరి. ఇట్టివారు నిజాము రాష్ట్ర కవులలో బెక్కుమంది గలరు. వారి జీవితములు చర్చించుటకు దొరకొందుమేని గ్రంథ విస్తృతి యగును. అట్టివారిలో పాలకురికి సోమనాథుఁడును వేములవాడ భీమకవియు పిడుపర్తి బసవకవియు లోనగు వారు ముఖ్యులు. సకల నీతి సమ్మతము వలన మడికి సింగన కంటె పూర్వ గ్రంథములని విశ్వసింపదగు ముద్రామాత్యము, నీతిసారము, పంచతంత్రము, పురుషార్థ సారము, నీతి భూషణము, కామందకము, నీతితారావళి, శాలిహోత్రము లోనగు నైతిక గ్రంథములు కనిపించుటలేదు. ఇంకను గొన్ని చేరిన నిజాము రాష్ట్ర కవుల గ్రంథము లనుటకు సందియము లేదు. నిజాము రాష్ట్ర ఆంధ్రకవి జీవితము సమగ్ర పరిశోధనముతో బయలు వెడలినచో ఆంధ్రకవి జీవిత సంశయ గ్రంథములు విడిపోవుటయే గాక నిజాము రాష్ట్రాంధ్ర దేశము యావదాంధ్ర దేశమునకు శిరఃప్రాయమను నంశము బాల వేద్యము కాఁగలదు. మఱుగుపడియున్న యాంధ్రమహాకవుల జీవిత లేశములను తెలిపి యీ వ్యాసమున నిజాము రాష్ట్ర మాంధ్ర వాఙ్మయమున కెట్టులఁ దోడ్పడెనో గొంచెముగా సూచించి వదలితిమి. సమగ్రమగు జీవిత చరిత్రము వ్రాయుటకు ననువగు పరికరములను కొంత వఱకు సేకరించితిమి. ఇంకను సేకరించుచున్నారము. నిజాము రాష్ట్రము ఆంధ్ర దేశమునకు నాయకమణియని నిరూపించుట భగవదిష్ట మయ్యేనేని యుచిత కాలమున నిజాము రాష్ట్రాంధ్ర కవిజీవితము, నిజాము

రాష్ట్రాంధ్ర వాఙ్మయ చరిత్రము ప్రమరణము కాఁగలవు. ఆంధ్ర మహాశయులు తమకు లభించు గ్రంథములు ఆధారములు కవి జీవితములు పత్రికా ముఖమున బ్రచురించుచున్నచో సమగ్ర నిజాము రాష్ట్రాంధ్రకవి జీవితము ఆంధ్ర భారతి చరణ సన్నిధిని సమర్పింప వీలుకలుగును.

శ్రీకృష్ణరాయల ఆంధ్రభాషా నిలయ రజతోత్సవ సందర్భమున నిజామురాష్ట్రాంధ్రకవి జీవితము సంగ్రహముగా నిజాము రాష్ట్రాంధ్ర సోదరులకు విన్నవింప నవకాశ మొసఁగిన కార్యనిర్వాహక వర్గమును బ్రశంసించుచు నింతటితో నీవ్యాసమును ముగించు చున్నారము.

“అచ్చ తెనుంగు కావ్యమున కాదిపదంబయి పొల్చు భాగ్యమున్
హెచ్చుగఁ గన్న దేశ మిదియే దురదృష్టము మాంధ్రభాష నేఁ
డిచ్చట నిస్సహాయపు చెడి హీనదశార్తినిఁ గుందె నక్కటా
యచ్చపు టాంధ్రపుత్రులకు నందఱకున్ దలవంపులౌనటుల్”





# నిజాంరాష్ట్రములోని చారిత్రికపరిశోధన

శ్రీ సిరుగూరి. హనుమంతరావు, ఎం. ఏ; ఎల్. టి.



పురాతన చారిత్రికాంశములకుఁ గావలసిన సామగ్రి సముదయమునకు నిజాం రాష్ట్రము ఖని. వేదయుగమునకుఁ బూర్వకాలమందలి సమాధి సాంప్రదాయములను గుఱించిన సామగ్రి విశేష మొకవంక, ఇట్టి మైకల్ఎంగెలో, బోటిసెల్లీ మొదలగు చిత్రకారుల సృష్టితో సమాన మైన యజంతా కళావిషయ మైన సామగ్రి యొకవంక, ఇట్టి వివిధ విషయములను బరిశోధించుటకు నిచ్చట నవకాశము గలదు. ఈ రాష్ట్రము పూర్వ కాలపు దక్షిణాపథ రాజకీయ విభాగములతో సరిగా నున్నది. అప్పుడు ఇచ్చట ఆంధ్రులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు యాదవులు, కాకతీయులు. వారి వంశీయులు, రాజ్య మేలుచుండిరి. ఈరాజ్యముల చరిత్ర యింక నుబూర్తిగాఁ దేల లేదు. ఆయాకాలములలో దక్షిణాపథమున నుండిన నాగరికతను గుఱించి తెలిసి కొనుటకు నిజాం రాష్ట్రములో మిక్కిలి సామగ్రి కలదు.

౧౯౧౪ వ సం॥కుఁ బూర్వపు పరిశోధన.

౧౯౧౪ వ సంవత్సరమునకుఁ బూర్వము, రాష్ట్రములోని పురాతన సామగ్రిని రక్షించుటకు సరియైన పరిపాలనా శాఖ లేకపోయెను. అప్పుడు వీనిపై నామమాత్రపు టధికారము బొంబాయి పరిశోధక శాఖ కుండెను; ఫెర్గుసన్, బర్జస్, గ్రిఫిత్. లేడీ హెర్రింగాం మున్నగు వారు దక్షిణాపథ పరిశోధన కొఱకు మిక్కిలి పాటుపడిరి. నవాబ్ సయ్యద్ హుసేన్ బిల్గ్రామీగారి «నిజాం రాష్ట్రము యొక్క చారిత్రిక వర్ణన" మను గ్రంథము, «ఔరంగాబాద్ గెజటీర్" కసింస్ గారి «పురాతన సామగ్రి పట్టిక" «బీజపూర్ కట్టడములు" అనునవి పేర్కొనఁ బడవలసిన గ్రంథములు. ఈ కడపటి పుస్తకము వ్రాసినందులకుఁ గసింస్ గారు «పింహీ మెమోరియల్ పతకము"ను బొందిరి.

చరిత్ర పరిశోధక శాఖ యేర్పఱుపఁ బడుట.

౧౯౧౪ లో, మహాఘనత వహించిన నిజాం ప్రభువు గారు మహోదయతోఁ జరిత్ర పరిశోధక శాఖ యేర్పాటుచేసి, దానికి యాజ్దానీ గారిని డైరెక్టరుగా నియమించిరి. ౧౯౧౪ నుండి, ౧౯౩౪ వఱకు ఈ శాఖవారు నెరవేర్చిన కార్యమును, ౧ సాంవత్సరిక నివేదికలలోను, ౨ శాసనములను గుఱించిన పత్రములలోను, ౩ చరిత్ర శోధకమండలి పత్రికలలోను, రెండు «అజంతా, «ఎల్లోరా,లనుగూర్చి తెలుపుసూచనలలోను, బీదరు పట్టణములోని పురాతన సామ

గ్రిని గురించిన గ్రంథములోను, మాంస్యూర్ ఫేచర్ గారు ఫరాసులో వ్రాసిన 'అజంతాగుహలను గురించిన ప్రాథమిక నివేదికలోను (దీనిని ౧౯౧౯-౨౦ పత్రికలో నాంగ్లీకరించిరి), పెక్కుచిత్రములలోను, మ్యాపులలోను, ఫోటోగ్రాఫులలోను, ప్రకటించియున్నారు. ఈశాఖ వారి ముఖ్యకార్యము 'సామగ్రి రక్షణ, యైనప్పటికిని, భూపరిశోధన, శాసనపరిశోధన, నాణెములశోధన, వస్తుప్రదర్శన శాలా స్థాపనము, మొదలైనవి కూడ వీరు చేసిరి.

### సామగ్రి రక్షణ

ఆపది వత్సరములలోఁ జేయఁబడిన పనులలో నిది ముఖ్యమైనది. అజంతా చిత్రములను భద్రపఱచుట యనవశ్యమని యీశాఖ గ్రహించెను. ఈచిత్రములను కళావిమర్శకు లందఱును మెచ్చుకొనిరి. ఇటాలియా సాహిత్యప్రబోధ కాలము వఱకు వీనితో సమానమైన చిత్రములు ప్రపంచమందెచ్చటను లేకుండెను. మాంస్యూరు ఫేచర్ అను ఫరాసు దేశస్థుఁడు ఈ అజంతా చిత్రములను విపులముగాఁ బరీక్షించి యొక ప్రాథమిక నివేదికను వ్రాసెను. (పైన సూచించినదే). ౧౯౨౦ లో సిద్ధులు ఇటాలియా కళాకోవిదులు అజంతాకు వచ్చి, చిత్రములు పాడై పోకుండ నుండుటకై తగిన యేర్పాటులను జేసిరి. ఐనను ఒకటి రెండు శతాబ్దములలోఁ గ్రమ క్రమముగా నివి పాడై పోక తప్పదు గనుక ఆసియా ఖండములోని వెలలేని చిత్రముల నెల్లకాలము స్మరించుటకై వీనికిఁ ద్రివర్ణ ఛాయా పటములను దీయు చున్నారు. దీనికి సుమారు ౬ లక్షల రూప్యములు కావలసి యున్నవి. ఇంత ప్రబోధకరమును, ఉదారము నైన మార్గము ననుసరించిన మహాఘనత వహించిన నిజాం ప్రభుత్వమువారు కళా ప్రపంచము యొక్క వందనములకుఁ బాత్రులు.

అజంతాకుఁ దర్వాత ముఖ్యమైనది ఎల్లోరా. అజంతాయెట్లు బౌద్ధ సభ్యతను నిరూపించుచున్నదో, అట్లే బౌద్ధసభ్యతతోఁ దిలుగఁ బడిన బ్రాహ్మణ సభ్యతను ఎల్లోరా నిరూపించుచున్నది. ఇచ్చటి చిత్తరువుల దుర్గములు చెడిపోయినవి. కాని విగ్రహములున్నవి. అజంతా గుహలపై మాంస్యూర్ ఫేచర్ గారు వ్రాసిన నివేదిక వలెనే యెల్లోరా గుహల విగ్రహములను గురించి నివేదికను వ్రాయుటకు యత్నములు జరుగు చున్నవి.

అజంతా, యెల్లోరాల తర్వాత నీ శాఖ వారు ఓరుగల్లును గమనించిరి. ౧౨ వ శతాబ్దము మొదలు ౧౪ వ శతాబ్దము వఱకు కాకతీయ హిందూ రాజ్యమునకు ఓరుగల్లు రాజధానిగా నుండెను. అచ్చట నొక కోటయుఁ బెక్కు దేవాలయములునున్నవి. వీనిలో వేయి స్తంభముల దేవాలయము అత్యంత కళా శోభితమై యున్నది. చక్కఁగాఁ బదును చేయఁ బడిన లింగమును, ఒక నందియునున్నవి; ఇవి ఏకశిలా కళలో నున్నతములని యాజ్దానీ గారు వర్ణించినారు. ౧౪ ఏండ్ల క్రిందట నా దేవాలయము పాడుపడి యుండెను గాని, యీశాఖవారు ౧౧,౬౮౭ రూప్యములు వ్యయపఱచి బాగుచేసిరి.

ఈశాఖచే రక్షింపఁ బడి, బాగుచేయఁబడిన పురాతన సామగ్రిలోఁ బేర్కొనఁ దగినవి, పాలంపేట దేవాలయములు, ఉప్పరపల్లి దేవాలయములు. ఇవి మధ్యకాల దక్షిణాపథ దేవాలయములలో నుత్కృష్టతమములని యాజ్దానీ గారు వర్ణించినారు. బీదర్, గుల్బర్గా, హైదరా



సహస్రస్తంభ దేవాలయ ద్వారము, హనుమకొండ.



రామప్ప దేవాలయపుస్తంభములోని విగ్రహము.



సహస్రస్తంభ దేవాలయపుస్తంభములోని విగ్రహము
హనుమకొండ.



రామప్ప దేవాలయ ద్వారము



రామప్ప దేవాలయపు ద్వారబంధము.



రామప్ప, దేవాలయాంతరా గము.

బాద్, మున్నగు చోట్లలోని సామగ్రి కూడ రక్షింపఁ బడినది.

### భూ పరిశోధన

చరిత్రపరిశోధక కార్యములలో ముఖ్యము రక్షణ. తరువాత ముఖ్యమైనది భూపరిశోధన. తగర, పైఠణ (ప్రతిష్ఠాన పురము) మాల్ఖేడ్ (మాన్యఖేటకము) వంటి పురాతన పట్టణములు భూమిలోనుండి త్రవ్వఁబడి పరిశోధింపఁ బడవలసి యున్నవి. ఈశాఖవారు పైఠణ పట్టణములో భూపరిశోధన మొదలు పెట్టుటకు సుద్యుక్తులై యున్నారు.

మన రాష్ట్రములోని చారిత్ర పూర్వకాల సామగ్రిని ఉత్సాహముతో శోధించిన వారిలో డాక్టర్ హంటు గారు, మన్‌గారు ముఖ్యులు. ౧౯౧౭-౧౮ లో "వర్తక, కార్మిక శాఖ"కు డైరెక్టరుగా నుండిన వేక్‌ఫీల్డుగారు ఈసమాధులను మిక్కిలి యుత్సాహముతో శోధించిరి. ఇవి యనాగరక కాలపు సమాధులు. వీనికి "కేరన్‌లు, క్రాంలేఖ్‌లు" అని పేర్లు గలవు. ఇవి మన రాష్ట్రములో నెల్లెడలనున్నవి. హైద్రాబాదునకుఁ బ్రాంతముననే కొన్నింటిని డాక్టర్ హంటు గారు కనిపెట్టిరి. రాయగిరి వద్ద మన్‌గారు కని పెట్టిరి; పాలవంచ తాలూకాలో జానంపేట వద్దకొన్ని "క్రాంలేఖుల"ను వేక్‌ఫీల్డు గారు పరీక్షించిరి. ఈసమాధులలో పెద్దయాకారములు గల రాక్షసులు పూడ్చఁ బడిరను గాధలుకలవు. వీని విషయమై చరిత్రశోధకమండలి పత్రికలో (౧౯౧౬) డాక్టర్ హంటుగారు వ్రాసిన వ్యాసము చదువఁ దగినది. ఈసమాధులను నిర్మించినవారు చిన్న మనుష్యులేకాని, చచ్చిన వారిని గొప్ప సమాధులలోఁ బూడ్చుచుండిరని వారు వ్రాసిరి. ఈసమాధులలో దొరికిన కుండల మీఁది గీఁతలు మద్రాసు వస్తుప్రదర్శనశాలలోని ఆదిచనల్లూర్ కుండల మీఁద నున్న గీఁతల వలెనున్నవి. ఈసమాధులలోఁ జచ్చిన వారినిఁ బూడ్చుచుండిన ప్రజల సభ్యత వేదయుగము కంటె మిగుల ప్రాచీనమైనది.

### శాసన పరిశోధన.

ఈ విషయములోఁ జాల పనిచేయఁబడినది. శాసనములను గూర్చిన విమర్శ ఒక్కొక్కప్పుడు బ్రిటిష్ ఇండియాలోని నేర్పరుల సాహాయ్యము గైకొని ప్రకటించియుండిరి. ఇందులో ముఖ్యమైనది రాయచూరు ప్రాంతమున, మాస్కి వద్ది శిలా లిఖితమైన యశోకుని శాసనము. అశోకుని శాసనములలో నతనినామము 'దేవానాంపియ' అనియు 'పియదసి' అనియు మాత్రముండును. కాని ఈ శాసనములో నతని యసలుపేరు కలదు. అశోకుని సామ్రాజ్యము దక్షిణాపథము వఱకు వ్యాపించి యుండెననుటకుఁ గూడ నిది నిదర్శనము.

పశ్చిమ చాళుక్యులను గుఱించి మూఁడు శాసనములు కలవు. మొదటిది, జగదేకమల్లుని కొట్టమొదటిశాసనము. దీని తేదీ క్రీ.శ.౧౦౧౭. రెండవది, ౧౦౫౯ క్రీ.శ. త్రైలోక్యమల్ల ఆహవమల్ల సోమేశ్వర ౧ అనురాజును గుఱించి. ఇందులో ౯౧౫—౯౨౭ క్రీ. శ. పాలించిన 'ఇంద్ర' అను రాష్ట్రకూట చక్రవర్తికి రాజధాని బోధన అనిచెప్పఁబడినది. మూఁడవది, (౧౦౮౮ క్రీ.శ.) త్రిభువనమల్ల విక్రమాదిత్య ౬ ను గుఱించి.

కాకతీయ రాజులను గుఱించి నాల్గు శాసనములు కలవు. అందులో నొకటి రుద్రమాంబారాణి, గణపతిరాజునకుఁ గూఁతురని నిరూపించి, విర్యాల వంశములోని సామంతనృపుల వంశా

వళిని వర్ణించుచున్నది. దాని తారీఖు క్రీ. శ. ౧౨౨౩. ఒక శాసనమునకుఁ దారీఖు లేదు. కాని యీ క్రింది వంశావళినిఁ జెప్పుచున్నది:-




మూఁడవదాని తేదీ క్రీ.శ. ౧౨౧౫; గణపతిదేవుని సామంతుఁడైన రేచెర్లరుద్రుని గండ యాత్రలిందు వర్ణింపఁబడినవి. నాల్గవదాని తేదీ ౧౨౩౬ క్రీ.శ; బొఖ్ఖారా వద్ద జరిగిన యుద్ధము, రేచెర్ల రుద్రుని సేనానియైన బ్రాహ్మణుఁడగు రాజనాయకుని నిది వర్ణించుచున్నది.

హైదరాబాదునకు ఈశాన్య దిక్కున, ౪౫ మైళ్ల దూరమునఁ గొలనుపాకలోఁ గొన్ని చాళుక్య శాసనములు కనఁబడినవని నివేదికలలో నున్నది. ౧౯౧౬ జనవరి పత్రికలో అసిస్టెంట్ డైరక్టరు శ్రీనివాసుగారు కొలనుపాక ప్రాచీన విషయములను గురించి యొక వ్యాసమును వ్రాసిరి. పాడీ వద్ద, నాగాయ్ కడఁ, గొన్ని చాళుక్య శాసనములుదొరకినవి. వీనిని గురించి శ్రీనివాసుగారు ౧౯౧౯-౨౦ పత్రికలో వ్రాసినారు. బ్రిటిష్ ఇండియా ప్రభుత్వములోని నేర్పరులు ఈ శాసనములను బ్రచురింపింప నున్నారు. హైదరాబాదునకు ఆగ్నేయదిశలో ౨౫ మైళ్ల దూరమున రాచకొండ కలదు; దీని ప్రాచీన చరిత్రను గురించి శ్రీనివాసుగారు ౧౯౧౬ జనవరి పత్రికలో నొక వ్యాసము వ్రాసినారు. అచ్చటఁ దెలుఁగులో నముద్రిత శాసనము లేడు గలవు.

మహమ్మదీయ శాసనవిషయములో యాజ్దానీగారు మిక్కిలి పనిచేసి యున్నారు. ఎపిగ్రాఫికా ఇండో మాస్లెమికా (ఇండియా-మహమ్మదీయ శాసన సర్వస్వము)కు వీరిని సంపాదకులుగ ఇండియా ప్రభుత్వమువారు నియోగించిరి. దక్షిణాపథ సుల్తానుల శాసనములను కొక్కింటిని వీరు ప్రచురించినారు. ప్రస్తుత చరిత్ర గ్రంథములలో నున్న విషయములకన్న విశేషించి వ్రాయుటకుఁ దగిన సామగ్రి యీ శాసనములలోఁ గలదు. యాజ్దానీగారు బిబ్లియోథికా ఇండికా (ఇండియా-లిఖిత సర్వస్వము)లో షాజహాన్ నామాను బ్రచురించుచున్నారు.

## నాణెముల పరిశోధన.

౧౯౨౨ వ సం॥ మార్చినెల వఱకు హైదరాబాదు వస్తు ప్రదర్శనశాల (మ్యూజియం)కు మొత్తము మీఁద ౫, ౨౮౪ నాణెములు చేరినవి. ౧౯౨౨-౨౪ సంవత్సరములలో మఱి ౧౬,౫౮౭ నాణెములు చేర్పఁబడినవి. ఈ నాణెములు హిందూదేశచరిత్ర నంతయుఁ బ్రకటించుచున్నవి; క్రీ.పూ. ౨ వ శతాబ్దము మొదలుకొని, క్రీ॥శ॥ ౧౭ వ శతాబ్దము వఱకుఁ గల చరిత్రనుసూచించుచున్నవి. కరీంనగర జిల్లాలో చిల్లులు చేయఁబడిన యాంధ్ర నాణెములు ౩౬౭ దొరకెను. వాని తేదీ క్రీ॥ పూ॥ ౨ వ శతాబ్దము. పదునొకండు, పండ్రెండు శతాబ్దములలోని చాళుక్య పద్మాంతకములు గుల్బర్గాలో పండ్రెండు, బీడ్‌లో నెనిమిది దొరకినవి. దేవగిరిలోని అంతిమ యాదవ రాజుల కాలపుఁ బద్మాంతకములు ౧౦౯ కలవు. వీనినిఁ బంచిన రాజులు, రెండవసింగన ౧౨౧౦-౧౨౪౭ కృష్ణ లేక కంహార (౧౨౪౭-౧౨౬౦) మహాదేవుఁడు

(౧౭౬౦-౧౭౯౧). కొన్ని నాణెములు విజయనగర రాజులవి: — ప్రతాప హరి హర (౧౩౭౯-౧౪౦౬) కృష్ణదేవరాయ (౧౫౦౯-౧౫౩౦; అచ్యుతరాయ (౧౫౩౦-౧౫౪౨) సదా శివరాయ (౧౫౪౨-౧౫౭౩).

ఈనాణెములలో, ఇండో-గ్రీకులవి, ఇండో-పార్తియన్ లవి, కుషన్లవి, ససేనియన్లవి, డిల్లీసుల్తాన్లవి, మొగల్ చక్రవర్తులవి కలవు. ఇందులోఁ గొన్ని యపురూపములైనవి; కొన్నింటి వలన దక్కనులోని క్రొత్త టంకశాలలను దెలిసికొను చున్నాము. ఇందులో నొక టంకశాల పేరు 'కానుకుర్తి' యని యుండుట చమత్కారముగా నున్నది; ఏలయన నాంధ్ర దేశములోని పేరు పొందిన యొక కుటుంబమునకీ యింటి పేరు కలదు.

### వస్తు ప్రదర్శన శాల

చరిత్ర పరిశోధక శాఖకు సర్వాంగ సమన్వితమగు వస్తు ప్రదర్శన శాల యావశ్యకమై యున్నది. మాతృభూమి యొక్క పురాతన చరిత్రయందుఁ బ్రజాబాహుళ్యమునకు మక్కువ కలుగ వలెనన్న నిది యుండవలసి యున్నది. పరిశోధక శాఖ నిర్మించినపుడే ప్రదర్శనశాలను గూడ స్థాపించుటకుఁ బ్రభుత్వము వారు తలంచిరి. కాని, ఇంతలో యుద్ధము తటస్థమౌట చేత నా యూహా నాపివేయవలసి వచ్చెను. కాని ప్రదర్శనార్థము పెక్కు పురాతన సామగ్రులను ప్రోగు చేయుటకై ఈశాఖవారు చాల పాటు పడిరి. సర్ స్టూవార్ట్ ఫ్రేజర్ గారు సంతరించిన యిత్తడి సామగ్రిని ఈశాఖవారు కొనిరి. అమరావతీ శిలావిగ్రహములు 3౭, గాంధార శిలా విగ్రహములు కొన్ని, తక్షశిల వద్ద దొరకిన హిప్పోక్రటీస్ యొక్క కంచు విగ్రహమునకుఁ దీసిన ప్లాస్టర్ ప్రతిమ యొకటి, మఱి పెక్కు పురాతన సామగ్రులను ప్రోవు చేసి, ప్రస్తుత మిచ్చట మహబూబియా టవున్ హాలులో నుంచి యున్నారు. ఈవస్తుజాలమును బ్రజాబాహుళ్యమునకుఁ జూపించుటకై ప్రదర్శన శాలను దెఱచుటకుఁ బ్రయత్నములు జరుగుచున్నవి; ఇవి సఫలమైన యెడల మన రాష్ట్ర ప్రజలకు నిజమైన విజ్ఞానము కలుగఁ గలదు.

### ఆంధ్ర పరిశోధక సంఘము

కొంత కాలము నుండి, హైదరాబాదులోని కొందఱాంధ్రులు అముద్రిత గ్రంథములు ప్రోవు చేయుట యందును, రాష్ట్రములోని యాంధ్ర ప్రాంతపు మారు మూలలలో నున్న శాసనములకుఁ బ్రతులను దీయుట యందును ఉత్సాహము చూపించు చున్నారు. ఇట్టి యుద్దేశము బొంబాయిలోని భండార్కర్ భవనమును జూచి వచ్చిన కొందఱకు స్ఫురించినది. ఇంత వఱకును ఈ ఉద్యమమునకుఁ బ్రాచుర్యమీయక పోవుటకుఁ గారణ మేమనఁగా కేవలము ఉత్సాహముపకై నలువురు కలసి, ఇతర సాహాయ్యము లేనిదే చేయు కార్యములు, అందులో బహుకాల ప్రయాస ఫలితము లగు కార్యములు విజయవంతములౌనా యను సంశయమే. ఐనను శ్రీ మునగాల రాజా వారి యుత్సాహము వలనను, పోషణ వలనను, కొందఱు అభిమానుల సాహాయ్యము వలనను గొంత పనిసాగింప శక్యమైనది. ఈ సంఘపక్షమున ౧౯౩౪ లోను, ౧౯౩౫ లోను, కొద్ది కాలములకై యిరువురు పండితులు నియోగింపఁ బడిరి. వీరు తెలుఁగు జిల్లాలలోఁ బ్రయాణము చేసి, వీలైనన్ని శాసనములను గ్రహించిరి. దేవాలయములలోను, పెద్ద మనుష్యుల ఇండ్లలోను ఏవైన శాసనములు గాన్పించినచో వానికిఁ బ్రతులను దీసిరి. వారి ప్రయాసముల ఫలముగా ౨౦౭ అముద్రిత గ్రంథ

ములు దొరకినవి. అందులోఁ గొన్ని తాళపత్రములు. అవి చాల వఱకు నాంధ్ర వాఙ్మయ సంబంధమైనవి. కాని, కొన్నింటియందు కాకతీయ రాజులను గుఱించిన సంగతులు గలవు. వీని చారిత్రిక విలువ సంశయాస్పదమైనది. కొన్ని వివిధశాస్త్రములను గుఱించినవి, జంతు వైద్య, మంత్ర, తంత్ర జ్యోతిశ్శాస్త్రాది గ్రంథములు కలవు. కొంత కాలములోఁ జెన్నపురి ప్రాచ్యభాండాగారములోని లిఖిత గ్రంథముల పట్టిక వలెనే ఈ గ్రంథములను గుఱించి కూడ విపుల పట్టిక తయారు చేయఁబడునని తలఁచుచున్నాము. ఆయిద్దఱు పండితులును ౧౨౨ శాసనములకుఁ బ్రతిబింబములను దీసిరి. జిల్లాలలో నున్న యొక మిత్రుఁడు మఱి ౮ శాసనములఁ బంపెను. ఇందులోఁ గొన్ని కొలను పాక శాసనములు; ఇవి ఇండియా ప్రభుత్వము వారి సహాయముచేఁ బ్రచురింపఁ బడుచున్నవని పైనఁ జెప్పితిని. చాల వఱకీ శాసనములు చాళుక్య రాజులను గాకతీయులను గుఱించినవి. మఱి కొన్ని విజయ నగర రాజులను గుఱించినవి. ఈ శాసనముల ప్రతులు శ్రీకృష్ణదేవ రాయల ఆంధ్రభాషా నిలయములో నున్నవి. వీని పట్టిక తయారు చేయఁ బడినది.

పైనఁ జెప్పిన యెనిమిది శాసనములలో నొకటి (సంఖ్య ౫) శా. శకము ౧౩౧౯ వ వత్సరము తేదీ కలది; విజయ నగర రాజు, రెండవ హరిహరుఁడు పానుగల్లు కోటను ముట్టడించిన విషయమున్నది. ఇంకొకటి (సంఖ్య ౪) చాల దీర్ఘముగను, బాగుగ నున్నది. మహబూబు నగరము జిల్లా, నాగర్కర్నూలు తాలూకా, వర్ధమాని గ్రామములో దొరికినది. దీని తేదీ, శా. శకము ౧౧౬౭. అందులో మొదట వర్ణోత్పత్తిని గుఱించి కలదు; కాకతీయులు నాల్గవ వర్ణము వారని కలదు; గణపతి యొక్క వంశావళి నిచ్చి, కుప్పాంబాపతి యగు గుండయ యను సేనాని యొకఁడు దేవాలయము కట్టినట్లు చెప్పఁబడి యున్నది. అతని తండ్రి బోచుఁడు; తల్లి బోంచాంబిక; అతనికి మల్యాల వంశము.

తక్కిన ౧౨౨ శాసనములలోఁ బదునాఱింటికి మాత్రము నకళ్లు వ్రాయఁబడినవి. ఇందొకటి (సంఖ్య ౧౧) చాళుక్య వంశమును గుఱించి చెప్పి, ఈ క్రింది వంశావళి నిచ్చెను:

యుద్ధమల్లుఁడు
|
అరికేసరి
|
నరసింహుఁడు
|
ఆదిత్యుఁడు
|
యుద్ధమల్లుఁడు
|
నరసింహుఁడు
|
అరికేసరి

పంపా భారతములో నున్న వంశావళితో నిది సరిపడుట లేదు. అందుచేత నీశాసనమును నేర్పరుల చేత పరిశోధింపఁ జేయుటకు యత్నించుచున్నారు.

తక్కిన శాసనములు కాకతీయ రాజులను గాని, వారి సామంతులను గాని చాటుచున్నవి. ఇందొకటి (సంఖ్య ౧౪) శా. శకము ౧౦౯౨ వ సంవత్సరము నాఁటిది. కాకతీయ రాజైన ప్రోలుని గుఱించినది. ఇంకొకటి (సంఖ్య ౨౧) మైలాంబ మహాదేవుని కూఁతురనియు, గణ

పతికి సోదరి యనియుఁ జెప్పి, యామె భర్త యగు రుద్రుని వంశావళి నిచ్చు చున్నది. సంఖ్య ౩౧ మిక్కిలి దీర్ఘమైనది. కొండపర్తిలో దొరకినది. మల్యాలసేనాపతుల వంశావళి నిచ్చినది; దీనిని సంఖ్య ౧౫ తోఁ బోల్ప వలెను. సర్కారు వారు ప్రచురించిన పాలంపేట శాసనములలోఁ జేర్పఁబడిన రేచెర్ల వంశమును గుఱించి యిందులో మూఁడు గలవు (సంఖ్య ౬.౨.౬౫, ౬౦). కాని, వంశావళిలోఁ గోత్ర పేర్లు చెప్పఁబడినవి. కనుక మూల శాసనములను బరిష్కరింప వలసియున్నది. ౩౫ వ శాసనము (౧౪౨౭ శా. శ.) విజయ నగర ప్రభువు కృష్ణదేవరాయల నాఁటి దానమును గుఱించి చెప్పు చున్నది. తక్కిన ౪ శాసనములు అంత ముఖ్యములు కావు.

తక్కిన ౧౧౬ శాసనములను పరిగాఁ బరిశీలించుటకు ప్రయత్నములు జరుగు చున్నవి. చాళుక్యులను గుఱించియుఁ గాకతీయులను గుఱించియు విశేషముగా నిందు మూలకముగాఁ దెలియఁ గలదని తోఁచు చున్నది. హైదరాబాదులో నింత వఱకు జేయఁ బడిన యీపరిశోధనను గుఱించి స్వల్పముగాఁ దెల్పితిని. ఇందు మూలమున దక్షిణాపథ పురాతన చరిత్రయందు ఉత్సాహము కలిగి, మఱింత పరిశోధన కుద్యోగము కలుగునని తలంచు చున్నాను.



# పరిశోధనోద్యమము

శ్రీ శేషాద్రి రమణకవులు.

మ. సరసాగ్రేసరు లాంధ్ర పండితులు భాషారాజ్యసింహాసన
స్థిరభాగ్యంబున నోలలాడెడి తఱిన్ జేకొన్న కావ్యంబు లీ
తరుణం బందు లభింప కున్న యవి; తత్తత్పూర్వతాళీ దళా
కరలేఖ్యంబుల సేకరించుటకు వేగన్ రండు విద్వన్మణుల్.

శా. జీర్ణంబౌ నెడి తాళపత్ర కృతులన్ జేకూర్చి యంతస్థ భా
షార్ణోరాశి మథించి మేల్మిగల కావ్యానేకరత్నంబులన్
బూర్ణోత్సాహత నాంధ్రభారతి పదంబుల్ సోఁకనర్పించుచో
నిర్ణీతంబగు ధర్మ మంచును మదిన్ జింతింపు మా సోదరా.

సీ. చివికి జీర్ణంబయి చెడి పోవకయ మున్న • తాళపత్ర గ్రంథ తతులఁ గూర్చి
పగిలి విభ్రష్టమై పాడు వారక మున్న • శాసనాంశంబులు సంగ్రహించి
నామ రూపములు నాంతము నశింపక మున్న • చిత్రవిగ్రహముల సేకరించి
మఱచి పోవకమున్న మహితాంధ్ర వీరుల • జాతీయ గథలను సంతరించి

తే. భావనాదృష్టితో నాంధ్రభారతీస, మగ్రరూపంబుఁ జిత్రించి మదితలంచి
వీలువెంబడి యు సురులర్పింప కీల, యూసపడియెదు సుఖములకాంధ్రపుత్ర.

చ. వీరవిహారరంగ మని విశ్రుతికెక్కిన యాంధ్రభూమికిం
బౌరుడవై జనించి నిజమాతృపదంబులఁ గొల్వఁగున్నచో
నీఋణమెట్లుతీరు; రసనిర్భర కావ్యచయాంతరస్థమౌ
భారత వీరకీర్తనలఁ బాడుమి భావనఁ జేసి సోదరా.

చ. శాసన సంగతంబులగు శౌర్యధురీణుల జీవితంబులన్
వ్రాసి, మనోహరాంధ్ర రసవత్కృతి జాలము సేకరించి వి
శ్వాసము మాతృభూమిపయి సంతతమున్ నెలకొల్పి యాంధ్ర భా
షాసతికిన్ విభూషలను సంధిలఁ జేయుమి! యాంధ్ర సోదరా.

## నిజాము రాష్ట్రములోని

# ఆంధ్రసంస్థానముల చరిత్ర

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, బి.ఏ.బి.ఎల్.

—••✤✤••—

## పీఠిక



అనేక శతాబ్దములకుఁ బూర్వము రెడ్డి వెలమవీరులు తమ బాహుబలముచే సంపాదించిన స్వతంత్ర రాజ్యములు కొండొక కాలమున ఓరుగల్లు విజయనగర సామ్రాజ్యములకులోనై కాలపరివర్తనముచే నేటి కాలమున శ్రీ నిజాముప్రభువునకు సామంత స్థానముననుండునవై, పూర్వవైభవమును గోలుపోయినవైనను స్మరణీయమైన చరిత్రలుకలవైయవిగానున్నవి. ఒక్కొక్కదాని చరిత్రమును సమగ్ర గ్రంథముగా వ్రాసినను లోపములేదు కాని, యిచ్చట స్థలసంకోచముచేతఁ గొన్నింటి చరిత్రాంశములనే యతి సంక్షేపముగాఁ బొందుపఱుపఁబడును. ఈవ్యాసమునందు హిజిరి అను మహమ్మదీయ శకమియ్యఁబడినది. హిజిరిశకమునకు ౬౨౨ కలిపినయెడల క్రీస్తుశకము వచ్చును.

## పాల్వంచ

ఈ సంస్థానము వరంగల్లు జిల్లాలో చేరినది. దీని వైశాల్యము ౧౦౦ చదురపుమైళ్లు. జనసంఖ్య సుమారు ౮౦ వేలు. దీని యాదాయము ౨౦ వేలు. ఈ సంస్థానము రాజు శ్రీ నిజాంగారికి ౮౫ వేల ౧౨౫ రూపాయల కప్పము కట్టును. ఈ రాజునకు ౮౨౧౬ రూ. దేశముఖీ రుసుము వచ్చుచున్నది. మరియు గోదావరి జిల్లాలో భద్రాచలము, రేకపల్లి యను చిన్న సంస్థానములు కలిగియున్నాఁడు. ఈ మొత్తము సంస్థానములవలన రాజుగారికి సంవత్సరమునకు ౬ లక్షల యాదాయము వచ్చుచున్నది. ఈ సంస్థానము ఓరుగల్లు రాజ్యమునకుఁ బూర్వము నుండియే యేర్పడియుండినది. ప్రతాపరుద్ర మహారాజు దగ్గఱ యొకగుఱ్ఱము మంచి జాతిదైనను శూకలాశ్వముగా నసాధ్యమై యుండెనఁట. దానినీ సంస్థానరాజు సాధించి స్వాధీనముచేసినందున మహారాజు సంతసించి వీరికి అశ్వారావు అను బిరుదమొసఁగెను. ఓరుగల్లు సామ్రాజ్యము ముసల్మానులచే నంతరించిన తర్వాత నీ పాల్వంచ సంస్థానము స్వతంత్రమై కొంతకాలముండెను. తైమూరులంగ్ ౧౩౯౮ క్రీ. శ. లో డిల్లి తఖ్తు నెక్కినప్పుడు అన్నప్ప అశ్వారావు అనువారీ సంస్థానమును బాలించుచుండిరి. ఇతఁడు తైమూరులంగునకు లోబడివలసినవుడెల్ల ౧౦౦

సిపాయీల సంపున్కట్టొంపబడి హసనాబాదు, పాల్వంచ (అప్పుడు శంకరగిరియని పిలువబడు చుండెను) యనువానికై శాశ్వతపు సనదు పొందెను. ఇవి క్రీ. శ. ౧౬౯౮ వరకు ౧౮ తరములుగా నీ వంశమందే యుండుచుండెను. ఆలమ్‌గీరు ఔరంగజేబు పాదుషాకు వీరిపూర్వులు సహాయమొకతూరి చేసినందున వీరికి మన్సబ్దారీయిచ్చెను. ౧౭౬౯ క్రీ. శ. లో జఫరుద్దౌలా రాజును జంపి సంస్థానమును లూటీ చేసెను. ౧౭౯౮ లో వేంకటరామ నరసింహ అశ్వారావు గారికి నిజాముగారు, రాజ,బహద్దర్, సవై యనుబిరుదములిచ్చి ౨ వేల గుఱ్ఱపుదళము ౧ వేలకాల్బలము, అలం (జండా) నగారా యుంచుటకు సెలవిచ్చిరి. తర్వాతికాలములో సంస్థానముల వారీకుల తగవులచేతను, బాకీలచేతను చాల క్షీణించెను. ఇప్పుడీ సంస్థానమును శ్రీ రాజా పార్థసారధి అప్పారావు సవై అశ్వారావు బహద్దరు గారు పాలించుచున్నారు.

# వనపర్తి

సుమారు ౩౫౦ సం॥ల క్రిందట కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలోఁ జేరినజనుంపల్లి యను గ్రామమునకు వీరకృష్ణారెడ్డి యనునతఁడు దేశముఖుగా విజయనగర సాంబ్రాజ్యమున కధీనుఁడై యుండెను. కొంతకాలమున కతఁడు ప్రకృతపు వనపర్తిలోఁ జేరిన పాతపల్లియను గ్రామమునుకొని యచ్చట వ్యాపారముచేయుచు నభివృద్ధిచెందెను. ఇతనికి నాలవతరమువాఁడైన వేముడి వేంకటరెడ్డి హిజిరీ ౧౦౫౨లో కుతుబ్షాకు ౧౦ వేలమందితో యుద్ధమందు సాయపడి నెల్లూరును ఉదయగిరిఖిల్లాను పట్టుకొనెను. ఇతఁడు ౧౬౬౦లో మృతిచెందెను.

## అష్టభాషల గోపాలరాయలు

ఇతని కొడుకగు గోపాల రాయలు తిరుపతి, కంచి, శ్రీరంగము మున్నగు క్షేత్రముల దర్శించుకొని తిరిగి తన దేశమునకు వచ్చునపుడు తాను అష్టభాషలం దారి తేరినవాఁడగుటచేతను, రామచంద్రోదయయమక కావ్యమును ఒక భాణమును సంస్కృతమున రచించినవాఁడగుటచేతను పండితవరేణ్యుఁ డగుటచేతను దానుదర్శించిన స్థలములందలి మంచి పండితులను వెంబడించుకొని వచ్చెను. తన సంస్థానములోఁ గూడ శ్రీరంగపురము అనుపేర నొకక్షేత్రము నిర్మించి, దివ్యదేవాలయమును, రంగసముద్రమను పేర నొక గొప్పచెరువును గట్టించెను. ఈరాజ వంశావళిలో నీతఁడే మొట్టమొదలు ,,బహిరీ" యను బిరుదమును సంపాదించెను. అనేక పరగణాల మన్నెవారీని, పానుగల్లు దేశముఖీని సంపాదించి రెండుసంవత్సరములు జటప్రోలు సంస్థానమును,, మిర్జానిబ్,, సర్కారు పక్షమున పాలించెను. ఇతఁడు ౧౭౮౬ లోఁ జనిపోయెను. గోపాలరావునకుఁ బుత్రులు లేనందున సవై వేంకటరెడ్డి దత్తువచ్చియుండెను.

## సవై వేంకటరెడ్డి

వనపర్తి రాజులలో నితనిచరిత్ర చాల గంభీరమైనది. ఈతని కథను తందనానగాండ్లు ప్రాంతములందలి గ్రామములలోఁ జెప్పుచుందురు. ఇతనికాలములో సంస్థాన మందు ఖజానా లేక సర్కారున కియ్యవలసిన పేష్కషు లేకపోయినందున గోపాలరావు భార్యయైన జానమ్మ



పాలంపేట దేవాలయస్తంభము.



పాలంపేటలోని పెద్దదేవాలయము.



పాలంపేట దేవాలయాంతర్భాగము.

యొకసంవత్సరముకారాగృహమందుంచఁబడెను. ఇట్టితరి వేంకటరెడ్డి తన సొంత తండ్రివలనఁగూడ పన్ను బలవంతముగా వసూలుచేసెను. ఇతఁడు తన దత్తుతల్లిపేర జానంపేట యను గ్రామము కట్టెను. దత్తు తండ్రిపేర గోపాలపేట కట్టెను. అదియే ప్రకృతపు గోపాలపేట సంస్థానము. [దీనినిఁ బాలించుటకు తనతమ్ముఁడగు రంగారెడ్డిని యోజించెను.] ఇతఁ డిప్పుడు మహా రాజా కిషన్ ప్రసాద్ బహద్దరువారి జాగీరులోఁ జేరిన ఫత్తుఖ్ నగరు అను కోటనుగట్టెను. తన భార్య పేర కేశంపేట గట్టించెను. అందిప్పుడు సుప్రసిద్ధమైన తిరునాళ్ళ యేటేట జరుగుచున్నది. ఇట్లెందుఁజూచినను రాజుగారి వ్యయములు విశేషముకాగా తన యవసరములకై చుట్టుపట్టుల నుండు జాగీర్దారుల తొందఱపెట్టఁ దొడఁగెను. అంత నిజామీతని శిక్షింప కొందఱ నవాబుల కాజ్ఞయియ్య వారు సైన్యయుక్తులై ఫత్తుఖ్ నగరుదగ్గఱ నతనితో ఘోరముగాఁ బోరాడి యోడిపోయిరి. సమరరంగమం దితనినోడించుట దుస్సాధ్యమని యెంచి యుక్తిచే నీతని సర్దారుల లో భేదములు కల్పించి యీతనిపై మరల దాడి వెడలఁగా నీతని తమ్ముఁడగు తిరుమల్రావు యుద్ధములో మృతిఁజెందెను. వేంకటరెడ్డి యోడిపోయెను. తాను అస్గర్ సుల్తాను చేతిలోఁజిక్కిన తనను తప్పక చంపునని యెంచిఁగి తానే యాత్మహత్య గావించుకొనెను. దక్కనుసూబేదారుగానుండిన ఇరాదత్ ఖాను వేంకటరెడ్డి వృత్తాంత మంతయు ఢిల్లీపాదుషాకుఁ దెలుపుకొనెను. ఢిల్లీనుండి యీ సంస్థానము రాజులకిప్పుడే సవైయను బిరుద మొసఁగఁ బడెను. సవై వేంకటరెడ్డి ౧౧౩౦ హిజరీలో మృతిఁజెందెను.

ఇతని కొడుకు గోపాలరావు రాజ్యమునకు వచ్చెను. ఇక్కాలమందు వీరి వంశీయుఁడైన గోపాలపేట జమీందారు దుండగములు చేయుట విశేషమగుటచే సర్కారువారి యాజ్ఞాప్రకార మతనిని ఖైదుగాఁగొని పోయెను. ఇతని ముఖ్య పట్టణము సూగూరుఅను గ్రామమై యుండెను. ఈ సూగూరు చాల కాలమువఱకు ముఖ్యపట్టణమై యుండినందునను, అచ్చట సంస్థానపు నాణెములు తయారై సూగూరిసిక్కాలు అని పేరు వడసిన వగుటచేతను, అచ్చట వెట్టి విశేషముగా నుండుటచే నేఁటికిని "సూగూరువెట్టి" అని దౌర్జన్యమున కీ ప్రాంతములందు సామెతయై యుండుటచేతను, ఈసూగూరు చాల స్మరణీయమైయున్నది. గోపాలరావు తర్వాత రెండు తరముల వఱకుచరిత్రాంశములు విశేషమైనవిలేవు.

## ప్రథమ రామకృష్ణారావు.

ఈ సంస్థానచరిత్రలో నీ రామకృష్ణరావు చరిత్ర యద్భుతమైనది. ఇతని చిన్న వయసునఁ దండ్రి చనిపోవుటచే రాజ్యాధికారము వహింప వలసి వచ్చెను. ఇక్కాలమున సంస్థానముయొక్క వసూలు ౧ లక్ష ౫౦ వేలరూపాయీలు. అందు సర్కారు వారికి పేష్కష్ ౮౦ వేలు కట్టుచుండిరి. మిగిలిన దానితో రాజ్యమును బాలించుట సామాన్యము గాకుండెను.

౧౨౦౫ హిజరీలో గోల్కొండ సుల్తాను గారు మృగయా వినోదార్థమై వనపర్తి పరిసరారణ్యములందు వేటాడి, యలసి, విడిసియుండఁ బూర్వదాయమైన గోపాల్పేట రాజు సుల్తానుదర్శించి తన పగసాధింపఁగోరి వనపర్తి రాజు చిన్నవాఁడై యుండ దర్శనార్థము రానందున సుల్తాను వారతనిదృష్టిలోలేక పోయిరని బొంకి నవాబుగారికిఁ గోపమువచ్చునట్లు చేసెను. వెంటనే రామకృష్ణరావును బంధించి గోల్కొండలో మూడుసంవత్సరములవఱకు చెఱ

సాలయం దుంచిరి. నవాబుగారి యనుగ్రహముచే విముక్తుఁడై తిరిగివచ్చిన పిమ్మట గోపాలపేటకు సమీపముగనుండి తదధీశులకు తనవలన నప్పుడప్పు డెచ్చిరిగింతుగాక యని తలపోసి రామకృష్ణరావు సూగూరును వదలి వనపర్తినిఁ దన రాజధానినిఁ గాఁ జేసికొనెను. ఇతని కాలమందే ౧౨౩౪ హిజరీలో సూగూరిలో సిక్కాలు సిద్ధము చేయుటకు నిజాము సర్కారు నుండి యనుజ్ఞయయ్యెను. హాలీ సిక్కా తప్ప రాష్ట్రములోని తక్కిన యన్ని సిక్కాలకన్న నీసిక్కా మిన్నయై యుండెను. ౧౨౩౬ హిజరిలో నీరాజుగారికి "బహద్దరు" బిరుద మొసఁగఁబడెను. ఇతఁడు ౧౨౩౫ హిజరిలో గీర్తికాయుఁడయ్యెను. ఇతడు వేఁటయందాసక్తి కలవాఁడు. ఇతఁడు తన రాజ్యమును ప్రజారంజకముగాఁ బాలించిన వాఁడు. న్యాయస్థానపు హక్కుల నీతడు నిజాము దగ్గఱ సంపాదించెను. ఇతఁడు మంచి పాండిత్యము కలవాఁడు; గొప్పభక్తుఁడు; జ్యోతిషమందుఁ బెట్టిన పేరు. ఇతని సహావాసమందు ఫకీరులు (దర్వేషులు) చాల మంది యుండుచుండిరి. సయ్యద్‌షా ఫక్రుల్లా అను సాధు వీతని పరమ మిత్రుఁడు. వీరిద్ద ఱొకనాఁడు వినోదముగా మాట్లాడు కొనుచుండ రామకృష్ణరావు తానింక యొక్క సంవత్సరమునకుఁ గాలధర్మ మొందుదునని చెప్పెనఁట. సయ్యద్ గారు వెంటనే రామకృష్ణరావు గారి యనంతరము తా నారు మాసములే జీవించువాఁడనని చెప్పెనఁట. అదే ప్రకారము రామకృష్ణారావు సంవత్సరానంతరము చిత్రభాను సంవత్సర కార్తీక శు ౧౧ నాఁడు యథావిధిగా నారోగ్యమందుండియు, తన "వీలునామా" వ్రాసి బంధు మిత్రులకుఁ జెప్పవలసినదంతయు నివేదించి సుఖముగా నసువులవిడిచెను. ఇతని మరణానంతరము ఖజానా చూడఁగా ౧౧ లక్షల సిక్కాలును, ౧ లక్ష రూకల విలువ గల రత్నములు నుండెనఁట.

హిజ్ హైనెస్ రాజా రామేశ్వరరావు

రామకృష్ణరావు అనంతరము ప్రథమ రామేశ్వరరావు దత్తపుత్రుఁడై రాజ్యము చేసెను. ఇతఁడు వనపర్తియొక్క కీర్తిని ఖండ ఖండాంతరములందు వ్యాపింపఁజేసెను. ఇతఁడు క్రీ. శ. 1823 ౧౨౩౮ హిజరిలో జన్మించెను. బాల్యమందే యితఁడు ఇంగ్లీషు, ఫార్సీ, అరబము మున్నగు భాషల నభ్యసించెను. తన పదునాల్గవ యేఁటనే రాజ్యభారము వహించెను. ఇతఁడు 1849 ౧౨౬౫ లో మైసూరు రాజ్యమునకుఁ బోయి వచ్చెను. 1850 ౧౨౬౭ లో లేనిపోని యొక బాకీ నెపము పెట్టి హైద్రాబాదులోని యరబ్బులితని కారాగృహబద్ధునిగా నొనరింపఁజేసిరి. కాని యితని సర్దారులు ౮౦ గజముల సురంగము నీతని కారాగారము క్రిందుగాఁ ద్రవ్వించి యితనినిఁ దప్పించిరి. పిమ్మట రాజుగారికి నిజాము గారు సర్వసైన్యాధిపత్య మొసఁగిరి.

బ్రిటిషు భాగమందుండిన పద్ధతులపై రెవెన్యూ సెటల్మెంటును హైద్రాబాదు రాష్ట్రములో నేర్పాటు చేసినది ప్రప్రథమమున నీరామేశ్వర రాయలే. ౧౨౬౯ లో వీరు తమ రాజ్యమును గొలిపించి స్థిరమైన పన్నుల నేర్పాటు చేసిరి.

1857 ౧౨౭౩ హిజరీలో హిందూస్థానమందు సుప్రసిద్ధమైన "తిరుగుబాటు" (గదర్) జరిగెను. ఉత్తరపు గాలి దక్షిణమున హైద్రాబాదులోఁ గూడ వీవఁదొడఁగెను. నిజామునకు సామంతులైన కొందఱు రాజులు తిరుగఁబడిరి. అప్పుడు వీరి దర్పమడంప వలయునని ప్రభుత్వము రామేశ్వరుని కోరెను. ౧౨౭౬ హిజరీలో రాజా

వేంకటప్పానాయని నీతఁడు ఖైదీగాఁ దీసికొని వచ్చెను. ౧౨౭౭ లో లోకాయపల్లి కోటను ధ్వంసము చేసి, అల్లూరు యుద్ధములో ద్రోహుల నాశనముచేసి, అడ్డాకుల యుద్ధమందు గోపాలాలను నామావశిష్ట మొనరించి, ప్రకృతము మహబూబు నగరము జిల్లాలోని మఖ్తల్ తాలూకాలోఁ జేరిన మునినేయను సంస్థానాధీశుఁడైన సుప్రసిద్ధుఁడైన నాగిరెడ్డి యనునతని బహుప్రయాసముతో యుద్ధమందు హతమొనర్చి వీరరామేశ్వరుఁడు తన యేలిక యొక్క మెప్పు వడసెను. ఇక్కాలమందే క్రిమియన్ యుద్ధము ప్రారంభమయ్యెను. రామేశ్వరుఁడును సంసిద్ధుఁడయ్యెను. కాని బ్రిటిషువారు త్వరలో జయము బొందిన వారగుటచే నీతని "హిజ్ హైనెస్" అని సంబోధించి, ఖడ్గము, తుపాకి మున్నగునవి బహుమతిగాఁ బంపిరి. ఇట్లు నిరంతరమును రణరంగ ధీరుఁడైన యీ "బహిరీ" ౧౨౮౪ హిజిరీ లో (1867) వనపర్తికారు మైళ్లదూరమందున్న పెద్దగూడెమను గ్రామమందు స్వర్గస్థుఁడయ్యెను.

వీరి యనంతరము రామకృష్ణ రావు అనువారు రాజ్యమునకు దత్తువచ్చిరి. వీరు స్వారియందు బహు ప్రవీణులు. తన ౧౬వ యేట తంతీలపై గుఱ్ఱమును దాటించుచుండ ప్రమాదవశమున గుఱ్ఱమునుండిపడి చనిపోయెను. వీరి యనంతరము (ద్వితీయ) రామేశ్వర రాయలు దత్తుగావచ్చిరి. వీరు బహుకాలము రాజ్యము చేసిరి. వీరు తమరాజ్యమును జాలవృద్ధికిఁ దెచ్చిరి. విద్యా వ్యాపకముచేసిరి. అనేకనూతననిర్మాణములు గావించిరి. కర్నూలులోని రెడ్డికాన్ఫరెన్సునకు సభాపతులై ౫౦ వేల రూపాయల దానము సంఘమున కొసంగిరి. వీరును, వీరి కుమారులగు శ్రీకృష్ణదేవరాయలును గొంలది కాలము క్రిందటనే కీర్తిశేషులైరి.

[వనపర్తి సంస్థానములో ౧౨౪ గ్రామములున్నవి. వైశాల్యము ౪౫౦ చదరపు మైళ్లు. జనసంఖ్య ౬౫ వేలు. ఆదాయము ౧౪ లక్షలు. పేష్కష్ ౭౯,౦౦౦ రూ॥ చెల్లించుచున్నారు. ఇది మహబూబునగరము జిల్లాలోనున్నది. —గజెటియర్ ఆఫ్ ఇండియా]

## గద్వాల

నిజాము రాష్ట్రములోని సంస్థానము లన్నింటిలోఁ బూర్వమునుండి కాశీ శ్రీరంగ పర్యంతము వితరణకుఁ బ్రసిద్ధి కెక్కిన దీగద్వాల సంస్థానమే. దీని చరిత్ర సుమారు ౭౦౦ సంవత్సరములనుండి వచ్చుచున్నది. మొట్టమొదట ఓరుగల్లు సామ్రాజ్యమునకు లోనై యనంతరము విజయ నగర సింహాసనమునకు పాలెగారు స్థానమలంకరించి, తన్నాశ నానంతరము భామినీ, బీజపుర సుల్తానులను గొలిచి, ఆరు ఢిల్లీ చక్రవర్తులచేఁ బడి యూపు చెడినప్పుడు, మొగల్ చక్రవర్తులకుఁ గప్పము గట్టి, పిమ్మట హైదరాబాదు సుబాను నిజాముల్ముల్కు స్వాధీనముచేసి కొనిన నాఁటఁగోలె వారికి లోఁబడి యుండుచు వచ్చినది. ఆలమ్‌గీర్ ఔరంగజేబు దక్షిణమున బీజపురము యొక్క బలమును ధ్వంసము చేయనెంచి వారిపై తిరుగు బాటుచేయు

టకు గద్వాల రాజులను ప్రోత్సహించెను. బిజాపూరు సుల్తాను గద్వాల వారిపై సైన్యము నంపగా దట్టూరు దగ్గఱ నుభయ సైన్యములకు యుద్ధమయ్యెను. బిజాపూరు సైన్య మోడిపోయెను. గద్వాల రాజు సుల్తాను పచ్చ జండాను లాగుకొనెను. ఈ జండా యిప్పటికి గద్వాల నగరమందున్నది. ఒక కాలమందీ సంస్థాన రాజులు కర్నూలు నవాబుల వలన కప్పము లందు చుండిరి. ఈబీజాపురము సుల్తానుల దగ్గఱనే యీరాజులు, నాడు, నాడగౌడు, సర్నాడగౌడు, అను నధికారములఁ బొందియుండిరి. బహు కాలము నఱకీ రాజులు కర్నూలు జిల్లాలో బేతంచెర్ల, రంగాపురం, సిరివెళ్ల కోటలను స్వాధీనముచేసికొని తమ సైన్యముచే నందుంచి పరిపాలించిరి.

ఓరుగల్లు మహారాజుల వలన నాడగౌడు బిరుదమును ౬౦౦ సం॥ల క్రిందటను, ఔరంగజేబు పాదుషా వలన సర్నాడ గౌడు బిరుదమును ౧౧౧౬ హిజరీలో (౧౭౦౪ క్రీ. శ.) పొంది యుండిరి. హిజరీ ౧౧౧౯ లో (౧౭౦౭ క్రీ. శ.) బహదూర్‌షా చక్రవర్తి తన సేనా నాయకుఁడైన ఖాజాఖులీఖానునకు యుద్ధమందు ముఖ్యముగా సాయపడి జయలక్ష్మినిఁ జేకూర్చినందులకుఁ గృతజ్ఞతా సూచకముగ నొక జాబీ సంస్థానపు రాజునకు వ్రాసెను. తర్వాతి కాలములో (౧౭౬౮ క్రీ. శ.) లో మహారాష్ట్రులీ సంస్థానము వలన "చౌత్" చతుర్థ భాగముగా ౧ లక్ష ౧౫ వేల రూపాయిల పన్నును వసూలు చేసిరి. పూనా పేష్వాల సామ్రాజ్య మంతరించిన పిమ్మట బ్రిటిషు ప్రభుత్వమువారు పై మొత్తమును బొందు చుండిరి. తదనంతరము నిజాముగారి యధీన మందుండి పేష్కష్ చెల్లించుచు వచ్చిరి.

## సోమనాద్రి

ఈ సంస్థానపు రాజులలోఁ బ్రసిద్ధి నహించిన రాజు శోభనాద్రి యను వారు. వీరిచరిత్ర యీప్రాంతములలో రెండుదినముల వరకు తందనాల కథలుగా జెప్పుచుందురు. ఇతఁడు సుమారు ౨౦౦ సంవత్సరముల క్రిందటి వాఁడు. అనేకయుద్ధములలో నిత్యజయలక్ష్మిని జేపట్టిన వాఁడు. ప్రకృత గద్వాలకోటను గట్టిన దితఁడే. ఇతనికి దైవసహాయమున గొప్పనిక్షేపము దొఱకెను. దానివలన నగరాభివృద్ధిచేసి గొప్ప దేవాలయములను గట్టి రెండుజాతరలు సంస్థానములో నేర్పాటుచేసి కంచి, శ్రీరంగము, తిరుపతినుండి గూడ వచ్చిన వివిధకళలందారితేరిన పండితులకు సంతృప్తికరముగ మన్ననలిచ్చి పంపుచుండెను. ఇతనికాలముననే కణాదము పెద్దన మున్నగు మహాకవులు వీరి యాస్థానమందు వెలసి రామాయణాది గ్రంథముల రచించిరి. ఇతనిమనుమని పేరు చిన్న సోమ భూపాలుఁడు. ఇతఁడు స్వయఁకవి, కళాశాస్త్రిమును గుఱించి యొక మనోహరమైన ప్రబంధమును రచించెను.

ఈ సంస్థానము రాజులు పూర్వమునుండియు దమ పరిపాలనములో స్వతంత్రముగా నైతులఁ బాలించినారు. తమపై ప్రభువులు పేష్కష్ మాత్రమే వసూలు చేసికొనుచుండెడి వారు. ప్రకృతము గద్వాల సంస్థానము శ్రీశ్రీ నిజాంప్రభువుల కేఁటేఁట ౧౦ వేల రూపాయల పేష్కష్ చెల్లించుచున్నది. ఈ సంస్థానమును బూర్వము లింగమ్మ, వేంకట లక్ష్మమ్మ

అను రాణీలు పాలించి యుండిరి. మొన్నగతిం గారు. ప్రకృతమీ సంస్థానము కోర్టపువార్డ్సు చిన రాజు, శ్రీరాజా సీతారామ భూపాలు లోనున్నది.

## పాపన్నపేట

ఈసంస్థానమిప్పుడు చిన్నదైనను బూర్వమొక కాలమందు మెదకు జిల్లా యంతయుఁ దత్సంబంధమై యుండినందునను, అచటి రాజులు, రాణులును శౌర్య సాహసముల రణరంగములపై ప్రకటించిన వారగుట చేతను దాని చరిత్ర మించుక వ్రాయుట యవసర మయ్యెడి.

పాపన్నపేట ప్రకృతము మెదకు జిల్లా లోనున్నది. మొదట మెదకే యీ సంస్థానమై యుండెను. మెదకు సంస్థానము సుమారు ౯౦౦ సంవత్సరముల క్రిందటిది. ఇది గద్వాల కన్న పూర్వముది. ఔరంగజేబు పాదుషా కాలము వరకిది బాగుగా స్థాపితమై యుండెను. మొదలీ సంస్థానమునకు ౪ లక్షల రూపాయీల యాదాయమై యుండెను. శతాబ్దములు మారు కొలఁది సంస్థాన దశయు క్షీణించుచు వచ్చెను. సర్ సాలారుజంగు కాలమున దేశముఖీ సర్దేశముఖీ రుసుములు కలసి దీని యాదాయము ౨ లక్షలై యుండెను. కాని ప్రకృతము దాని యాదాయము ౧ లక్ష ౨౫ వేల రూపాయీలై యున్నది.

ఈ సంస్థాన మందలి రాజుల విషయము లో నిద్దఱి చరిత్రము ముఖ్యముగా గమనింప వలయును.

### రాజా సదాశివరెడ్డి.

ఈ రాజుకథ జనులలోఁ జాలవరకు వ్యాపించి పోయినది. ఇతని చరిత్రము తంద నాన వాండ్లు రెండు రాత్రులవఱకు పాడు చుందురు. ఇతనిచర్య లన్నియు యుద్ధ సంబంధము తప్ప యింకేవియు లేవు. సుమారు ౧౫౦ సంవత్సరముల క్రిందట నిజాము రాష్ట్రమును నవ్వాబు నిజామలీఖాన్ బహద్దరు రాజ్యము చేయు చుండెను. అతఁడు చాల కాలము వరకు మృతి నొందక రాజ్యము చేయుచుండ రాజ్యాధి కార మును వహింప నాతుర పడుచు తన ౪౦ వత్సరముల వయస్సును గడిపిన యతని కుమారుఁడగు ఆలీజాహ తన తండ్రినిఁ దొలఁగించి తానా సింహాసనాధిష్ఠుఁడు గాఁ గోరెను. ఇతని యిష్టమున కనుకూలముగా నీతని బావయు హైద్రాబాదునకు నాజమును నైన బదియుల్లాఖాన్ సలహా యిచ్చెను. ఇక్కార్యమును సాధించుటకుఁ దగిన శూరుఁడెవ్వఁడని యాలోచించి తుదకు మెదకు రాజ్యమును బాలించు చుండిన సదాశివరెడ్డియె యని నిశ్చయించి యాతనిని వేడుకొనిరి. సదాశివరెడ్డి వెంటనే సైన్యయుక్తుఁడై హైద్రాబాదుపై దాఁడివెడలెను. బదియుల్లాఖాన్ కోటద్వారమును దెఱచెను. హిజిరీ ౧౨౦౯వ సంవత్సరము (క్రీ. శ. ౧౭౯౫) లో షవాల్ నెలలో (చైత్రములో) నొకనాఁడర్థరాత్రి మిట్లు ద్వారము తెఱవఁబడగా సదాశివరెడ్డి లోపలఁ బ్రవేశించెను. ఆలీజాను బయటకు చౌకులోనికిఁదెచ్చి గుఱ్ఱముపై గూర్చుండఁ బెట్టిరి. నిజాము దేవిడీకి నిచ్చెనలు వేసి నిజామును ఖైదీచేసి ఆలీజాను సింహాసనముపై నిడఁ జూచిరి. కానిఆలీజా కడసారి వెనుక ముందాడఁ

జొచ్చెను. ఇంతలో నిజాము మేల్కొని యాత్మసంరక్షణము చేసికొనఁ దొడఁగెను. తెల్లవాఱవచ్చెను. సమయము తప్పినదని యెంచి సదాశివరెడ్డి ఆలీజాను వెంట నిడికొని బిదర్ కోట దారి పట్టెను. మఱునాఁడే ముసల్మానులకు ముఖ్యమైన ఈదుజ్జుహాయను పండుగ. ఆనాఁడు పాదుషా యెల్లప్పటికి ప్రకృతము ఈదీ బజారు దగ్గఱ నగరము వెలుపల నుండిన ఇద్గాలో నమాజు చేయువాఁడు. కాని సదాశివ రెడ్డి యింకను నగరము నావరించినాఁడోయను భయముచే మక్కా మసీదులోనే నమాజు చేసికొనెను.

అచ్చట బిదరు కోటకు అధికారి (ఖిల్లేదారు) అయిన జిక్ రొద్దీన్, ప్రవ్యాధీనుఁడై ఆలీజా యొక్క స్వాధీనములో ఖిల్లానుంచెను. ఈ వార్త నిజామలీఖాన్ విని వారిని శిక్షించి పట్టుకొని రమ్మని సిద్దీఅబ్దుల్లాఖాన్ అను సర్దారును గొప్పసైన్యముతో నంపెను. కాని యీ సిపాయి సాలారు యుద్ధములో మరణించెను. సైన్యము దిక్కులు పట్టెను. సైన్యము యొక్క యాయుధములు, ఖజానా మున్నగునవి లూటీ యయ్యెను.

ఈ భయంకరవార్త తిన్నఁగా హైద్రాబాదు చేరెను. నిజామలీభీతుఁడయ్యెను. ఈమారింగ్లీషుల సహాయ మవసరమని యెంచెను. వెంటనే మీరాలంను, (మూసా) రేమూ అను ఇంగ్లీషు కమాండరును, ఇంగ్లీషు సోల్జర్లను, సీపాయీలను, నిచ్చి బిదర్ కోటపై పంపెను. ఘోరయుద్ధము జరిగెను. సదాశివరెడ్డి సైన్య మింగ్లీషుతోఫుల ముందఱ తాళఁజాలక నాశము కాఁగా మిగిలినది పలాయనమయ్యెను. ఆలీజాః కోటలో దాగుకొనెను. సదాశివరెడ్డి తప్పించుకొని పోయెను. కొంతకాలమున కితనికి సర్కారు దగ్గఱ క్షమాపణము చేయింతుమని మీరానెయార్ జంగ్ అనునతఁడు సదా శివరెడ్డిని బిలచికొని పోయెను. కాని యతనిని గోలకొండకోటలో ఖైదీచేసి పిమ్మట సదాశివరెడ్డిచే యుద్ధమందుఁజచ్చిన సిద్దీఅబ్దుల్లా యొక్క కొడుకగు రాద్‌జంగ్ అనువానిచే శిరచ్ఛేదనము చేయించిరి.

## “రాయబేగం” రాణీశంకరమ్మ

ఈ సంస్థానమునఁ బూర్వము రాజ్యముజేసిన వారిలో రాణీశంకరమ్మ స్త్రీయైనను దన రాజ్య పరిపాలనము వలన నేమి, యుద్ధనైపుణ్యమువనేమి తాను చిన్న కోస్తారాజ్యము చేయక గొప్పరాష్ట్రమునే యేలియుండిన ఏ లక్ష్మీబాయియో అహల్యా బాయియో యని చరిత్రకారులు శ్లాఘించి యుందురు. ఈయను తన స్వామి కార్యహితార్థమై పేష్వాలతో యుద్ధముచేసి వారి నోడించి నిజామునకు మేలు చేఁకూర్చెను. ఈ వీరమాత యొక్క “ఉత్సాహసాహసౌదార్యధైర్య” గుణములను మెచ్చి నిజాముప్రభువీమెకు రాయబేగం అని బిరుదమిచ్చి, పల్లకీ, “మాహెమరాతబ్” మున్నగు గౌరవ సూచకముల దయచేసి యీసంస్థానదారు లెప్పుడు పట్టణము వచ్చినను నిద్దరు సర్దారులునగరము వెలుపట నెదురేగి యాహ్వానింపవలయునని యానతిచ్చెను.

మెదకు రాజులు తమ జాగీర్లలో ననేక స్థలములందు కోటలు కట్టిరి. సంగారెడ్డి, రామాయమ్మపేట, మున్నగునవి వీరి నిర్మాణములే. ఈరాజులకు చార్హజారీమన్సబ్, హజారీ సవార్ ఆలం, నఖారా, జాలార్దార్, మున్నగు బిరుదములున్నవి. ఈసంస్థానమునకిపుడు రాజుగా వచ్చినవారు సుమారు ౩౦ యేండ్లవారు. ఇది కోర్టఫ్ వార్డ్సులో నున్నది.

# దోమకొండ

నిజాము రాష్ట్రములోని పురాతన రాజస్థానములలోనిది యొకటి. ఇది సుమారు ౬౦౦ సంవత్సరములనుండి ప్రబలుచు వచ్చినట్టిది. ఈ సంస్థానమునకు మూలపురుషుడు కామినేడు. ఇతని విషయమై సూతసంహితయందు సూర్యవంశపుక్షత్రియుడనియు, సాకనాటి శాఖకుజేరినవాడనియు; రాచుల్లగోత్రము వాడనియు వ్రాయబడినది. ఇతని నివాసస్థలము గోదావరి మండలములోని బిక్కనవోలని పేరునుబట్టియే నిశ్చయించియుండిరి. కాని యిప్పుడు సూతసంహితవలన "మెదుకు బల్దుర్గంబుక్రిందర జిరంతనమౌ బిక్కనవోలు" అని ప్రకృతపు నిజాము రాష్ట్రములోని మెదకు జిల్లాలోని బిక్కనవోలని నిశ్చయమయ్యెడి. ఇతనికుమారుడైన తరమువాడైన కాచరెడ్డి బ్రాహ్మణ భక్తుడును, అనేక సత్రముల గట్టించినవాడును, దానము చేసినవాడును నైయుండెను.

## మల్లారెడ్డి

కాచరెడ్డి మనుమడు మల్లారెడ్డి. ఇతడీ కామినేని వంశమున కంతయు గీర్తి సంపాదించినవాడు. రెడ్లలో నీతడు ప్రాచీనకవీశ్వరుడు. ఈతడు షట్చక్రవర్తి చరిత్రము, పద్మపురాణము మున్నగు ప్రబంధములను రచించెను. ఈతని శైలి చాల ప్రౌఢమైనది. ఇతడు ౧౫౦౦ శాలివాహన శకమందుండినట్లు బ్రహ్మోత్తరఖండములోని పద్యమువలనను సోమనాథ కవి సుల్తాన్ మహమ్మదు పాదుషా వలన నీతడు గౌరవములు బొందెనని వ్రాసియుండుట చేతను నిశ్చితమైనది. ఈమల్లారెడ్డి వంశీయుడైన రాజన్న చౌదరి కాలములో బిక్కనవోలునకు మూడు క్రోసుల దూరముననున్న దోమకొండ యను గ్రామము రాజుల నివాసస్థలమైనకతమున నాటి నుండియు నిది దోమకొండ సంస్థానమని పేరు బొందెను. రాజన్న చౌదరి ౧౨౦౨ హిజిరీలో (౧౭౮౭ క్రీ. శ.) రాజ్యము చేసెను.

## ప్రథమ రాజేశ్వర రావు.

ఇతడు రాజన్న కుమారుడు. ఇతడు నిజామలీఖాన్ కాలములో ననగా సుమారు ౧౩౯ సంవత్సరముల క్రిందట రాజ్యము చేసెను. ఇకాలమున ఆజముల్ ఉమ్రా ముషీరుల్ముల్క్ అను నవాబు పూనా పేష్వాల చేతులలోబడి ఖైదీగా నుండినందున నీ రాజేశ్వర రావు పేష్వాల దృష్టిపడచి యీతని విడుదల గావించెను. దీని కారణమున నవాబువాపసువచ్చిన తోడనే నిజాముగారి కీతని విషయమై చెప్పి చంద్రమహాదేవపురము, పాల్వంచ, భద్రాచలము, అను వాని పై జిల్లెదారునిగా నేర్పాటు చేయించెను. నిజాము రాష్ట్రములో ననేక జమీందారులు రాజద్రోహులై తిరుగు బాటు చేసిరి. ఈ దోమకొండ రాజు వీరి నందఱను స్వయముగా యుద్ధములం దోడించి వీరి తలల నిజాము ప్రభువు గారికి గానుకలుగా బంపెను. వీరి జాగీరులు "ఖాల్సా" చేయబడెను. (లాగుకొనబడెను) ౧౩౧౧ హిజిరీలో (౩౮ సం॥ల క్రిందట) మహబూబుఅలీ పాదుషా గారిచే రాజేశ్వరరావు మనుమడైన సోమేశ్వరరావు గారికి బలవంత బిరుదమొసగబడెను. ప్రకృత మీ సంస్థానమును శ్రీశ్రీ రాజారాజేశ్వరరావు బహద్దరు గారు పాలించు చున్నారు.

# జటప్రోలు

[ఈ సంస్థానము మహబూబునగర్ జిల్లాలోఁ జేరినది. ౮౯ గ్రామములును 30 వేల జనసంఖ్యయుఁ గలిగివి. దీనివైశాల్యము ౧౯౧ చదరపుమైళ్లు. రాజునకు వచ్చుబడి మొత్తము ౨ లక్షలు. నిజాంసర్కారునకు ౭౦ వేల పేష్కషు చెల్లించు చున్నాఁడు. — గజటియర్ అఫ్ ఇండియా.]

ఈ సంస్థానపు రాజులు "సురభి" వంశమువారు. వీరి గోత్రము రేచర్ల గోత్రము. వెలమశాఖకు చేరినవారు. వీరిమూలపురుషుఁడు బేతాళనాయుఁడు.

ఇతఁడు ౯౫౦వ శా. శకమందు రాజ్యముఁ జేసెను. ఇతని శౌర్యమును గుఱించిన కథలసంఖ్యాకములు. ఇతఁడుతనపూర్వులచే దాఁచఁబడిన ధనమును బేతాళుని జయించి సంపాదించిన వాఁడగుటచే నీబిరుదమును బొందెనఁట. ఇతఁడు కాకతీయ గణపతి రుద్రదేవుని కాలములోనుండెను. ఇతనికి తొమ్మిదవ తరము వాఁడు అనపోతనాయుఁడు ౧౧౬౫ శా. శకమందు (క్రీ. శ. ౧౨౪౩) రాజ్యముచేసెను. ఇతఁడు పానుగల్లు మున్నగు కోటల సాధించి తనరాజ్యమును దూర్పున శ్రీశైలము వరకును, పశ్చిమమున సూగూరు వరకును, నుత్తరమున దేవరకొండవరకును, దక్షిణమున కృష్ణానదీ తీరము వరకును వ్యాపింపఁజేసెను.

ఈ వంశమం దనేక శూరులును బండితులును నుత్పత్తి యైనవారు. వీరి పూర్వుల బేతిరెడ్డి, చెవ్విరెడ్డి, మున్నగు నామములు వీరిని రెడ్డి తెగవారినిగా సూచించుచుండ మధ్యకాలమందు సేనానాయకత్వమును సూచించు నాయఁడు బిరుదమును బట్టి వీరిని వేరుగా లోకము భావించుచున్నది. కాని వీరును, రెడ్లును, దగ్గఱి సంబంధము కలవారని తోఁచు చున్నది. ఈ వంశమందే సర్వజ్ఞసింగ భూపాలుఁ డుత్పత్తియయ్యెను. ఇతని చరిత్రము జగత్ప్రసిద్ధము.

ఈసంస్థానపు రాజులుశూరులై "కంచికవాటచూరక" "పంచపాండ్యదళవిభాల" ఖడ్గనారాయణ 'కాకతీయ రాజ్య స్థాపనా చార్య' భుజబల భీమ, యను బిరుదముల నంది, రెడ్డిరాజులకు శత్రులై "సోమకుల పరశు రామ', 'రాయసాహు' అను బిరుదముల పెట్టుకొని యుండిన వారేకాక, శాస్త్రములందును పండితులై గ్రంథకర్తలై కృతిభర్తలై వెలసియుండిరి. ఈ వంశమందు మల్లానాయఁడను నాతఁడు ఎలకూచి బాలసరస్వతితో "భర్తృహరి సుభాషితమును" దెనుఁగులో రచింపఁ జేసెను. మాధవరాయలను వారు స్వీయముగా చంద్రికా పరిణయమను ప్రబంధమును రచించిరి.

ఈ వంశమందు సుమారు ౯౦ సంవత్సరముల క్రిందట రాజ్యముచేసిన లక్ష్మారావు అనువారి కాలమువఱకు జటప్రోలు రాజ్యమునకు ముఖ్యపట్టణమై యుండెను. కాని వీరికాలమునుండి కొల్లాపురము రాజధాని యయ్యెను.

## జగన్నాథరావు

లక్ష్మారావు కొమారుఁడైన జగన్నాథరావు ఫసలీ ౧౨౬౦ నుండి ౧౨౯౩ వరకు (క్రీ. శ. ౧౮౫౧ నుండి ౧౮౮౪ వరకు) రాజ్యముచేసెను. ఈ జగన్నాథరావు గుఱ్ఱముల స్వారియందుఁ బ్రసిద్ధుఁడు. బెంగుళూరు, మదరాసు, మున్నగుచోటులజరుగు గుఱ్ఱపుఁబందెములందుఁ బాల్గొని జయమొందుచుండెను. ఇతఁడు కంచి



హంపిలోని శిథిలమైన ఒకరాజ నగరు.



హంపి దేవాలయపు ఎదుటనున్న మంటపము.

చంద్రకాంత్ ప్రెస్, హైద్రాబాద్ దక్కన్

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ భవనము.




రెస్సి బజారు, హైద్రాబాదు

వరదరాజస్వామిని సేవించుకొని యచ్చటఁ బ్రతి దినము తనపేరఁ బూజచేయు నట్లేర్పాటుచేసి వచ్చెను. అదియిప్పటికిని జరుగుచున్నది. తనసంస్థానములోఁ జేరిన సింగవటము గ్రామమందు శిథిలమై యుండిన పురాతన దేవాలయమును పునర్నిర్మాణము గావించి యచ్చట పూజలు ప్రతిసంవత్సర ముత్సవమును జరుగునట్లేర్పాటుచేసెను. ఈ దేవాలయమందలి నరసింహస్వామికి సేవజేయునిమిత్తము ప్రతిదినము ఒక రూపాయి సర్కారువారిచ్చునట్లు రాజాచందూలాలేర్పాటుచేసెను. ఇతనికి నిజాము వలన రాజ బహద్దరు, మున్నగు బిరుదము లొసఁగఁబడెను. ఇతనికి సంతతి లేనందున ప్రకృతము రాజ్యము చేయుచున్న శ్రీ శ్రీ రాజా వేంకట లక్ష్మా రావు బహద్దరు గారిని దత్తుగాఁ దీసికొనెను. వీరు వేఁటయందు సుప్రసిద్ధులు. ఇంత వఱకే సుమారు ౧౩౫ పెద్ద పులులను సంహరించి యున్నారు. వీరికి గత సంవత్సర మందు షష్టిపూర్తియయ్యెను.

## అమరచింత

ఇది మహబూబు నగరములోఁ జేరినది. ౬౫ గ్రామములు గలది. ౧౯౦ చదరపు మైళ్ల వైశాల్యము. దీనియాదాయము ౧౫లక్ష. పేష్కషు ౬ వేలు చెల్లింపఁబడు చున్నది.

ఈసంస్థానము పురాతనమైనదని మాత్రము చెప్పఁబడు చున్నది. కాని దీని చరిత్ర యొందును గోచరము లేదు. ఆత్మకూరు రాజుగారి రాజధాని. ఇందు ౨౩౩౦ జనసంఖ్య. ఈ సంస్థానము పూర్వము నుండియు హస్త పరిశ్రమలకుఁ బ్రసిద్ధి. ఇప్పటికిని మంచి వస్త్రములు నేయఁబడుచున్నవి. ఇప్పుడీ సంస్థానము శ్రీ శ్రీ రాజా శ్రీరామ భూపాలరావు బహద్దురుగారు రాజ్యము చేయుచున్నారు. వీరి వయస్సు సుమారు ౪౫ సంవత్సరములు సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సులోనున్నది.

### ముగింపు

ఇప్పటికే వ్యాసము చాల విస్తరిల్లియున్నది. కావున నింకను లెక్కఁబెట్టఁ దగిన సంస్థానముల పేర్లు మాత్రము సూచింపఁబడును.

(౧) సీర్నపల్లి (౨) గోపాలపేట (3) దుబ్బాకుల (౪) ఆనెగొంది (౫. చించోడు.



# శ్రీకృష్ణదేవరాయల

# అష్టదిగ్గజముల ప్రతిభ

"శ్రీ కృష్ణ దేవరాయల
ప్రాకట దిగ్గజములనఁగ బరఁగు కవుల సు
శ్లోకుల చారిత్రమ్ములు
వాకొనఁబడు సంగ్రహముగఁ బాఠకు లలరన్.

## అల్లసాని పెద్దనకవి

(అల్లిక జిగిబిగి)

ఇత్యాది శ్రీమదాంధ్ర కవితా పితామహుని స్థూల దేహ ప్రతిబింబమని మన మందరము భావనా మాత్ర సంతుష్టిఁ జెందవలయును. మన సనాతన ధర్మ నిరతులు స్థూలమును తృణీకరించిరనియు సూక్ష్మ కార్యములకై ప్రాముఖ్యము నిచ్చిరనియు సర్వజన విదితము. కాన, మన పూర్వ కవుల స్థూల దేహ విషయక జ్ఞానము కాని, వారి యదార్థ చరిత్ర కాని మనకుఁ దెలియదు. కాని వారి సూక్ష్మ తత్వము వారి గ్రంథముల ద్వారా మనకు విదితమై యుండును, వారి భావనా ప్రపంచము మనకు సువ్యక్తముగఁ బ్రపంచితమనియే నుడువఁదగు.

చంపూ ప్రబంధ రచనావిర్భావము నన్నయాదుల తోనే మొలకలెత్తినను, శ్రీనాథాదుల కాలమునకే (క్రీ॥శ॥ ౧౪౦౦) ప్రకాండావిర్భావముం జెందినది. కాని గీర్వాణ వాణీ విలాసములగు సనాతన పురాణేతిహాస సరస కుసుమ నైతిక సౌందర్యమునే యాంధ్రజాతి యెదుటఁ జిత్రించినవి; సరసమగు నూతన భావాది వైఖరినిఁ గొంత వఱకు సృష్టించిరయే యుండెనని నా తలంపు. కాని, కథాంశ కల్పన మిక్కిలి తక్కువయని నొక్కి చెప్పనగు.

క్రీ॥శ॥ ౧౫౦౦ లకు లోఁగానే యీ లోపము కొంతవఱకు, మాతృకలయందలి కొన్ని సుగుణములు పోయినను, దక్కఁజేయఁబడెనన వచ్చును. ఈ రెండు శతాబ్దులే యాంధ్ర కర్ణాటక భాషా వాఙ్మయముల యుచ్ఛదశా కాలము, ద్విశాఖయగు నీ భాషా వాఙ్మయ వృక్ష సరసఫల విడంబనమునకు శ్రీ కృష్ణరాయలే యాలవాలము. ఈ తెనుఁగు శాఖను పెద్దనాదులు స్వారోచిష మనుసంభవాది కావ్య చిత్రములచే నలంకరించిరి. ఆ కర్ణాట సోదరీ భూతమగు శాఖను దిమ్మన కుమార వ్యాసాదులు భారత కథా చిత్రములచే నలంకరించిరి. ఉభయ భాషా శాఖలును ప్రౌఢ సౌందర్యమును వహించిన కాల మిదియే. మంచితో యించుక చెడ్డతో మించి వచ్చుచున్న యైస్లమిక నాగరకతా ప్రవాహమున కడ్డకట్ట వైచిన విజయనగర సామ్రాజ్యము మన సనాతనార్య నాగరకతాలావణ్య సారముం గాపాడిన దెంత సత్యమో, పరస్పర సంఘర్షణములచే సనాతన దృష్టులు సడలుటయు నంత సత్యమే. సనాతన పురాణములలో నూతన కల్పనలం జేర్పరాదన్న సనాతన కవి సాంప్రదాయములను "బుద్ధి జాడ్య జనితోన్మాదముల్ గదా శ్రోత్రియుల్" అని యెత్తి పొడిచిన పెద్దనార్యుఁడే తృణీకరింపకున్న మఱి యే కవి యీ పరివర్తనము చేయఁగలిగియుండును? రాయలచేతనే బోయెత్తు పల్లకింగేల నొత్తించు స్వాతంత్ర్యము గల పెద్దన యా కాలమున నీ కావ్యరచనకు సాహసించుట సముచితమే కాని మించిన వింతకాదు.

వాఙ్మయావిర్భావ భూమికలు జాతీయావిర్భావ భూమికలం బ్రతి ఫలింపఁ జేయుచుండును. ఆయా కాలముల నుద్భవించు వ్యక్తులా యా యావిర్భావ దశల ననుసరించియే యుండును. కావున నూతన ప్రబంధ కల్పన కాలానుగుణము; పెద్దనార్యుఁడు నిమిత్త మాత్రుఁడగు సవ్యసాచి.

సవ్యసాచి యొక్క ప్రజ్ఞ పెద్దనార్యున కొకటి విచిత్రముగఁ గలదు. రసాభివ్యక్తికి ననుగుణముగ రచనాధోరణిని గేవల సాంస్కృతిక సమాసములతోఁ గాని తేనెలొలుకు నచ్చతెనుఁగుఁ బలుకులతోఁ గాని నింపి వేయు సమర్థత కలదు. కనుకనే „కృతి రచింపుము మాకు శిరీషకుసుమ పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య” యని రాయ లన్నట్లు మన కవియే పీఠికలోఁ జెప్పి యున్నాఁడు.

వేఁటను వర్ణించుటలో స్వభావ వర్ణనమున సూక్ష్మతమాంశములను గూడఁ దృణీకరింపఁడు. ఈతని వర్ణనలోని కౌశల్యమును మించ నెంచి రామరాజభూషణుని తరువాత యత్నించిన కవులు సరసతం జెడఁ గొట్టిరి.

ఆ ప్రవరుని గుణపోషణము ప్రాచ్య నాగరకతలోని నైతిక లక్ష్యముల ననుసరించి మన నైజ ధర్మ దృష్టినిఁ బోషించు చున్నది. రజస్తమో గుణ విజృంభణములచే వరూథిని ప్రవరుని సత్త్వమూర్తిని, „ఎక్కడి యూరు కాల్నిలువ కింటికిఁ బోయెద నంచు...సరి రాకపోయెనే...యీలవలీ నికుంజముతో” ఇత్యాదివాక్యముల వంచింపఁ జూచినను, అహితాగ్నియు, జననీ జనక సురాతిథ్యర్చన యందుం దత్పరుండగు ప్రవరుండు వశము కామియు, నాసురకామాదుల జయించి, „దివిషద్వ గ్గము నీముఖంబునన తృప్తింగాంచు నిన్నిశుఁగా...నన్నుఁ గావఁగదవే స్వాహా వధూవల్లభా” „దాన జపాగ్నిహోత్ర పరతంత్రుఁడనేని...నన్ను సదనంబున నిల్పుము ...హవ్యవాహనా” అనుచు గమ్యస్థానము నీశ్వరానుగ్రహముచేఁ జేరుటయుం బ్రాచ్య లక్షణముల కనుకూలముగను సరస తరముగను వర్ణింపఁబడినది.

పూర్వ కవి కృతాంధ్ర ప్రబంధములు మార్గదర్శకములైన మాట సత్యమేయైనను, మన పెద్దనార్యుని కావ్యరచనలో విశేషముల నేకములు కలవనుటయు నిశ్చయ తత్త్వమె. లోకానుభవ మెంత యధికముగ నుండునో రసపోషణమును మంచి కవి కంత యెక్కువగ సులభమగును. ఈ విషయమునఁ బెద్దనార్యుఁ డా కాలమున రాయల యాస్థానమున నుండుట మిగుల లాభకారియయ్యెను. అమాత్య వాస్తవ్యు లీ యాంధ్ర సారస్వత కల్పకమును బెంచి „పెరటి కల్పకముం”జేయుట యీయనుగ్రహాధిక్యము చేతనే యనవచ్చును.

ధాయప్రోలు వేంకటరామ సోమయాజులు

# ముక్కు తిమ్మన కవి

(ముద్దు పల్కు)

ఈతఁడు కృష్ణరాయని యాస్థానకవులలో పెద్దన తరువాత పెద్దన యంతటి మహనీయుఁడు. ఈ కవికి ముక్కు తిమ్మన యను నది నామాంతరము. యదార్థమున నీతని గృహనామము నంది వారు. కాని ముక్కుమీఁద నీతఁడొక చక్కని పద్యమును జెప్పుటచే నాతనికీ ప్రసిద్ధ గృహనామము వచ్చినదని కొందరందురు. మరికొందరు ఈయనకు మిక్కిలి పొడవగు ముక్కుంటచే నందురు. ఈ రెండవ సంగతి యట్లుండ ముక్కు పద్యము ఈతనిదే అయినను ఆ కారణమువల్ల నీయనకా నామము వచ్చిన దనుట చాల హాస్యాస్పదము. ఈతఁడు ముక్కు మీదనే గాక, అనేక ఇతర సందర్భములందు అంతకన్న నెక్కుడు సుందరము లగు పద్యములు చెప్పెను. అట్లైనచో ఆ సందర్భముగ నీతనికి ప్రసిద్ధ గృహనామ మేల రాలేదు? అటువంటి కారణము వలననే ఇతని కా నామము నియ్యదలచినచో పారిజాతాపహరణపు తిమ్మన యను నామము సర్వోత్కృష్టమయినదిగ నుండి యుండెడిది. కావున ముక్కుపద్యపు సిద్ధాంతమును వదలుట మంచిది. ఇదొక గొప్పవిషయము కాకపోయినను ఈ ముక్కు పద్యపు కథను ఇంత వర కెవ్వరును విమర్శించి త్రోసివేయక పోవుటచే నింతమట్టుకు వ్రాసితిని.

ఈ కవి ధోరణి అత్యద్భుతము. ఈయన „ముద్దు పలుకులు, ఆంధ్రసారస్వతము నం దింతవరకు అద్వితీయము

ముత్తై యలరారుచున్న వనిత నిం దతిశయోక్తి లేదు. తన కథానాయికను ఏడ్పించు నవసరమున కూడ ముద్దుముద్దుగా నేడ్పించిన ఈమహా కవి నేర్పు నేమని వర్ణించ గలము! ఆలలితాంగి ప్రాణవిభు కట్టెమట, పంకజ శ్రీసఖమైన మోముపయి చేలచెరంగిడి, బాలపల్లవాగ్రిమ కషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనితో గాసిలి యేడ్చె నట. ఓహో! ఏమి యీ కవితా చమత్కృతి! ఎంత చక్కని పదములు! భావమును గూర్చి చెప్ప నలవియే కాదు.

తిమ్మ నార్యుడు స్త్రీ హృదయమును, తత్సహజ కోమలత్వమును, ప్రేమగల స్త్రీ పురుషుల యన్యోన్య సంబంధమును బాగుగ గుర్తెరింగిన వాడు. అందుచేతనే పారిజాతాప హరణమునందు సత్యా కృష్ణుల సంవాదము నంత స్వాభావికముగ వర్ణింపగలిగినాడు. సత్యచే భర్తను తన్నించినను చక్కగా తన్నించినాడు.

తిమ్మన శైలియందొక యద్భుత మేమన కొన్ని చోట్ల సర్వ సాధారణముగ నుపయోగించు మాటలనే యుపయోగించియు, వాటిపొందిక చే నెంతయో మాధుర్యమును, సంగీతమును కురిపించును. పారిజాతాపహరణ ప్రథమాశ్వాసములో „ఈ నయ గారవుం బ్రియములు” అను పద్యము మొదలుకొని „తనను కోడండ్రలోన బెద్దయుగ నన్ను” అను పద్యమువరకు చదివి చూచిన మా యభిప్రాయము తేటపడును. ఈ యాశ్వాసమును ఎట్టి భావోద్రేకమున వ్రాసెనా యాతడని యూహింప మొదలుపెట్టిన నాశ్చర్యము తోచును.

ఇతనికి ఉపమాలంకారము నందధిక ప్రీతి యని తోచును. ఆ యుపమలును ఎంతయో చక్కనివి, స్వాభావికములు. 'కేతన పటాంచలమైన తాల్మి' 'బండి కండ్ల పగిదిగ భ్రమియించు మనంబు' ఇత్యాదు లెన్నని కలవు. ఇట్టి యుత్కృష్ట ప్రబంధ మయ్యు మన యితర ప్రబంధముల వలెనే, పారిజాతాప హరణముకూడ, ప్రథమాశ్వాసము దాటిన మీదట క్రమముగ చప్పబడును. దీనికి కారణము వెదుక దూరము పోనక్కర లేదు. మానవజీవితముతో సంబంధము (Human interest) లేకపోవుటయే దీనికి కారణము. కేవల సూర్యోదయ, సూర్యాస్తమానాది వర్ణనలు ఎంతవరకు ఉత్సాహమును పట్టియుంచగలవు! సత్యాకృష్ణుల సంవాదమును, అరగంటలో ఉరుకుచు చదివి, మిగిలిన నాల్గు ఆశ్వాసములను ఆవలింతలతో నాల్గు దినములు చదువుటయే దీనికి ప్రబల నిదర్శనము.

ఇట్లయ్యు ఆంధ్రప్రబంధ కవులను గూర్చి యోచించునపుడు, తిమ్మనార్యుని ఘనతయే తిరిగి తిరిగి మనసునకు వచ్చుచుండును. ద్వ్యర్థి కవులు, త్ర్యర్థి కవులు ఎందరేని యుండవచ్చును గాని, తిమ్మనవంటి ముద్దుకవు లరుదు. ఆంధ్రులుగ జన్మించు భాగ్యము మన కబ్బినందులకు మనభాషా సౌకుమార్యమును భావమార్దవమును రుచిచూడ నిచ్చగింతుమేని తిమ్మనార్యుని చదివి చూడవలయును, పారిజాతాపహరణమును చేత బట్టవలయును. ఒక్కసారి ప్రారంభించిన, జాలును. ఇక ప్రథమాశ్వాసము ముగియు వరకు ఆగ మనినను ఆగము. „పారిజాత కుసుమాగత నూతన దివ్య వాసనలు” మన భాషా జీవితమునకొక క్రొత్త వింతను దెచ్చి తీరును.

„ప్రకాశం”

# అయ్యలరాజు రామభద్రకవి

(ధారాశుద్ధి)

పదునాఱవ శతాబ్దమునందు కృష్ణరాయల యాస్థానమునం దున్న కవులందరు సుప్రసిద్ధులే. అందు రామభద్రుడు ప్రథమగణ్యుడు. కవితాకన్య యీతని యింటి యాడుబిడుచు. తరతరముల నుండి వంశీయులందఱు కవులే. కవి కౌండిన్యసగోత్రుడు. నియోగి బ్రాహ్మణుడు. ఈ కవి యటునట కాలము గడిపి రాయల యంతిమ దశలో విద్యానగరముచేరి తదాజ్ఞానుసారముగ సకల కథాసార సంగ్రహ మను నుత్తమ కావ్యము వ్రాయ

నారంభించెను. రాయలు ఆంధ్ర భారతిని సుఖ సముద్రమున ముంచి మరణించెను. రామభద్రుఁడు మాత్రము కృష్ణరాయల ప్రోత్సాహమున తాను సకల కథాసార సంగ్రహము వ్రాయుచుంటినని వంశ మటులె యుంచి కృతజ్ఞత వెల్లడించెను. ఇందు శ్రీరామపురూరవో నృపాదుల చరిత్రములు గలవు.

రామభద్రుని రెండవ పుస్తకము రామాభ్యుదయము. అత్యుత్తమ కావ్యము. ఇందు రామాయణ కథ యంతయు నిముడ్పఁబడియున్నది. కవిత మృదుమధురము. ధార నిరర్గళము. యమక వృత్త్యను ప్రాసాది చిత్ర నియమములతోఁగూడి వీనులకు విందుఁ గొలుపును. కృష్ణరాయలు మరణింపఁగనే యీ కవి చిరకాలోపార్జిత మగు నండ తొలంగెను. పట్టుమని నాలుగు కాలముల పాటైని రాయల సన్నిధి నివసింపకమున్నె రామభద్రుఁడు నిరాధారుఁడయ్యెను. కవితా కాంతను గుటుంబ భారమును తలపై నిడికొని యనేకాస్థానములు దిరిగి విసిగి వేసారి కడకు జీవితమంతయు శ్రమచేసిన రామాభ్యుదయమును అళియ రామరాజు మేనల్లుఁడగు గొబ్బూరి నరసరాజున కంకితము గావించెను. రాయల కాలమున విద్యానగర సంస్థాన మహావైభవమును అనంతరము తద్రాజ్య పతనమును గనులారఁజూచి మోద ఖేదములకీ కవి బాసట యయ్యెను. రామరాజ భూషణునకు నీ కవికి విరోధ మున్నటులఁ దెలుపు కథలు కొన్ని వాడుకలో నున్నవి, కృష్ణరాయల తరువాత భాషా పోషకుఁడు గానున్న రామరాయల నాశ్రయింపక యతని యల్లుఁడగు గొబ్బూరి నరసరాజు నాశ్రయించుట యీ ప్రవాదమునకును సత్యలేశము లేక పోదని తెలుపుచున్నది.

రామాభ్యుదయము ఎనిమిదాశ్వాసముల ప్రౌఢ ప్రబంధము. దశరథమహారాజు వనవిహారము మొదలు రావణ సంహారానంతరము శ్రీరామ పట్టాభిషేకము వఱకుఁగల కథ యిందిమిడియున్నది. „బాల నీ మోమున వ్రేలకున్నె పద్మముల్ తునిమిన పాతకమ్ము" అనునుడికవికిఁగల జీవకారుణ్యము తెలుపును. దశరథుని మృగయావినోదము రాజపత్నుల వనవిహారము రాముని యరణ్యయానము, సీతాహరణము, రామునిచింత లోనగు భాగములలో రామభద్రుఁడు తన రచనాచాకచక్యము చూపినాఁడు. సీతకై రాముఁడు దుఃఖించు పట్ల రామభద్రుఁడు తాను కవి ననునది మఱచి తాను నిజముగ రాముఁడైనాఁడు. „జనస్థానే శూన్యేవికల కరణైరార్యచరితైః అపిగ్రావారోదత్యపిదలతి వజ్రస్య హృదయం" అనుభవభూతి వ్రాసిన యుత్తర రామచరితములోని నుడి యథావిధిగఁ బ్రబంధ చిత్రమున రామభద్రుండుఁ జక్కఁగఁ జిత్రించినాఁడు. 'కానకగన్న సంతానంబు గావున కానకగన్న సంతానమయ్యె'నను దశరథు ప్రలాపమునందును „అంగనా లలామ కానవాలతాకుడుంగ మాతంగమా! భుజంగమా! పతంగమా!...ఏసిరమా! కరీరమా! అను రాముని విచారోక్తులందును ఆంధ్రసారస్వత సారస్యమునకుఁగల పరమావధి దర్శించెనుట వింతకాదు. నిజమగు నాంధ్ర కవితాస్వరూపము రామభద్రునిసొమ్ము.

చింతలపాటి బుచ్చివేంకటేశ్వర శర్మ,
బి.ఏ.ఎల్.టి.

# మాదయ్యగారి మల్లన కవి

(రసముల్ చిప్పిలు, బళిబళీ)

ఈ కవివతంసము కృష్ణరాయాస్థానమును మల్లికాలత నలంకరించిన యష్టకుసుమములలో నొక్కఁడు. ఆమహా చక్రవర్తి యొక్క పరిపాలనా కాలము, దేశభాష లందు లెస్స' యైన యాంధ్రభాషా వధూటికిఁ బ్రౌఢ యౌవన కాలమని చెప్పఁదగును. వాఁడు మన భాషా మతల్లిని స్వర్ణభూష ణాలంకృతు రాలినిగఁ జేసిన వారలలో మల్లనార్యుఁ డగ్రగణ్యుఁడు గాక పోయినను మిక్కిలి నేర్పరియైన కవియని చెప్పుటకు సందేహము లేశమైనను లేదు. మల్లన. ఏమినామము? పేలవముగా నున్నదని నవనాగరకులు పలుక వచ్చును. కాని పేరులో నే మున్నది? ఈతని కార్యములో దివ్యములు. ఈతని మాటలో తేనే వానలు; ఈతని ప్రతిభయో యనల్పము.

మల్లన రచించిన సత్ప్రబంధము రాజశేఖర చరిత్రము. ఇందలి కథాంశము పురాణాంతర్గతమైనది గాక స్వకపోల కల్పితమై నదిగఁదోఁచు చున్నది. ఈ గ్రంథము నాతఁడు యౌవనారంభ దశయందే రచించెనఁట. ఈతఁ డింకేమేని ప్రబంధముల గూర్చెనేమో తెలియరాదు. యౌవన దశయందే యిట్టి చక్కని గ్రంథమును నిర్మించిన మల్లన కుశాగ్రబుద్ధి యుతుఁడును, ప్రతిభావంతుఁడు నై యుండవలెను.

'పోకకు పుట్టెఁడమ్మినను కల్పమువట్టు' ధాన్యసంపదలుగల యావంతిక పురమును హేమధన్వుఁడను నృపతి పాలించు చుండెను. అమ్మహీజాని సంతానములేక శంకరు నారాధించి తత్ప్రసాదంబున నొక్క సత్పుత్రునిఁ బడసెను. మాతాపితరుల 'కల్లారు బెల్లమైన' యాబాలుఁడే రాజశేఖరుఁడు. యోధాగ్రేసరుఁడై 'వీరలక్ష్మి మదిరాక్షికిఁ వలపు గీల్కొలుపు' నా రాజశేఖరుఁడు తండ్రియాజ్ఞ మేరకు నొక మహాముని తనయను సంరక్షించుటకై వెడలెను. మందర పర్వత సన్నివాసియైన యొక రక్కసుఁడు మునిపుత్రికను దనభార్యకు దాసిగా నుండుటకై యపహరించెను. రాజశేఖరుఁడు పరాక్రమాతిశయమున రాక్షసు నొంచెను గాని, కాళియొక్క ప్రార్థన వలన వానిని ప్రాణములతో విడిపుచ్చెను. అనుగ్రహ విశేషంబున నాదేవి వానికి 'నభీప్సితముల నలయు వేళల సమకూర్చుచుండు'మని, 'అగమస్తోమంబులం జెప్పు రాచిల్కను' ఒసంగెను. రాకుమారుఁడు మఱలి వచ్చుచు జలక్రీడా మహోత్సవము సల్పు నరుగు దెంచిన సింధురాజ కన్యయగు కాంతిమతి యను దానినిఁ గాంచి మోహపరవశుఁ డయ్యెను. కాంతిమతియు నాతనింగని విరహవేదన కుఁగుళి యయ్యెను. అంత నారాచిల్క యొక్క వాఙ్నైపుణ్యమున సింధురాజు తన యేకమాత్ర పుత్రికను వానికొసంగి మహా విభవముతోఁ బెండ్లిచేసెను. ఈ గ్రంథమందు కాంతిమతి పూర్వ జన్మమునకు సంబంధించిన మనోహరమగు నుపకథ యొక్కటి కలదు. వసుచరిత్రాదు లందుకన్న రాజశేఖర చరిత్రమందు కథాంశ మెక్కువ గలదని చెప్పవచ్చును.

రాజశేఖర చరిత్రము తత్పూర్వ ప్రబంధసరణిదేయైనను గొన్ని విశేషము లిద్దాని యందుఁ గలవు. వసుచరిత్ర యందు వసురాజునకు వయస్యుఁడు గిరికాదేవి సర్వాంగ వైభవమును తూచా తప్పకుండ వర్ణించి చెప్పెను. ఇయ్యది యనౌచిత్య మని విమర్శకుల యభిప్రాయము. ఇందట్లు గాక నాయిక యొక్క సౌందర్యాతిశయమును చిలుక వర్ణించుట యెంతయు సమంజసముగ నున్నది.

మఱియు నీగ్రంథమందు శృంగార రసమును వెల్లువలు గట్టించుట కవకాశము మిక్కుటముగ నున్నను, మల్లన కవి యట్లు సేయకుండుట జూడ నాతనికది మిక్కిలి రుచించ నట్లు తోఁచుచున్నది.

ఈ కవికి భావవర్ణనము నందు నేర్పమెండు. అట్టివి తరచు మనోభావములై యాచారసిద్ధము లైనవి గాక యాతని దయారస పూరితమైన హృదయాంతరాళము నుండి వచ్చినవి. పసిబాలిక నిట్లు వర్ణించినాఁడు:

క॥ ఏడవరయేటిదిరియెవ్వరు
వేడుకఁగదలించిరేని వెక్కసనేడ్చున్

క॥ అత్త దయామతిఁ దనకడ
నత్తమిలక నిద్రవోవ దహరహముంచున్

దరిద్రుని దుస్థితి నిట్లు చిత్రించినాఁడు:

గీ॥ పలుచగాఁ జాచు నెంతయు బంధుసమితి
పిలువఁ బిలువంగఁ బలుకరు బిడ్డలైన
రచ్చకెక్కుడుమాటగా రాబుసలియు
లెక్కసేయదు లేమి తూలించునేని.

వీని యందలి దైన్యవర్ణనము హృదయము గరగించును.

మల్లన యొక్క కవిత 'రసముల్చిప్పిలుచు నప్పప్ప! బళి బళీ! యనునట్లుండును. లేట తెలుఁగు పదంబులతో నతి మనోహరముగ విషయమును దెలుపు శక్తి యాతనిసొమ్ము.

క॥ ఏరికిబుద్ధిబలంబులు
కారణములుగావుసుఖ్యేకలరెధరిత్రిన్
నేరిచిబ్రతికిన వారలు
నేరకచెడ్డట్టివారు నీరజనేత్రా॥

ఖండవల్లి-లక్ష్మీరంజనము.

# తెనాలి రామకృష్ణకవి

(పద గుంభనము)

ఆంధ్ర కవులలో నితఁడు సుప్రసిద్ధుఁడు. కౌండిన్యస గోత్రుఁడు, రామయ మంత్రి కుమారుఁడు. ఇందుమతీ పరిణయాది గ్రంథకర్తయగు తెనాలి యన్నయ్య కవికి అగ్రజుఁడని తెలియును. రామకృష్ణుని గ్రంథములలో పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచలమాహాత్మ్యము మాత్రము లభించినవి. ఉద్భటారాధ్య చరిత్రము తెనాలి రామలింగ కవి కృతము లభించినది. వంశావతారాదికముచేఁ దొలుత శైవమతాభిమానిగా నుండి రామలింగ నామమున ఉద్భటారాధ్య చరిత్రమును వ్రాసి వైష్ణవ మతము స్వీకరించి రామకృష్ణ నామధేయము ధరించి ఘటికాచలమాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము రచించెనని విశ్వసింపఁదగు నాధారములు గలవు. రామకృష్ణ కవి గ్రంథములలో, కందర్పకేతు విలాసము ఇంత వఱకును లభింప కున్నవి.

రామకృష్ణ కవి శ్రీకృష్ణ దేవరాయల కాలము వాఁడు కాఁడని ఆంధ్రకవుల చరిత్రము వలనఁ గలదు. రామకృష్ణకవి క్రీ. శ. ౧౫౧౦-౧౫౬౦ ప్రాంతమున పాండురంగమాహాత్మ్యము రచించి శ్రీకృష్ణదేవరాయల సమకాలికుఁడని నిర్ణయింపఁ జాలినన్ని యాధారములు గలవు. అష్టదిగ్గజములలో రామకృష్ణ కవి యొకఁడనుటకు సంశయింపఁ బనిలేదు.

రామకృష్ణకవి కవితానైపుణ్యమున నసమానుఁడు. కూర్పుబింకము నందును మనోభావముల వర్ణించుటయందును రచనా కౌశలమునందును నితఁ డప్రతిమానుఁడు. పెద్దనార్యుఁడు కనక నగసీమ పచ్చరాచట్టుపై నచ్చరచేడాలు గరగించునటుల వీణవాయింపఁ జేసి సామాన్య బ్రాహ్మణుని మోహితునిఁ జేయింపలేక పోయెను. రామరాజభూషణుఁడు వర్ణించినది పవిత్రమగు గృహస్థ ధర్మమునకు సంబంధించిన పరిణయమగు కథ. రామకృష్ణుఁ డట్లుగాక పోతన గ్రంథములవలె దగు నుత్తమ భక్తిరసగ్రంథముల వ్రాసెను. కాని యందును దన నేర్పుఁ జూపుటలోఁ బ్రౌఢిమాల లేదు. పాండురంగ మాహాత్మ్యము నందు నిగమ శర్మోపాఖ్యానము సుశీల చరిత్రము రసవత్తరము లగు ఘట్టములు. పూర్వకవులెవరు త్రొక్కని త్రోవలో నీ రెండు చోటుల రామకృష్ణుఁడు తన స్వతంత్ర రచనా కౌశలము వెల్లడించెను. ఇతని కథారంగములు మంచములలోని సెలయేటి యిసుక తిన్నెలు గావు. కొంపసెత్తమ్ములక్రిఁ జాయనున్న పొదరిండ్లుగావు. ఆర్యధర్మోచితము లగు బ్రాహ్మణగృహములు. దురాచార పరవశుఁడగు నిగమశర్మనొక యొడఁ బాత్రముగఁ దీసికొని యద్భుత కల్పనా సామగ్రితో నాతని యక్కచేఁ జెప్పించిన నీతులు. సుశీలను బోషింపుచుఁ దద్భర్తయగు కుటిలబ్రాహ్మణునిఁ గూర్చి వర్ణించిన వర్ణనలు కవికిఁగల సారస్వత స్వాతంత్ర్యమునకుఁ దార్కాణములుగ నున్నవి. రామకృష్ణుఁడు హాస్య కథా కౌశలుఁ డనఁ దగిన తావు లాతని గ్రంథము లన్నింటను గలవు. ఉద్భటారాధ్య చరితమునందలి రెండవయాశ్వాసమునఁగల మదాలసుని కథయు నీకవికిఁగల రచనా కౌశలమునకు నాదర్శ ప్రాయములై మనోహరతరములుగా నున్నవి.

రామకృష్ణుని కవితలో ననుకరణము మందునకేని గానరాదు. భావములు స్వతంత్రములు. ధార నిరర్గళము. భక్తిరసముట్టి పడునటుల శ్రీవిష్ణు క్షేత్రమాహాత్మ్యము లెన్ని వాకొనినను శృంగారరస ఘట్టము వచ్చెనేని, ఉచితమగు కథాంశము లభించెనేని యీ మహాకవి తన నేరుపు కూరుపు జూపుటలో నద్వితీయుఁడు. ఇమ్మహాకవి యొకఁడె తెలుఁగున స్వతంత్ర భావకవితా కౌశలుఁడు. కథా కల్పనముగల గ్రంథరచనమునకై యితఁడు పూనుకొనెనేని వాఙ్మయమును సర్వాంకషముగ నలంకరించినవాఁడె! కృష్ణదేవరాయలకీ కవి యంకిత మీయమికిఁ గారణము తెలియ రాదు.

శేషాద్రి రమణ కవులు



# ధూర్జటి కవి

## (అతులిత మాధురీమహిమ)

ప్రధానా ముత్తమమ్ ప్రత్యేక్ష్మను రీతిగాఁ గృష్ణరాయల యష్టదిగ్గజములలో నెవ్వాని ప్రశంస వచ్చిన వానినే యుత్తమునిగా నెన్నవలయును. వీరిలో నొకరిని మఱియొకరితోఁ బోల్చుట సరిగాదు. ఒకరి కొకరు తీసిపోవువారు కారు. ఈ సూత్రము ననుసరించి కృష్ణరాయ సభాలంకారుఁడగు ధూర్జటి మహా కవినిఁ బూజ్య భావముతో స్మరించి, ప్రశంసింపుచున్నాము. అది మా విధికృత్యము.

ఈ కవి చంద్రుఁడు దివిషదన్న ప్రాయవాగ్గుంఫ సంపత్కావ్య ప్రతిభుఁడు; శైవసంవిత్కాసారమరాళ రత్నము; శ్రీ కృష్ణ దేవరాయ పండిత సార్వభౌమునిచే, స్తుతమతియైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో యతులిత మాధురీ మహిమ యని యుగ్గడింపఁబడినవాఁడు. ఇంతయేల, కవి ధూర్జటి కలధౌత శైలేశ్వరుండగు నా ధూర్జటియే.

ధూర్జటి కవి తల్లజుఁడు రచించినది శ్రీ కాళహస్తి మాహాత్మ్య మను దివ్య ప్రబంధము. ఇమ్మహాకావ్యము చతురాశ్వాస సంకలితమై పంచ పంచాశదధిక సప్తశత (౭౫౫) పద్య గద్య పరిమితమై, లక్షణాలంకార పదబద్ధ రససమంచితమై తనరారుచున్నది. ఇందు దేవమానవుల జీవితములు మనోహరముగను, నీతి బోధకరముగను వర్ణింపఁ బడినవి. ఇందు భక్తి రసామృతమును గ్రోలవచ్చును; శృంగార రసస్రవంతి యందోల లాడవచ్చును. ఏక క్రియా ద్వ్యర్థకరీ.

కవి పుంగవుం డీకావ్య పాఠకులకు ఆరామము లందును, గిరి శైలములందును, స్వర్ణదీతీరోపాంత నికుంజ పుంజములందును విహార సౌఖ్యము గలిగించినాఁడు; పంచమ ధ్వనుల తానము లీను పికాంగనా గతి, వేల్పుల భ్రమియించుఁ జిగురుబోఁడి విలాపము వినిపించినాఁడు. భక్త జనముల ముంగిటి పారిజాతమగు ధూర్జటి యద్భుత కరుణా ప్రదర్శనము గావించి యానందము గొల్పినాఁడు. ఇట్టి విలాసము లెవ్వ రిచ్ఛగించరు?

పాఠకులారా! బ్రహ్మ దేవుని శృంగార వ్యాపార వర్ణనా ఘట్టముం జదివి నీతిని గ్రహింపుఁడు; తిన్నని పవిత్ర కథా వర్ణనా సందర్భమును బఠించి భక్తి ప్రపన్నులు గండు; నక్కీరునితో దివ్యక్షేత్ర సందర్శనము గావించుకొని పుణ్యముం గట్టు కొనుఁడు.

నిరాడంబరమై, ఆనంద నిలయ మగు జీవనమును జూచి హర్షించఁ గోరెదరా చెంచు గుబ్బెతల వర్ణనలం జదువుఁడు; వారవిలాసినుల యూహాపోహాలం దెలిసికొని, యబ్బురపడఁగోరెదరా, మాణిక్యవల్లి చరిత్రను బఠించుఁడు. ధూర్జటి కవితా చమత్కృతినిఁ గనుఁడు.

ఇక్కావ్యమునం దాధూర్జటి భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతాపహారి సతత మధురాధరోదిత సుధారసధారలు గ్రోలినాఁడు; శబరుఁ డొసంగిన పలల ఖండముల భక్షించినాఁడు; సాహిత్యస్ఫురన్మాధురీ చారు ప్రౌఢిమ నొప్పారెఁడు తన కవిత్వము నందుఁ దప్పుబట్టిన వాని శపించినాఁడు. వీని యర్థమేమి?

ఈ కావ్యమునందీ మహా కవి స్త్రీలకుఁ బాదుకలు (పాదరక్షలు) తొడిగించినాఁడు; వర్ణభేదము పాటించఁ గూడదని చాటించినాఁడు; కామాంధుఁడు పుణ్య పాపములు తలఁపక కార్యము లెల్లం బో మొత్తునని ప్రకటించినాఁడు; దుష్టులయిన కుమారులఁ జంపించినాఁడు. ఎక్కడఁజూచినను దన భావ ప్రతిబింబములనే ముద్రించినాఁడు. ఆహా!

శ్రీ కాళహస్తి మాహాత్మ్యమనఁగా నేమి? కట్టు గొయ్యకుఁజేరిన కామధేనువు; కానవచ్చిన పెన్నిధానము; కరతలమున నున్న సురమణి; ప్రోలనిల్చిన కల్పసాలము; ప్రాప్తమయిన సిద్ధరసము. ఇంకేది కావలయును మీకు? ధూర్జటి కృతి శరణు చొమ్ముఁడు.



అల్లసాని పెద్దన కవి



ముక్కు తిమ్మన కవి



అయ్యలరాజు రామభద్ర కవి



మాదయ్యగారి మల్లన్న కవి



తెనాలి రామకృష్ణ కవి



ధూర్జటి కవి



రామరాజ భూషణ కవి



పింగళి సూరన్న కవి

ధూర్జటి కవి ప్రసాదమున మీ సంసారమోహపాశము తెగును; మీ పాప కదంబ జంబాల ముడుగును. మీకు సర్వేశు భక్తిలక్షణము తెలియును; మీకు అంతరంగమలాపహారమైన చిత్సుధారసము లభించును; మీకు విశ్వపతి తత్వమును మణికొరకును. ఏల యాలసించెదరు?

ఇ కావ్యము నందు ఎక్కడఁబట్టినను గళితే; ఎక్కడ నోరు సోఁకినను జక్కెరలే; ఏ మనినను సారసుధారసమే; అంతటను జక్కఁదనమే.

ఇట్టి కావ్య రత్న నిర్మాత యగు కవీంద్రుని ఇట్టి కవీంద్రునిఁ బోషించిన నృపేంద్రుని యశోగానము సేయుఁడు.

ధూర్జటి మీకుఁ బ్రసన్నుఁడగుఁగాక!

"ధూర్జటి కుమార్"

# రామరాజభూషణ కవి

(సాహిత్యరసపోషణము)

పదునాఱవ శతాబ్దములో (క్రీ. శ.) నాంధ్ర దేశమున మహాకీర్తివంతుఁడైన కవిశిఖామణి రామరాజభూషణుఁడు. ప్రబంధాంక వంశములోఁ బుట్టి, యనన్య సామాన్య ప్రతిభా వికాసితుఁడై, "సంగీత సాహిత్య నామక విద్యాయుగళంబు పల్కుఁ జెలికి బాలిండ్ల జోడై సిరుల్ ప్రకటింపఁ నఖరేఖలందు నలఘు ప్రస్తారము ల్సేయు సర్వ కళా కాంతుఁడై" వెలసిన మహానుభావుఁడు. ఇతఁడు బట్రాజుల కులములోని వాఁడు; ఇతని పేరు బట్టుమూర్తి; కాని కొంత కాలము రామరాజాస్థానము నలంకరించి పేర్వొందిన వాఁడగుటచే రామరాజభూషణ బిరుదముఁ బొంది యాపేరు చేతనే ప్రసిద్ధుఁడై యున్నాఁడు. శ్రీకృష్ణ దేవరాయల యాస్థానములోఁ గీర్తిఁ గాంచిన 'దిగ్గజము'. (ఈ విషయమై యభిప్రాయ భేదములున్నవి). ఇతఁడల్లసాని పెద్దనకు శిష్యుఁడై "కవితాపితామహుని" వద్దనుండి కవితావేశమును స్వీకరించెను.

అల్లసాని పెద్దన నూతన కవితారీతి నిర్మించెను. సైజ విలాసములతో, స్వాభావిక శృంగారములతోఁ బ్రకృతి జనిత మోహనకుసుమములతో హిమాలయ సానువులపై నాక వెల్పుసానినిఁ దెచ్చిపెట్టెను. ఆమె కట్టినది యొప్పుంచు చీర; రైకలేదు; అలంకారములు సున్న—చేర్పుక్కగా నిద్దచిన్ని జాబిల్లి అవతంస కుసుమము తప్ప; వీణియ మీటుచుఁ బాడిన పాటలు శిరీషకుసుమ పేశల సుధామయోక్తులు. పాప మామె యెంతో ముద్దుగాఁ గూర్చుండఁ బెట్టి ప్రగాఢ విప్రుని నామె ముంగటఁ జేర్చెను. వెనుక ముందు నాలోచింపకఁ గామాతురయై యాతని మీఁద వ్రాలఁ బడెను. 'హరిహరీ' యని యామెను ద్రోసి, యతఁడు పోయెను! రసాభాస మాయెను. 'అయ్యో! అయ్యో!' అని అల్లసాని పెద్దన అదరిపడినాఁడు. ఏమిచేయఁ గలఁడు? విధవావివాహ ప్రహసనములోవలె దారిఁ బోవుచున్న గంధర్వునికిఁ బ్రవర వేషము వేసి యామెట్టున కేదో స్త్రీహత్యాదోషము తప్పించుకొన్నాఁడు.

ఇయ్యదిరి పాటుఁ జూచి నాఁ డతని శిష్యుఁడు. సైజ విలాసములు పల్లెటూరి కాపునికే మెప్పు పుట్టింపనివో వసురాజునకుఁ బుట్టించునా? కనుక, బహుజాగ్రతతో గిరికా సుకుమారికి నలంకారములు చేసినాఁడు. 'సానలఁ దీర్చిన జాతి రత్నములతో' నాభరణములఁ గూర్చినాఁడు. ప్రకృతి వైభవములతో నాగరకతా వైభవములు మేళవించినాఁడు. ప్రావు బోదరిండ్లకు మాఱు "మాణిక్యాయతనం బొనర్చినాఁడు, 'అంచాటను చొక్కపుజనుగవకు మాఱు 'శ్లేషద్యోతిత పృథుల కుచముల' జూపినాఁడు. ఇంతయు భేదము మను చరిత్రకును వసుచరిత్రకును.

ప్రపంచములోని ప్రాచ్య పాశ్చాత్య భాషలలోనికెల్ల నత్యంత చమత్కారవంతమైనది 'ఆంధ్రభాష' యని చాటించు నఖండ కావ్య మీ వసుచరిత్రము. సంస్కృతములోనికి భాషాంతరీకరింపఁ బడుటయు, సంస్కృతములో వ్యాఖ్య వ్రాయఁ బడుటయు, ఇట్టి గౌరవ మీ కావ్యమునకుఁ దప్ప మఱియే తెనుఁగు కబ్బమునకు లేదు! ఈమహాకవి హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థి కావ్యము నతి చమత్కారముగ వ్రాసినాఁడు. ఇందులోని చతుర్థాశ్వాసము రత్ననిర్మితమైన హిమాలయ పర్వతము. ఇతఁడు నరసభూపాలీయమను నలంకార గ్రంథమును గూడ రచించెను.

ఇతఁడు సృజించిన కవితాకన్యను వర్ణింప నితని పద్యమే చాలును:—

"పదమెత్తన్ గలహంసలీల; యధర స్పందంబు సేయన్
శుభాస్పదమౌ రాగకదంబకంబు; శ్రుతిభూషన్
శ్రీవిలాసంబు; కేల్గదలింపన్ సుకుమార పల్లవనవై
లాలక్ష్మి; వీక్షింపసంపదయుంబోలుఁ దరంబె
కన్నెఁ గొనియాడన్ గేయ ప్రాశస్త్యధీమహిన్"

సి. జయరావు, బి. యస్. సి.

# పింగళి సూరన కవి

(ఉదంచద్వైఖరి)

మన పూర్వకవులను మూఁడు తెగలుగా విభజింప వచ్చును. సంస్కృతములోనుండి భాషాంతరము చేసిన వారు మొదటి తెగకుఁ జెందిన వారు; నన్నయ తిక్కనాదులు. పూర్వ గ్రంథములలోని కథను గైకొని, దానిని బెంచి, స్వకపోల కల్పితములగు ప్రబంధముల నల్లినవారు రెండవ తెగకుఁ జెందిన వారు; పెద్దన రామరాజభూషణాదులు. సంస్కృతమునుండి భాషాంతరము గాక, పురాణ గ్రంథములలోని కథ గాక, క్రొత్త కథను అపూర్వఫణితిని కల్పించి స్వతంత్రరచన గావించిన వారు మూఁడవ తెగకుఁ జెందినవారు. ఈ మూఁడవ తెగకుఁ జెందిన వారిలో పింగళి సూరన యొకఁడే కనఁ బడుచున్నాఁడు. కాళిదాసునివలె నితఁడొక్కఁడే చిటికిన వ్రేలిపై లెక్కఁ బెట్టఁదగినవాఁడు. ఆంధ్రసారస్వతము నందట్టి ప్రతిభ గలవాఁడు మఱొక్కఁడు లేనందున అనామిక అనామికయే యైనది.

పింగళి సూరనార్యుఁడు శ్రీకృష్ణదేవరాయ సభా దిగ్గజమని యందురు. కాని బహుళాంధ్రోక్తిమయ ప్రపంచగౌరవపాత్రుఁ డగు నొక దిగ్గజ మనుట ఎంతయు సమంజసము.

సూరనార్యుఁడు పెద్దనార్యుని మనుమఁడు. తన కవితా ప్రాగల్భ్యము చేతఁ దాతకు దగ్గులు నేర్పినవాఁడు. ఈకవికులోత్తంసుఁడు విరచించినవానిలో మనకుఁ బ్రాప్త భాగ్యము లభించినవి మూఁడే గ్రంథములు. రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము అను నీ మూఁడు గ్రంథములు స్వకీయ విమలతేజః పుంజములచే ఆంధ్రకవితా కళా విమల దృష్టి మిరుమిట్లు గొలిపిన మూఁడు రత్నములు.

మూఁడు గ్రంథములయందును కవి క్రొత్త త్రోవలు త్రొక్కినాఁడు. ఈతని కల్పనా శక్తిని, వర్ణనా చమత్కారమును ఇంతవఱకెవ్వరును అనుకరించలేదు; అనుకరింపను జాలరు. ఇయ్యవి సకల లక్షణ లక్షితములు; అపూర్వ కథాసంవిధాన వైచిత్రీ మహానిలయములు; పుణ్యవస్తు వర్ణనాకర్షణములు; శృంగారరస ప్రవాహములు.

సూరకవి ముత్తెపు సరులు పోహళించిన లీల శబ్దములఁ గూర్చినాఁడు; రసభావములకు సర్వాంగముగ వైదర్భి మొదలగు రీతుల నమర్చినాఁడు; ఉపమాదులు, యమకాదులు నగు నర్థ శబ్దాలంకృతులు ఘటించినాఁడు; పదమైత్రి యర్థసంపదఁ బాదుకొల్పినాఁడు, మానవ ప్రకృతిని అద్దములోవలెఁ జూపినాఁడు; శబ్దసంస్కారము జాతీయ

లేదు; పునరుక్తి పొంతకుఁబోలేదు. ఇట్టి యనుపమాన శక్తి సూరన కవి కలవడుట బహుతపఃఫలము గాదా?

రాఘవ పాండవీయము రామాయణ భారతార్థములందెలుపు ద్వ్యర్థి కావ్యము. సులువైన తెలుఁగు పదములతో రెండర్థములు వచ్చునటుల నేర్పుతో ప్రబంధ మల్లినాఁడు. ఇట్టి ద్వ్యర్థి కావ్యము లాంధ్రమునందు రచించుటకు సూరనయే మొదటి మార్గదర్శకుఁడు. సంస్కృతాంధ్ర భాషా సాహిత్యములపై నితనికిఁగల నిరంకుశ ప్రతిభను ఈ గ్రంథము వేయినోళ్లఁ జాటుచున్నది. రెండర్థముల పద్యము రచించుటయే గొప్పశక్తియైన, మూఁడు అంతరార్థములు గల కథ నల్లుట యెంతటి మేధా విశేషమో యూహించునది. ఇట్టి శక్తి ప్రదర్శనమునకుఁ దార్కాణమైనదే కళాపూర్ణోదయము.

కళాపూర్ణోదయ మొక యద్వితీయ గ్రంథము. ఇందు సూరనార్యుని ప్రతిభ, భావనాశక్తి, సందర్భశుద్ధి, పాత్రోచిత పద్యరచన, సుప్రసిద్ధముగఁ బ్రకటితమగుచున్నవి. ఇది యపూర్వ కథా సందర్భము కలిగి పాఠకుల తన్మయులంజేయు పద్యమయమగు నొక 'నవల'. ఇది కవి యొక్క స్వసృష్టి. ఇందు కవితా శిల్పము నేర్పు మెయిం జిత్రింపఁబడినది. ఈ విచిత్ర కథా సంవిధానము నందు ప్రబోధ చంద్రోదయమునందువలె, "పిల్గ్రిమ్సు ప్రోగ్రెసు" (Pilgrims Progress) నందువలె ఒకే యంతరార్థ కథ గాక, మూఁడంతరార్థ కథలు—శృంగార రసాత్మకముగను, అధ్యాత్మికముగను, చరిత్రాత్మకముగను—కవి యుద్దేశించినట్లు గోచరమగుచున్నది. చారిత్రికాంతరార్థ కథగ రాయల చరిత్రయిందు వర్ణితమైనట్లు ఊహింపఁబడుచున్నది. మన ప్రస్తుతావసరములకు సంబంధించిన దగుటచేఁ జరిత్ర పరమగు నంతరార్థ కథ నిచ్చట వివరించెదము.

కాసార పురమును (పంపా (సరస్సు) పురము=హంపి=విజయనగరమును) ఏలుచుండిన రాజు (వీర నరసింహరాయలు) చనిపోఁగా, రాజ్య మరాజకమైనది. అప్పుడు సర్వజ్ఞుడు (తిమ్మరుసు) ప్రజల కోరికపై రాజ్య భారము వహించెను. సర్వజ్ఞుడు (తిమ్మరుసు) కళాపూర్ణుని (కృష్ణరాయల) ధైర్య సాహసము మెచ్చి, యాతనిని రాజుగాఁజేసి తాను మంత్రియయ్యెను. కళాపూర్ణుడు (కృష్ణరాయలు) క్రమముగ కంఠోత్తర పురము (కంఠము యొక్క ఉత్తరమందు పురము గలది=నాగళాపురము) గట్టించెను. కళాపూర్ణునకు (కృష్ణరాయలకు) ఇద్దరు భార్యలు. తుష్ట్యర్థకరణ జాప్యనగో త్తమాంగ (చంద్రగిరి దగ్గరి పు) పొంగు, మహిషా సుర పుర (మైసూరు) రాజు కుమారిత అభినవ కౌముది (తిరుమల దేవి), మొదటి భార్య; యుద్ధమునందోడించిన హైహయ (గజపతి) రాజు కుమారిత మధురలాలస (అన్నపూర్ణాదేవి) రెండవ భార్య. కళాపూర్ణుడు (కృష్ణరాయలు) జన్మతః క్షత్రియుఁడు గాఁడు; కాలాంతరమున నాతని వంశము క్షత్రియ వంశమయ్యెను.

ఒకటి గాదు, రెండు కాదు, మూఁడంతరార్థ కథలు మూలకథలో నిమిడ్చి ప్రపంచ వాఙ్మయమునందెచ్చటను సాటిలేని విధమున, రచింపఁగలిగిన మహాకవి మనయాంధ్రుఁడగుట ఆంధ్రుల భాగ్యమే భాగ్యము.

ఇంక ప్రభావతీ ప్రద్యుమ్నము నాటక లక్షణములన్నియుం గలిగిన, మనోహర కథా వర్ణనమగు శ్రవ్య ప్రబంధము. ఆ కాలమునందు నాటక రచనా యభిలాషము లేక యుండెను గాని, ఉన్న యెడల అదర్శనీయమగు నాటకమును ఈ కవి వ్రాసియుండును. కథా ప్రారంభమునందే ద్వారకా పురవర్ణనమును, నాటక రంగమునందలి నటులవలె ఆకాశ మార్గమునందుఁబోవు ఇంద్రుని వైతాళికులు మనకు వినిపించినట్లు చేసినాఁడు. ఒక్కసారి గబగబ అనేక పాత్రలను రంగము మీఁదికి తీసికొనివచ్చి, కథను అత్యద్భుతముగ నడిపించును. కథ యంతయుఁ దనంతట నదియే మొగ్గ విరిసినటుల ప్రఫుల్లమై గుమగుమ తావుల నీనుచుండును. అన్నియుఁ గ్రొత్త యుక్తులే ప్రభావతీ ప్రద్యుమ్న కథ పూర్వ గ్రంథములందెచ్చటను గానరాదు. అయినను ఉషానిరుద్ధుల కథ కవి మనస్సులో నుండెనా యని యూహించుట కవకాశము గలదు. కథా గమనిక, పాత్ర సంపోషణము, రచనా చమత్కృతి పాఠకుల నాశ్చర్య వారిధిని ముంచి వేయును.

సూరనార్యుఁడు రచించిన మూఁడు గ్రంథములను గూర్చి సంగ్రహముగా వివరించి యున్నాము. ఇంతటి

కాఁడు నభూతో నభవిష్యతి". ఈ సూర్యనారాయణ మూర్తి యొక్కఁడే సార్వకాలము ఆంధ్రులకే గాక, ఆంధ్రేతరులకును కవిత్వ తత్వ మాహాత్మ్యమును బ్రకాశింపఁజేయు దివ్యమూర్తి.

ఆతని రచనలు, భావములు, వర్ణనలు, సంభాషణ వైచిత్ర్యములు, బాగుగ గమనించిన యెడలఁ బాశ్చాత్త్యాచార విధానముల గమనించి నట్టియు, ఆంగ్ల వాఙ్మయ మహోదధిని దరించినట్టియు, ఇరువదవ శతాబ్దపుఁ గవియాయని సూరన్నను గూర్చి మనము ఆశ్చర్యపడవలసి వచ్చును. పాశ్చాత్త్య కవుల రచనలందును, సూరన కవిత యందును భావసాదృశ్యములు గనంబడుట మహనీయమైన విషయము గదా! ఇట్టి యసదృశ ప్రతిభా శేముషీ మంతుఁడగు పింగలి సూరనామాత్యునకు నమస్కరించు చున్నాము.

ఆంధ్రులు శ్రీ రామకృష్ణుల కియెడ సకల కళా పరిపూర్ణులై ప్రతిభా భాసమాను లగుదురు గాక!

"పింగలివారి యల్లుఁడు"



సీ. అల్లికఁ బేర్కొన్న అలసాని పెద్దన్న, ముద్దుపల్కుల మిన్న ముక్కుతిమ్మన
శ్రీరామభద్రుఁడాశ్రితరామభద్రుండు, మల్లనకవిజన తల్లజుండు
మధురవాగ్ఝరి మేటి మాన్యుండు ధూర్జటి, లీలభారవి రామలింగసుకవి
కల్పనాచాతురీగన్న సూరనసూరి, పటుశ్లేషవిస్ఫూరి భట్టుమూర్తి

గీ. వీరలెనమండుగురు మహో-దారమతులు,
కృష్ణదేవమహారాయ-కీర్తినిలయ
సద్గుణస్తోమశోభితా-స్థానకవులు,
దివ్యసామ్రాజ్యపూజ్యాష్ట-దిగ్గజములు.

ఆదిపూడి సోమనాథరావు.



# శ్రీకృష్ణదేవరాయుల విజయయాత్ర

శ్రీ శేషాద్రిరమణ కవులు.

ఈ క్రింద నుదహరింపఁబోవు శాసనము తిరువణ్ణామలై దేవాలయము లోపలి ప్రాకారమునందు ఉత్తరపువైపున శిలపై వ్రాయఁబడినది. ఇంతవఱకు శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్జైత్రయాత్రా సందర్భమున నిజాంరాష్ట్రమందలి సుప్రసిద్ధ దుర్గరాజము లగు అరువపల్లి, జల్లిపల్లి, కందుకూరు(?)కొండ, కప్పలుకొండ, నల్లగొండ, కంభముమెట్టు, కనకగిరి, శంకరగిరి లోనగుదుర్గములు రాయలవారు లోఁబఱచుకొన్న యంశము మనకుస్పష్టముగాఁ దెలియదు. ఈవిషయము నీ శాసనము విశదము చేయు చున్నది. పైని పేర్కొనఁబడిన దుర్గము లన్నియు నుసమెత్తింగినవె. కనకగిరి యనునది నెల్లూరిమండలము లోని దని కొందరు చెప్పుచున్నారు. అది సరిగాదు. కనకగిరి దుర్గము, మధిర తాలూకాలోని కల్లూరునకు సమీపమందున్నది. ఇచ్చట మిగుల దృఢమైన గొప్పదుర్గము గలదు. దీనిని సర్వజ్ఞసింగ భూపాలుని దుర్గ మని వ్యవహరింతురు. రాయలపాదధూళిచే నిజాము రాష్ట్రముసందలి యాంధ్ర దేశము పావన మయ్యెనని తెలుపుటకా శాసన భాగము నిట నుదహరించు చున్నారము.

"శ్రీ శుభమస్తు, స్వస్తి! శ్రీ మన్మహారాజాధి రాజ రాజ పరమేశ్వర, మూరురాయరగండ, అరిరాయవిభాల అష్టదిక్కురాయ మనోభయంకర, బాషిగె తప్పువరాయగండ, పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, యవన రాజ్యస్థాపనాచార్య, గజపతివిభాల, శ్రీ వీర ప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలు విజయనగరాన నుండి పూర్వ దిగ్విజయ యాత్రకు వచ్చి ఉదయగిరి దుర్గము సాధించి రావుతురాయ మహాపాత్రునిం బట్టుకొని అద్దంకి, వినికొండ, బెల్లముకొండ నాగార్జునకొండ, తంగెడ, కేతవరము, ఇవి మొదలైన దుర్గాలు స్థలదుర్గాలు ఏకదాడిని గైకొని కొండవీటిదుర్గం కొండవీటికి లగ్గలు పట్టించి ఆ దుర్గంపుచ్చుకొని ప్రతాపరుద్రరాయల కుమారుండు వీరభద్ర రాయుండు, కుమారహంవీర పాత్రునికొడుకు, నరహరిదేవు, రాయచూరి మల్లూఖానుండు, ఉద్దండఖానుండు జన్యాల కసవా పాత్రుండు, పూసపాటి రాచిరాజు శ్రీనాథరాజ లక్ష్మీపతి రాజు పశ్చిమ బాల చంద్ర మహాపాత్రుండు, వీరు మొదలైన పాత్ర సామంతులను మన్నెవారి నిన్ని జీవగ్రాహంగా పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి ధరణి కోట అమరేశ్వరునకు తులా పురుష మహా దానమున్ను చేయ నవధరించి......విజయనగరానకు వచ్చి సామ్రాజ్యము చేస్తున్ను మరిన్ని కళింగాదిక దిగ్విజయార్థము బెజవాడకు విచ్చేసి కొండపల్లి దుర్గమును సాధించి ఆ దుర్గము మీద నున్న ప్రహరేశ్వర మహాపాత్రుండు బోడజన మహాపాత్రుండు బిజిలిఖానుండు వీరిని మొదలయిన వారిని జీవగ్రాహం గాను పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి, అనంతగిరి, ఉంద్రగొండ, ఉర్లుగొండ, అరువపల్లి, కందికొండ, కప్పలుకొండ? నల్లగొండ; కంభంమెట్టు, కనకగిరి, శంకరగిరి, ఇవి మొదలైన తెలుంగాణ్యపు దుర్గాలు ఒక దాడిని గైకొని సింహాద్రి పొట్నూరుకు విచ్చేసి అక్కడను జయస్తంభము వేసి మహా దానము చేయ నవధరించి తిరిగి రాజమహేంద్రవరమునకు విచ్చేసి తమ దేవుల చిన్నాదేవమ్మ తిరుమల దేవమ్మ గారిచే తనుసేయించ నవధరించి విజయనగరానకు విచ్చేసి స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౪౩౯ వ అగు నేటి ధాత సంవత్సర పుష్య బహుళ ౧౩ సోమవారము నాడు తిరువణ్ణామలకు విచ్చేసి, అణ్ణామల దేవునిన్ని ఉణ్ణామలై నాంచారమ్మనున్ను దర్శించి దేవునికి మాణిక్యాల పతకం బంగారం దండె

బాహుపురి ఉత్తరిగె ప్రభావళి ఇంద్ర విమానం వెండిగిండి అభిషేకానకు వెండి బిందె ఇంత వట్టుకు సమర్పించి దేవుని తిరుకాళ్లకు వెండి పూయించి దేవుని తిరుపణి పదకొండు నిలువుల గోపురం వేయికంబాలమంటపం ఇందు ముందర వసంత తెప్ప తిరుణాళ్లకు చేయించిన తిరుకుళం ఇండ్లకు (ఇందులకు) నీరు వచ్చేటట్టుగాను కట్టించిన తిరుమల దేవమ్మ సముద్రం తిరుణాళ్లమంటపం మకర సంక్రాంతి మంటపం వినాయక దేవుని తేరు తిరువీడి ఇంతమట్టుకు కట్టించి......గోపురం వాకిటితలుపు ద్వార బంధానకున్ను ఉత్తరపు వాకిని వాకిట తలుపు ద్వారబంధానకున్ను వాకిలి మీది......కిన్ని ఉగ్రాణముల నాచమగుడి కిన్ని చట్ట పెరుమాళ్ల సన్నిధిని పడమటి వాకిలి ద్వార బంధానకున్ను కందు సోపానాల వాకిటి తలుపు ద్వార బంధానకున్ను ఇంత వట్టుకు వెండి పూయించి దేవుని గర్భగృహం వాకిటి ముందర ముఖభద్రకు రాతి జగతి కట్టించి కంబం నిలిపి మకర చెతులిచ్చి వెండి పూయించి వద వల్లి ముందరను ఆ రామదు పావిత్రవ్వించి దేవునికి పంచామృతఅభిషేకం"

లఘు విమర్శనము.

ఈ శాసనము క్రీ. శ. ౧౫౧౬ లో స్థాపింపఁబడెను. రాయలు ౧౫౧౫ మొదలు ౧౫౧౯ లో పలుమారు కళింగ దేశముపైకి దాడివెడలెను. అమరావతికి కొండవీటికి శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౧౫ లోఁ బోయియుండునటుల నితరాధారములచే నిర్ణయమగుకతన నిజాము రాష్ట్రములోని పై దుర్గములన్నియు క్రీ.శ. ౧౫౧౫లో గెలువఁబడినవనియె చెప్పవచ్చును. రాయలవారు సింహాద్రి యందును తిరుపతియందును నితరస్థలములందును నిద్దరు దేవులతోఁ గూడ దానములు గావించినటుల శాసనములు గలవు. తిరుపతిలో ఇరువురి దేవులు తానునిలచి యున్నటుల విగ్రహములు చేయించి స్వామి వారి కభి ముఖముగా నెలకొల్పఁబడెను. రాయలవారితోఁ బ్రతిదిగ్విజయ యాత్రయందును దేవేరులు ప్రయాణమగుచుండి రనియు తనద్రవ్యములోఁ జాలభాగము దేవాలయాదులకు రాయలు వినియోగించె ననియు నీశాసనము వలన గ్రహింపవచ్చును. కృష్ణదేవరాయల శాసనమొకటి నేలకొండ పల్లెలోఁ గలదు. వీనినన్నిటిని సమన్వయించి చూచినచో నిజాము రాష్ట్రములోని తెలుఁగుదేశ మంతయు రాయలు పాలించెననియుఁ దెలంగాణ్య మని రాయలు ప్రయోగించుటచే తెలంగానాయను నామము యవనప్రభులు పెట్టకముందే నిజాము రాష్ట్రమునందలి యాంధ్రదేశము తెలుంగాణ్య మను వ్యవహారముతో సుప్రసిద్ధముగా నుండెననియు విశ్వసింపవచ్చును. ఈశాసనమువలన రాయలకు నిజాము రాష్ట్రమునకుఁ గల సంబంధము తెలిసి రజతోత్సవావసరము బోధకాఁగలదు.





# స్వయంవరము

శ్రీమబ్బువీసు వేంకటరామ నరసింహారావుగారు

విశ్వ మండపమునం దిప్పటి కా కన్నియ స్వయంవర మెన్నియో సారులు ప్రకటింపఁబడినది. పలుమా రట్టి సన్నాహములు జరిగినవి. సారెసారి కెందరో భూవరులు, ఎందరో నృపాలు రామండపము నలంకరించుట, దినమేషములను లెక్కించుకొనుచు నుండి తుదకు హతాశులై వెడలిపోవుట జరుగుచుండెను. శివాజీ వంటి మహావీరుని, భోజునివంటి భాషాపోషకుని అశోకునివంటి విజయవీరుని వరించుటకు సంకల్పించిన కన్యక కితరులెట్లు వాంఛనీయులగుదురు? అదియసంభవము పెక్కండ్రు శ్రీమంతులా సుందరిని పాణిగ్రహణము చేసికొనుట కనేక ప్రయత్నములను గావించిరి. కొందరు రత్నాభరణ భూషితులై యామె హృదయము నాకర్షించ జూచుచుండిరి; కొందరు శృంగార చేష్టలను గావించుచుండిరి; మరికొందరు తమ ఠీవిని ప్రకటించుచుండిరి; ఇంత కామెను మోసగించుట కెన్నెన్నియో యాకర్షణల గల్పించుచుండిరి; కాని యామెకా వైభవములు, ఆవేషములు, ఆగాంభీర్యములు, ఆ కనకవస్తు వాహనములు, ఆసుందర వదనారవిందములు తృణప్రాయము. అట్టి వారంద రామెదృష్టిలో మొగలినముచెడి రాజధర్మమునువీడి భూదేవికి భారముగా నొక చిత్రకారుఁడు షడంగములతోఁ జిత్రించినపటమువలె నుండురని యామెతలంపు. అందుచేనప్పటి నృపాళిలో నెవరామె మనస్సున కెక్కకుండిరి; ఎవరిని వరింపకుండెను. అప్పటి ప్రజలామెకుఁ గామిత వరుఁడు లభించుట దుర్ఘటమని తలంచుచుండిరి. తగినవరుఁడులేక పాపమా పడుచు ప్రపంచ వాంఛా నిస్పృహతను గూడఁ జెందినది. ఆమె తాపత్రయములకు మేరలేదు. తాఁవలఁచిన రీతి పురుషమూర్తికి తప్ప ఆమె హృదయమునం దితరులకు, ఇతర పదార్థములకు స్థానములేదు. తుదకా సాధ్వి తన దుర్దశకెంతయు వగచివగచి వనాంతర్గతమైనది. తగినవరుని తనకు గూర్చుటకై ఆరుద్రాణినేకాదు; ఆ ఇంద్రాణినేకాదు; ఆ భవానినేకాదు; సమస్త దేవీ మాతల్లికలకు మ్రొక్కులిడుచుండెను. అపూర్వవస్తువు ప్రాప్తించుటకు కామిత పదార్థము లభించుటకు యోగమో, వ్రతమో పరమసాధనమని యామె బాగుగా గ్రహించెను. కాషాయాంబరధారిణియై రుద్రాక్షమాలల ధరించి నిష్ఠతో యోగాభ్యాస మారంభించినది. దేశాచారముగ భారత నారీమణుల కీరీతి వ్రతాచరణ మొక క్రొత్త కాదు. 'ఆవ్రతములు «శ్రౌతములు, స్మార్తములు, పౌరాణికములు: లౌకికములు" అని నాలుగు విధములుగా నుండును. ఇప్పుడీమె యాచరించినది లౌకికము. తదేక ధ్యానము తప్ప మరొండు విషయమున కెడమీయకున్నది.ఎంత

కాలమీమెకేగతి? ఈడు ముదిరిపోవు నేమో యను సందియ మొండవచ్చును. ఈ కాలమునాఁటికన్యకల కీడు ముదురునను భయము సహజముగ కన్యాజనకులకుండిన నుండవచ్చును. కాని యట్టి భయమామెకు గని, ఆమె తండ్రికిఁగాని లేకుండెను. వరుని తనకుఁ దానే వరించుటకు తగిన వరుఁడులభించు వరకు ధ్యానము గావించుట కామె తండ్రి యనుజ్ఞనొసఁగెను. అందామె వయస్సునకు వృద్ధి క్షయములు లేవు. ఆమె యశరీరి, శాశ్వత యౌవని, సౌందర్యరాశి. కవులామెరూప లావణ్యముల ననేక గతుల వర్ణించు చుందురు. పూర్వ కవులలో కాళిదాసామెను చంద్రునితో, నన్నయ హంసతో, భట్టుమూర్తి తారలతో, ధూర్జటిముత్యములతో, అల్లసానిపెద్దన్న వెండితో పింగళిసూరన్న హిమాద్రితో రామరాజ భూషణుఁడు మంచుతో, తెనాలి రామకృష్ణుఁ డమృతముతో, తిక్కన సోమయాజి సరస్వతితో, నంది తిమ్మన్న శంఖముతో రామభద్రుఁ డైరావతముతో, మల్లన్న కల్పముతో, ఎఱ్ఱాప్రగడ గంగతోఁ బోల్చి వర్ణించిరి. కవులామె ధవళకాంతుల వర్ణించుట సంభవ మైన చిత్రకారుల కామె మూర్తినిఁ జిత్రించుట మాత్ర మసంభవము.

౧౫౦౯వ క్రీస్తు శక మారంభమైనది. అప్పటికే వీరపురుషుఁడొకఁడు ప్రపంచమం దవతరించి యుండెను. ఆవీరపురుషుఁడే శ్రీకృష్ణదేవరాయలు. శాలివాహన శకము ౧౪౩౧ మాసము మాఘ మాసము. ఋతువు శిశిఋతువు. పక్షము శుక్లపక్షము. ఈశుక్లపక్షమునకే పూర్వపక్షమని పేరు. శశాంకుఁడీ పక్షమున దిన దిన ప్రవర్ధమాన మగును. ఆనాఁడు చతుర్దశి. మాఘశుద్ధచతుర్దశి నాఁడే శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్య సింహాసనము నధిష్ఠించుట జరిగినది. రాయల వారప్పటి కిరువదియైదు సంవత్సరముల ప్రాయములో నుండిరి. * నేఁడు పంచవింశద్వత్సరములు నిండుటచే శ్రీకృష్ణ దేవరాయ లాంధ్రభాషానిలయమున కేటుల రజతోత్సవము (సిల్వర్ జూబిలీ) జరుగుచుండెనో, ఆనాఁడు రాయలవారి కిరువదియైదవ యేఁట పట్టాభిషేకోత్సవమతి వైభవముతో నటులే జరుగుచుండెను. నాఁటి విజయనగర శృంగారము, రాయల రాచనగరు వైభవము వర్ణనాతీతము. వీధు లన్నియు శోభాయమానముగ నలంకరింపఁబడినవి. నగరమం దెల్లెడల విజయ పతాకములు కట్టఁబడియుండెను. పౌరు లందరు తమ తమ గృహాంగణములను చిత్ర విచిత్రములుగ నలంకరించి యుంచిరి. గోడలకుఁ గ్రొత్తగా వేసిన సున్నము ధవళకాంతులనీను చుండెను. అరుగు లెట్టుమట్టితో నలుకఁబడినవి. గుమ్మముల ముందు పెక్కు విధములగు ముగ్గులను జిత్రించిరి. ద్వారములకు మావిడాకుల తోరణములను మంగళార్థముగఁ గట్టిరి. మొత్తముపైనాఁడు విజయనగరము కళకళలాడుచు గన్నులపండువుగా నుండెను. మహాలక్ష్మినాఁడచట సాక్షాత్కరించిన దని చెప్పవచ్చును.

ఆ నాఁటి సాయం సమయమున ఊరేగింపు టుత్సవము జరిగినది. ఆ వేదఘోష, ఆ మంగళ వాద్యనినాదములు మిన్నుముట్టు చుండెను. ఆదృశ్యము చూడఁదగును కాని చెప్ప నలవిగా లేకుండెను. ఉత్సవము సమాప్తమగు వఱకర్థరాత్రముమీఁర మీరినది. అప్పటి కా భేరీభాంకారములు, ఆ ఏనుఁగుల ఘీంకారములు ఆ రథనేమిక్రీంకారములు, ఆ వీరభటుల హుంకా

* ఈరజతోత్సవము కేవలము సిల్వర్ జూబిలీయనక, కేవలము పంచవింశద్వార్షికోత్సవమనక, ప్రాయము ననుసరించి "రాయలవారి పట్టాభిషేకము యొక్క జ్ఞాపకోత్సవము" అనియుఁ గూడ చెప్పవచ్చును.



శ్రీ పింగిలి-వేంకట్రామారెడ్డి, దేశముఖు



శ్రీ. శే. కే వి. లక్ష్మణరావు, ఎం. ఎ. నిలయపు స్థాపకులు.



ఆడిపూడి-సోమనాథరావు
నిలయపుస్థాపకులు-గౌరవసభ్యులు.



కట్టమంచి, రామలింగారెడ్డి, ఎం. ఏ.
నిలయపుభవన ప్రవేశోత్సవమునలిపిరి)



ధర్మవీర, శ్రీవామనరామచంద్రనాయక్
నిలయపు రాజపోషకులు.



వేలూరి-రంగధామనాయుడు

రము లన్నియు నణఁగి పట్టణము నిశ్శబ్దమై యుండెను. ప్రకృతి నిర్మలముగా నుండెను. వెన్నెల దినమగుటచే నాఁటి యామినీ కాంత వదన లావణ్య మెంతయు నలరారు చుండెను. తారాగణములు కాంతి విహీనములై యుండెను. తారకాంతులు చంద్రికలో లీనమగుటయే దీనికిఁ గారణము.

ఇట్టి సమయమున విశ్వములో-సృష్టిలో-శృంగార ప్రపంచములో నీ పాటి సుందరి లేదని లోఁపజేయు నొక పడుచు దిక్కులేని పక్షివలె నొంటరిగ, ప్రశాంతముగ, గంభీరముగ విశాలమగు నా విజయనగర రాజవీథిలో నడచి పోవుచుండెను. ఏమియా ప్రేమ! ఎంత యగాధము! ఎంతయపారము! ఆమె సూటిగా ముక్కుచాయగా రాయలవారి నగరు వంకకేగుచున్నది. ఇంతకాల మీకన్యక వనాంతరములయం దావాస మొనర్చు చుండెను. ఇప్పుడా కాషాయాంబరములు లేవు. ఆ రుద్రాక్ష మాలలు లేవు. ఇంతకిపుడు సన్యాసావస్థయం దుండఁదగిన వేషమును విసర్జించినది. ప్రాసాదము సమీపించెను. కాని యంతలో నామె మొగ మకారణముగ వాడిపోయినది. దానికిఁ గారణ మామె నగరులోఁ బ్రవేశించుట కవకాశము లేకుండుట యని తలంపఁబడెను. ద్వారములు బంధింపఁబడి యుండెను. కొంత తడవైన పిదప పక్షిజాలముల కలకలములు కుక్కుటారావములు వినఁబడఁ జొచ్చెను. అంతలోఁ బ్రాసాదముపై ప్రాతఃకాల వాద్యములు మ్రోగుట కారంభ మయ్యెను. వందిమాగధులు రాజచిహ్నములగు నవరములను హస్తములందు ధరించి స్తుతి వాక్యములతో కృష్ణరాయ క్షితీంద్రుని మేలుకొలుపు చుండిరి. తిమ్మరుసు మంత్రియాజ్ఞ ననుసరించి ద్వారములు తెఱచఁబడినవి. రాయ లానాఁ డలసియుంటచే ప్రొద్దుపొడుచు వఱకు శయ్యనలంకరించి యుండిరి. తిమ్మరుసు మంత్రియీ విషయము నూహించి ప్రాసాదము యొక్కయు, ప్రాకారముల యొక్కయు ద్వారములను దెఱచుట కాజ్ఞాపించెను. ఇది సమయముగ హఠాత్తుగ నామె ధైర్యమూని సంతోషముతో రాయల రావనగరు ప్రవేశించెను. పూర్వ మింద్రాది దేవతలు దమయంతీ దేవిని వరించి, నలుని దూతగాఁ బంపుచు, నలుఁడొరుల కంటఁబడకుండుట కొసంగఁబడిన యదృశ్యఘుటిక యందే ప్రభావముండెనో, ఆ ప్రభావమీ పడుచునందు మూర్తీభవించి యుండెను. ఆ కారణముననే కాఁబోలు, ఈ కన్యక తన్నుఁ దలఁచి, తన మందిర ప్రవేశ మొనర్చినదని రాయ లెరుంగఁడు.

కాలప్రవాహము గొట్టుకొని పోవుచున్నది. అప్పటికే రాయ లాంధ్రభాషా మతల్లిక ననేకగతుల పోషింప మొదలిడెను. ఆంధ్రభాషను సానఁబట్టి ప్రకాశింపఁ జేయుచుండెను. తాను స్వయముగ కవియై, పండితుఁడై, గ్రంథకర్తయై ఆముక్త మాల్యాది గ్రంథములను రచించి ఆంధ్రకవులను, పండితులను, గ్రంథకర్తల నాదరింపఁ జొచ్చెను. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని యాంధ్ర భాషకు ప్రాముఖ్యత నొసంగెను. రాయలు కత్తిని కలమును సమముగ జూచుచుండెను. సామంత రాజుల తిరుగుబాటులను, బహమనీ నవాబుల దుండగములను, వడ్డెరాజుల పొగరును మిగుల నేర్పుతో నణఁచెను. దండయాత్రల గావించి కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, అద్దంకి వేమెల ఇంచుమించు దక్షిణదేశము నంతయు జయించి జయస్తంభములను స్థాపించెను. జలాశయములను నిర్మించి, మడిమాన్యముల నొసంగి ప్రజానురంజకముగఁ బాలించుచుండెను. ఆదిల్షాను

నోడించి రాయచూరును ముట్టడించెను. అష్ట దిగ్గజము లను పేరుతో నెనమండుగురు మహా కవులం దమ యాస్థానమం దుంచి పెక్కు కావ్యములను వ్రాయించెను. ఈ తేజోమూర్తి ధైర్య స్థైర్యములందు బాహు బలపరాక్రమము లందు అక్బరు శివాజీలకు, భాషాపోషణలో మాళవ దేశాధీశుఁడగు భోజునకు ఎంత మాత్రము తీసి పోవకుండెను. అత్యధిక రాజనీతి కోవిదుఁ డయ్యెను. శ్రీమన్మహారాజాధి రాజ, రాజ పరమేశ్వర, మూరురాయరగండ, ఆదిరాయ విభాళ, భాషిగెతప్పు వరాయరగండ, అష్ట దిక్కులరాయ మనోభయంకర, జగనొబ్బగండ, పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, యవనరాజ్య సంస్థాప నాచార్య, గజపతివిభాళ శ్రీ వీరప్రతాప, ఆంధ్రభోజ, కర్ణాటాంధ్ర రాజ్యలక్ష్మీ బాహువీర మున్నగు బిరుదములను వహించెను.

కొంత కాలమునుండి రాయలను బరికించుచున్న ఆకన్యక ప్రకృతి రంగమునఁ బ్రవేశించి ఎప్పటియట్లు మరల తన స్వయంవరమును బ్రకటించెను. ఎందరో క్షితీంద్రు లా స్వయంవరమునకు విచ్చేసిరి. బారులుదీర్చి స్వయంవర మండపము నలంకరించిన నృపాళి సిగ్గు పడునటు లా కన్య తనచేతి పుష్పమాలను రాయల కంఠమున వైచెను. కరతాళ ధ్వనులు మిన్నుముట్టెను. దేవతలు పుష్పవర్షములు గురిపించిరి. ఆకన్యరాయలను తప్ప అన్యుల వరింపఁ గలదా? కామితవరుఁడు లభించుట ఆమె తపఃఫలము సుమా! ఆసదుచు భూరి పరాక్రమ శాలియగు రాయలను ఆంధ్రకవిత నాదరించి ఆంధ్ర కవులఁ బోషించుటతోఁ దృప్తినొందని రాయలను వరించుటచే గంధర్వ, యక్ష, సిద్ధ దేవతాదులును గూడ సంతసించిరి. ఎవరా కాంత? కీర్తికాంత. చిన్నాదేవి, తిరుమలదేవి, గుచిదేవులతో నీకీర్తికాంత రాయల వారి యర్ధాంగమును బంచుకొని సుఖంపు చుండెను.



# గ్రంథాలయోద్యమము

## బాలురు—స్త్రీలు.

శ్రీమతి పందిటి సత్యవతీ బాయి

విద్యా విహీనుల సంఖ్య యధికముగఁ గలిగి, నిర్బంధ విద్యా విధానమైనను లేని నేఁటి మన దేశము, పూర్వము వలె మరల నరువది నాల్గు విద్యల కాటపట్టయి, యౌన్నత్య స్థితికి రావలెననిన, దేశాభ్యుదయకరము లగు మార్గముల నెన్నియో మనము త్రొక్కవలసి యుండును. అట్టి వాటిలో గ్రంథాలయోద్యమ మొక్కటి. గ్రంథాలయ మనఁగా జన సామాన్యమునకు సంబంధించిన సకల విషయములను నేర్పెడి పాఠశాల. నేఁటిమన ప్రభుత్వ పాఠశాలల వలె గాక యీ బడిలో సకల దేశములకును, సకల జాతులకును సంబంధించిన సకల విద్యలును గఱపఁబడును. ఏవియో కొన్ని విషయముల మాత్రము గైకొని, వాటి కొరకు నియమించిన నాలుగైదు పుస్తకముల మాత్రము చదువ వలసిన నిర్బంధము లేమియు లేక, వివిధ విద్యలకును, వృత్తులకును, కళలకును, అనేక దేశముల భూత, భవిష్యద్వర్తమాన చరిత్రములకును సంబంధించిన యనేక విషయముల విద్యానిలయములో, కొంచెమోపిక, పట్టుదల యుండిన నేర్చుకొన వచ్చును.

కావున గ్రంథాలయమనఁగా, ఎన్నియో రకముల పుస్తకముల బీరువాల నిండఁ గలిగి యొప్పారు భవనమే గాక, అజ్ఞానాంధకారమయంబులగు స్థలములలో జ్ఞానమనెడి వెలుఁగును గలుగఁజేసెడి జ్యోతి; శారదా దేవికి రచ్చపట్టు; వాణికి విలాస భవనము. మనము లోక జ్ఞానము సంపాదించవలె ననిన, ననేక దేశములందుఁ దిరిగి, ఆయా దేశపు మనుజుల యాచార వ్యవహారములను గమనింప వలసి యుండును. వారేయే సదాచారముల నవలంబించి దేశ సేవా ధురంధరులై, తమ దేశోన్నతికై పాటుపడిరో, తెలిసికొని మన మనుకరింపవలసి యుండును. ఇట్టి వ్యయ ప్రయాసములకు లోనగు పని ఒక్క ధనవంతులకు మాత్రము సాధ్యము. అట్టిచో బీదలగు సామాన్య ప్రజలు కూడ లోకజ్ఞానమును సంపాదించవలెననిన మార్గమేది! లోక జ్ఞానము పూర్తిగఁ గలిగి యుండఁగా అనేక దేశముల స్వరూప స్వభావముల నెఱింగి, అనేక జాతుల తప్పొప్పుల నెఱింగినట్టి వారి పరిచయమును గలిగించుకొనవలెను. వారి ద్వార ననేక సంగతుల గ్రహింపవలెను. కాని, మేధా సంపన్నులగునట్టి వారల సాన్నిధ్యము జన సామాన్యమున కెచ్చట గలుగఁ గలదు? గ్రంథాలయములందుఁ దప్ప మానవుల జీవిత వ్యవహారము గంభీరముగ విమర్శించుచు, ఉత్తమమైనట్టిదియు, వివేకము గలదియు సజీవిత మార్గముల బోధించునట్టి దేశహితైక కార్యాభిలాషుల పరిచయము ప్రజలందరకు నెచ్చట గలుగఁ గలదు? కావున ప్రజలందఱును జ్ఞాన సంపన్నులై తమ జీవితాశయములఁ దెలిసికొనవలెననిన, ప్రపంచ జ్ఞానమును బడయవలెననిన, కొలఁది డబ్బును మాత్రము గ్రంథాలయ చందాగ వ్యయపఱచి, జ్ఞాన భూషణులగు గ్రంథ కర్తల విజ్ఞాన పూరితములగు గ్రంథములఁ జదివి, లోకజ్ఞానమనెడి మూఁడవ నేత్రము ద్వార తమ్ము దాము తెలిసికొనుటకు యత్నింతురు గాక!

జన సామాన్యమున కెంతటి హితమును గలిగించుచు వారి కోరికల నీడేర్చు నీ గ్రంథాలయ ముండవలసిన విధమేది? అది యెట్టి పద్ధతుల మీఁద నడుపఁబడవలెను? దాని కర్తవ్య మేది? ఈ సరస్వతీ దేవళములో నెట్టి పూజారి యుండి భక్తుల నిచ్చటి కాకర్షించవలెను? మున్నగు ప్రశ్నలుదయించును. పుఱ్ఱెకొక బుద్ధి, జిహ్వకొక రుచి యను లోకోక్తినిఁబోలె గ్రంథాలయమునకు వచ్చు ప్రజల కొక్క విధములపైననే మనసుండును. కొందరికి నవలలిష్టము; కొందఱకు వార్తాపత్రికలపై యభిలాష; మఱికొందరికి ప్రబంధములపై ప్రీతి. ఇట్టి వారినెంతమంది కోరికలను గ్రంథాలయము తృప్తిపఱచగలిగియుండవలెను. మొత్తముమీఁద చాల మందియెట్టి గ్రంథములఁ గొనిపోవుదురో వాటి నెక్కువగఁ గలిగియుండవలెను. వేదముల, పండితులు మొదలు పామరుల వరకును, ఆ బాలగోపాలమును గ్రంథాలయ మాకర్షింప

గలిగి యుండవలెను. సూదంటు రాయివలె దాని యాకర్షణ శక్తి వలన దిక్కుల వ్యాప్తము గావలయును.

గ్రంథాలయ భవన ప్రాంగణమున, గ్రంథ భాండారికుఁడు బృహస్పతిం బోలెకూర్చుండి యుండవలెను. ఎవరు వచ్చినను, ఎంత మంది వచ్చినను సణుఁగు కొనక, సహనము, సౌజన్యము, శాంతము మున్నగు గుణములఁగల్గి యుండి వారు కోరిన గ్రంథముల నిచ్చుటయే గాక మంచి గ్రంథముల సూచించు చుండవలెను. గ్రంథమాలికలోని పుస్తకముల విషయ మాతనికి కొద్దిగనో, గొప్పగనో తెలిసి యుండవలెను. అమూల్యములగు క్రొత్త గ్రంథములు లేవ యిన లిఖింపఁబడి నట్టివాటిని వెంటనే భాండాగారపు మూల ధనము నుండి తెప్పించుచుండవలెను. కొందరు పుస్తకము యొక్క పేరును, ఉండు విధమును మాత్రము చూచి చదువుటకుఁగొనిపోవుదురు. కావున, పాతబడి, యట్టలు లేక చినిఁగిపోయిన గ్రంథములను తగు రీతి బాగు పరచి యుంపవలెను. కొందరికి కొన్ని పుస్తకముల విషయము దెలియక వాటిని గొంపోవరు. అట్టిచో నా పుస్తకములు చదువరులనాకర్షించు విధమునవాటి విషయమై యిచ్చినవారికి చెప్పుచుండవలెను. కొంద ఱుద్రేక పూరితములను, నిమిషోన్మాదము గలిగించు నట్టివియునగు గ్రంథములఁ గోరుచుందురు. అట్టిచో నా పుస్తకములు లేవని చెప్పి చదువ కుతూహలముతో వచ్చిన వారిని నిరుత్సాహ పెట్టుటకు మారు అట్టి గ్రంథముల చదువుట వలన గలుగు నష్టముల వారికి బోధించుచు మంచి పుస్తకముల నేవయిన నొసఁగి వారి కీయవలెను. ఎవరయినను ముద్రితములగు, గ్రంథములు గాని, లేక తాళ పత్ర గ్రంథములనైన నిచ్చినను, లేక తన కిచ్చుట కైనను గానఁబడినను "వీని నెవరు చదువుదురు, మా నిలయ భవనమున స్థలము లేదు" మున్నగు తక్కువ భావములఁ జూపక వాటికి తగు తావీయవలెను. వేయేల! గ్రంథ నిలయమున వాణి రాజ్యమేలుచుండ నామె కార్యభారముల నిర్వహింపఁగలిగిన మంత్రియై, రాచకార్య ధురంధరుఁడునై గ్రంథనిలయపు గార్యదర్శి యుండవలెను.

కాని ప్రస్తుతము గ్రంథాలయ లాభముల నొక్కట్టణ నివాసులే యనుభవించుచున్నారు. కేవల మమాయకులును, అజ్ఞానులునగు పల్లెటూరి వారికిఁ గూడ గ్రంథాలయ మెటుల తోడ్పడఁ గలదు? ప్రతి పల్లెటూరి యందును ఒక చిన్న గ్రంథాలయమును స్థాపించ వీలులేని రోజులు గదా యివి. గ్రామ వాసులును గూడ సరస్వతీ దేవి, వరములఁ బడయవలెననినవీలేది? సంచార గ్రంథాలయముల స్థాపింపవలెను. అధిక సంఖ్య గల పుస్తకము లుండి, మూల ధనము నెక్కువగఁ గలిగి, జిల్లాయొక్క కేంద్ర స్థానముగ నుండు పట్టణములో నుండు పెద్ద గ్రంథాలయమీ పనిని జేయవలెను. కొన్ని గ్రంథముల నొక పెట్టెలో వేసికొని యొక ప్రచారకుఁడు బయలుదేరవలెను. ప్రతి గ్రామములోను వాని పుస్తకములు చదువుట వలని లాభములఁ గూర్చి యుపన్యసింపుచు గ్రంథము లా గ్రామ వాసులకు చదువుటకిచ్చుచుండవలెను. తరువాత నా గ్రంథములన్నియుఁ దీసికొని మరల నింకొక గ్రామమునకు బయలుదేరవలెను. ఈ పని గ్రంథాలయమునకుఁ గ్రొత్త చందాదారులఁ జేర్చుటలోను ఎక్కువగ సాయపడును.

దేశాభిమానమును, ఉత్సాహమునుగల యువకుల చేతికిట్టి కార్యము నప్పగించినఁ జక్కఁగఁజేసి పెట్టుదురు. అట్టివారు దొరకక పోయిన తగు వేతనమునైన నిచ్చి ప్రచారకులఁ బ్రతి గ్రామమునకుఁ బంపుచుండవలెను. ఇట్టిసంచార గ్రంథాలయముల వలన ముఖ్యముగా మన దేశమున కెక్కువ లాభము గలుగఁగలదు. ఏలయన, మనదేశములో పట్టణములకన్న పల్లెటూళ్లెక్కువ. ఈ పుస్తక పేటికల నొక్క పల్లెటూళ్లకు మాత్రము పంపుటయేగాక కర్మాగారములకును, స్త్రీ సమాజములకును, అనాథ శరణాలయములకును గూడఁ బంపుచుండవలెను. కేంద్ర గ్రంథాలయ మీ కార్యమును చేయుచుండవలెను.

సంఘోద్ధరణ భారము కొంత గ్రంథాలయముపై నున్నదని చెప్పవచ్చును. గ్రంథాలయ మొక్క పురుషులకు మాత్రముగాదు. సంఘమునకు జీవమును బోలియున్న బాలురకుఁ గూడ దానితో సంబంధ ముండవలెను. గ్రంథ నిలయములో వారి నాకర్షింపఁగల బొమ్మలు గల్గిన, వినోదాత్మకములగు కల్పనా కథల పుస్తకము లెన్నియో యుండవలెను. నేటి బాలురే రేపటి పౌరులు. సారవంతములగు భూములఁ బోలువారి కోమల హృదయములలో

ఉదార భావములు ఉన్నతాశయములే నాటవలసిన ధాన్యము. పాఠశాలలో వారు చదువు నిర్బంధపాఠ పుస్తకములు వారి హృదయముల నంతగ వికసింపఁజేయవు. సాధారణముగా బాలురు గుణముల కొఱకు తూ, చా, తప్పకుండ పాఠముల బట్టిపెట్టి వప్పచెప్పుచుందురు. ఇంటివద్ద కథలు చెప్పఁదగిన పెద్దవారిని బ్రతిమాలుచుందురు. ఇట్టివో వారికి గ్రంథాలయమును జూపిన నెంత లాభకరమో యోచింపుఁడు. బాలుర యనంత శక్తుల వణఁగఁ ద్రొక్కుటకు మారు, వాటిని విధముగ వృద్ధినొందఁ జేసిన దేశమున కెంతటి మేలుగలుగఁగలదో చింతింపుఁడు.

సంఘమునకు జీవమును బోలిన బాలుర గ్రంథాలయములకుఁ దీసికొని పోతిమి. సంఘము నందర్ధభాగినులగు స్త్రీలనెట్లు కొనిపోవుట? వారికభ్యుదయ మెటులఁ గలుగఁగలదు? వారికిని గ్రంథనిలయముతోడి సంబంధ ముండవలెను. స్త్రీలు తమ యింటిపనుల వదలి కొని భాండాగారములలోనికి వచ్చి కూర్చుండి చదువఁగలరా? విద్యాభిలాష సహితములేని యధిక సంఖ్యాకులగు మన స్త్రీలు తమకొఱకు పాశ్చాత్యులవలె ప్రత్యేక గ్రంథాలయము నొకటి స్థాపించినను దాని లాభముల వారు పడయజాలరు. కావున స్త్రీ విద్యార్థినులు, గ్రంథాలయోద్యమ ప్రచారకులును మొట్టమొదల చేయవలసిన పని పుస్తక భాండాగారములలో స్త్రీలను గూడ సభాసదులు జేసికొనుట. సభ్యురాండ్రైనంతమాత్రమున గ్రంథములను తెప్పించుకొని చదువుదమనెడి యభిలాష వారికిఁ గలుగదు. వారికి పుస్తకముల రుచియు, లాభములును తెలియవలెను.

అట్లు చేయుట గ్రంథాలయమువారి పని. స్త్రీలకొఱకు ప్రత్యేకముగ నొక భృత్యునిఁ బెట్టి, వారి గృహములకు బుస్తకములను బంపి, వారు తీరిక సమయములందు నిద్రపోవుటకు మారు, విశేషముగఁ జదువునట్లు చేయవలెను. కొందఱకుఁ జదువుటయే రాదు. గనుక విద్యావంతులగు స్త్రీల నేర్పఱిచి వారు ప్రతియింటికినిఁ బోయి గ్రంథములను జదివి వినిపించునటుల చేయవలెను. ఈ పని యసాధ్యమందురేమో! పాశ్చాత్య మతబోధకులు (Missionaries) వారి మతవ్యాపనకొఱకు ప్రత్యేకముగ స్త్రీల నియమించి వారినింటింటికిని బంపి మత గ్రంథముల స్త్రీలకు జదివి వినిపింపఁజేయుట మనము చూచుటలేదా! పట్టుదల దృఢనిశ్చయ ముండిన నేపనియు నసాధ్యము గాదు. మనసుండిన మార్గముండును. ముఖ్యముగ స్త్రీ సభాసదులు తమ సోదరీ మణుల యభివృద్ధికిఁ బ్రయత్నించ వలయును.

స్త్రీ సమాజముల వారీ యుద్దేశమును గొంతవరకు నెరవేర్పఁగలరు గనుక, వారిని హేళనగ జూడక, స్త్రీలని నిరసన భావమును జూపక, వారు వృద్ధిలోనికి వచ్చుటకు చేయు ప్రయత్నములకు చేయూత నొసంగి స్త్రీ విద్యార్థినులు సహాయము చేయుదురు గాక!

ఈ విధముగ గ్రంథాలయము తన చేతనైనంతవరకును, జన సామాన్యమున కెంతయో హితమును చేకూర్చుచుండవలెను. „మానవసేవ కొఱకై నేనిచ్చట నున్నాను” అని గ్రంథాలయము చెప్పుచుండవలెను. కొందరు చదువ గలిగియు చదువని వారుందురు. అట్టివారికి చదువ నిచ్చను గలిగించవలెను. గ్రంథాలయ భవనము నందప్పుడప్పుడు సభలు జరుగుచుండవలెను. అమూల్యము లగు నుపన్యాసముల వేత్తలచే నిప్పించుచుండవలెను. గ్రంథములు చదివి యర్థము చేసికొనఁజాలని వారికి విద్యాభిలాషము, జ్ఞానమును గలుగుట కిది యొక మంచి పద్ధతి.

జాతియుత్కృష్టతకై యన్ని విధముల మూలాధార రూపమగు గ్రంథాలయోద్యమమును పరమేశ్వరుఁడు వర్ధిల్లఁజేయుగాత. తదుద్యమనాయకులకు విశాల హృదయములను, ఉదార భావములను గలిగించుగాత.



# ఆంధ్రనగరప్రశంస

శ్రీ దేవులపల్లి వేంకటాచలపతి రావు.

మ. సవలక్షాధి ధనుర్ధరుల్ గొలువ భూనాథుల్ ప్రశంసింప, స
త్కవు లుద్గ్రంథముల్ రచింపఁ గళలత్యంతంబు పెంపొందఁ బ్రా
భవ సంపన్న ప్రతాప రుద్రధరణీపాలుండు పాలింప, వై
భవముల్ గాంచిన యోరుగల్లుఁ దిలకింపన్ రాఁగదోయీ సఖా.

సీ॥ ప్రాచీన గ్రంథ సంగ్రహణార్థమై నీదు సర్వస్వమర్పింపఁ జాలవేని
ఆంధ్రభాషా లక్ష్మి యభివృద్ధికై నీదు పురుషార్థమును ధారపోయవేని
చారిత్ర విషయ సంస్కారంబునకు నీదు జీవితంబర్పణ నేయవేని
పావనాంధ్ర గ్రంథ పఠనంబునకు నీదు సౌఖ్యంబు వర్జింపఁ జాలవేని,

తే.గీ. త్యాగివియుధర్మవిదుఁడవు ధైర్యమతివి, దేశసేవకుఁడవుగావు తెలిసికొమ్ము
దేశమునుగాలమునఁబరిస్థితులెఱింగి, యాత్మధర్మంబు నెరవేర్పుమాంధ్రపుత్ర.

చం. అనుపమవీరవర్యనివహంబగు దుర్గము జీర్ణరూపమై
కనఁబడుచుండెనాంధ్రమునఁ గావ్యములెన్నియొ వ్రాసినట్టి ధీ
ఘనులయశంబుసన్నగిలెఁ గాలము మాఱెగతంబు నెంచి నీ
జననికిమాతృభూమికి నొసంగుమి యంజలి నాంధ్రసోదరా.

సీ. శ్రీమత్ప్రతాపధా త్రీనాథుఁడనిలోనఁ, బగతురచేఁబట్టువడినయపుడు
తెలుఁగుపౌజులు మాతృదేశాభిమానంబు, నంచితభక్తిఁ జూపించినపుడు
ఆత్మగౌరవరక్షణార్థ మాంధ్రప్రభు, లుసురులురణభూమి కొసఁగినపుడు
కోటనుగాపాడుకొనుటకై సేనాధి, పతులు వైరులఁదల పడినయపుడు

తే.గీ. ఆంధ్రనగరీపురంధ్రి నీరంధ్రదుర్గ, రంజితద్వార ముఖమునరక్తధార
లెన్ని తెలుఁగులఁ బారెనో యెఱుఁగుమయ్య, అతులితక్షాత్రపాత్ర మహాంధ్రపుత్ర.

మ. ఇదెవీక్షింపుమి పోతరాజిచటఁగాదేలొల్లి, దుఃఖించు శా
రదమోముంగనిఁ బుజ్జగించె గవితారాజ్యంబుఁ బాలింప న
భ్యుదయం బొందుఁ బ్రతాపరుద్రపతి మున్నొందెన్ సుమీ యిందునీ
వుదయంబొందితి మాతృసేవకయి కార్యోత్సాహముం జూపుమా.

# ఓరుగల్లు-ఒంటిమెట్టు-ఏకశిల

శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు ఎం. ఏ. పి.హెచ్. డి.

బమ్మెర పోతరాజుగారు భాగవతమందు పేర్కొనిన ఏకశిలానగరము నిజాం రాజ్యమందలి వరంగల్లు అని కొందరును కడపమండలమందు శ్రీకోదండ రామస్వామివారి ఆలయమును గలిగియున్న ఒంటిమెట్టయని కొందరును వివాదపడియున్నారు. ఈ యంశమును నిర్ధారపరుచగల యాధారములు కొన్ని మనవి చేయుచున్నాను.

కాకతీయ రాజవంశము వారు రాజధానిగా ఏర్పరచుకొని రాజ్యముచేసిన ఒరంగల్లుకు ఏకశిలానగరమను వ్యవహారము ఒరంగల్లు కోటలోని శిలాశాసనములందును సాహిత్య గ్రంథములందును కానవచ్చుచున్నది. కాని కడపమండలములో ఒంటిమెట్ట కోదండ రామస్వామివారి ఆలయములోగల రెండు శాసనములలో ఒంటిమెట్ట యనియే నిర్దేశింప బడినది. ఈ శాసనములు శ్రీవిజయనగర రాజ్యాధిపతులగు శ్రీసదాశివ దేవరాయలవారి కాలములోనివి. శా. శ. ౧౪౭౭, ౧౪౮౦ ప్రాంతమువి. వీటియందీ గ్రామమున కేకశిలానగరమను పేరులేదు. ఒరంగల్లు అనిగాని లేదు.

ఇకనీ కడపమండలములోనే టంగటూరు అను గ్రామములో శిథిలమైయున్న సిద్ధేశ్వరాలయము వద్ద నున్న రాతిపైనిగల శాసనములలో శ్రీకాకతీయ ప్రతాపరుద్ర దేవరాజులు శా. శ. ౧౨౩౭ సం॥ మున "ఒరంగల్లు పట్టణమున రాజ్యము చేసినట్లుకలదు" ఇది యామండలములోని "ఒంటిమెట్టు" యేయనుటకు నాధారములు కానరావు. శా. శ. ౧౪౭౭ సం॥ ప్రాంతమున "ఒంటిమెట్ట" యనబడిన గ్రామమునకు తత్పూర్వము "ఒరంగల్లు" అను వ్యవహారముండినట్లు ఋజువైన కాని శా. శ. ౧౨౩౭ సం॥ ప్రాంతముననో అంతకు దరిమిలానో శా. శ. ౧౪౭౭ సం॥ వరకు అది "ఒరంగల్లు" అన బడియుండె నన లేము గదా. ఇక "ఒంటిమెట్ట" రాజధానిగా కాకతీయులుగాని మరియే రాజులుగాని రాజ్యముచేసినట్లచట పురాతనపు జాడలేవియు కానరావు. కాగా! రాజధానిగా శాసన ప్రశస్తిగల "ఒరుగల్లు" నిజాం రాజ్యములోనిదే ఈశాసనమున పేర్కొన బడిన "ఒరంగల్లు పట్టణ" మన వలసి వచ్చు చున్నది.

శాసనములలో నెల్లయెడల నీ ఒరుంగల్లు కాకతీయరాజుల ప్రశంసలలో నెక్కువగా పేర్కొనబడు చున్నది. కర్నూలు మండలమున దరగా సమీపమున నున్న ఒక రాతిమీది శాసనములో శా. శ. ౧౨౦౧ సం॥లో ఒరంగల్లులో రాజ్యము చేసిన శ్రీప్రతాపరుద్రదేవ మహారాజులవల్ల తనకు లభ్యమైన ఆస్తిని ఒకకోమటి యొక దేవాలయమున కిచ్చినట్లున్నది. ఆకర్నూలు మండలములోనే పనెం అను గ్రామములో వీరనారాయణ స్వామివారి ఆలయములోగల శా. శ. ౧౨౪౧ సం॥పు శాసనమును బట్టి యప్పటిలో శ్రీ కాకతీయ ప్రతాపరుద్ర దేవ మహారాజులు ఒరంగల్లులో రాజ్యముచేయు చుండినట్లున్నది. ఆ దేవాలయములోనే ముఖమండపములో ఒక స్తంభముపై నున్న శాసనమును బట్టి యచ్చటికి విభూతి గవరయ యను నాతడు వచ్చినట్లును, అతని జన్మస్థానము ఒరుంగల్లు దరి

నున్న మాచిరాజుపల్లి యైనట్లును కలదు. ఇది చాల ముఖ్యమైన శాసనమని నాయభిప్రాయము.

ఈ "ఒరంగల్లు" ను బేర్కొను శాసనములు గుంటూరు మండలమందును గలవు. ఈ శాసనములు శా. శ. ౧౧౧౧, ౧౧౭౩, ౧౨౪౧ సం॥ లలో నాప్రాంతమందు కాకతీయులగు శ్రీరుద్రదేవి (పట్టోద్ధతి) యు శ్రీమత్ మహామండలేశ్వర శ్రీగణపతిదేవ, ప్రతాపరుద్రదేవమహారాజులును దానములుచేసినట్లు బేర్కొను చున్నవి. వీటియందును "ఒరుంగల్లు" కాకతీయ రాజధానిగా చెప్పబడినది.

ఒరంగల్లు—ఒంటిమెట్ట వాద మీదివరకెట్లుసాగినను ఒరంగల్లు దరిని మాచిరాజుపల్లి యను గ్రామము కలదని సూచించు శాసనము (ప్రస్తుతములో నుదహరించబడినది) యాధారముచేసుకొని యీవాదము నిటో, అటో చేయవచ్చును. ఈ మాచిరాజుపల్లి గ్రామము ఒంటిమెట్ట దరిని కడప మండలములో కనబడదు. శాసన ప్రసిద్ధిగలిగి నేటికిని తొల్లింటి రాజధాని చిహ్నములు గలిగి యున్న నిజాం రాష్ట్రమందలి వరంగలు ప్రాంతమున నీమాచిరాజుపల్లి గలదో లేదో పరిశీలనవల్ల తేల్చి శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయమువారు ఈరజతోత్సవముతో నారంభమగు తమ గ్రంథాలయ నూతన చారిత్రమున ఆంధ్ర చారిత్రక జ్ఞానప్రచారమునకు తోడ్పడుదురు గాక యని యాశీర్వదించు



# నిజాం రాష్ట్రములోని

# చారిత్రిక ప్రదేశములు

(ఆంధ్రేతర ప్రాంతము)

శ్రీ కొమ్మవరపు సుబ్బారావు

## అంతూరు

ఇది ఔరంగాబాదు జిల్లాలోని యొక పురాతన దుర్గము. పదునైదవ శతాబ్దపు మధ్య భాగమున ఒక మహారాష్ట్ర వీరునిచేఁ గట్టఁబడి యాతని పేరనే బరగుచున్నది. అతఁడు, అతని వంశీకులును, ఒక శతాబ్దము వఱకు నిర్విఘ్నముగాఁ బాలించిరి. తరువాత మహమ్మదీయులచే నాక్రమింపఁబడెను. క్రీ.శ. పదునారు పదునేడవ శతాబ్దములలోఁ గొంత కాలము అహమ్మదు నగర రాజులగు నిజాంషాహీలకు లోఁబడి యుండినటుల ఫారసీ భాషలలో నున్న శాసనములు తెలుపుచున్నవి. పదునేడవ శతాబ్దాంతమున ఔరంగబాదును దరచుగా భయపెట్టుచున్న మహారాష్ట్రుల నడంచుటకై ఔరంగజేబు తన సైన్యముల నిచటనుఁ చెను. ఈతని దక్కను సర్దారులలో నొకఁడగు బహద్దూరుఖానుఁడు క్రీ.శ. ౧౬౮౨ లో మహారాష్ట్రులను ఈ యంతూరు వద్దనే ముట్టడించి, యోడించి పారద్రోలెను. కోటలోనున్న మసీదు క్రీ.శ. ౧౬౧౬ లో ఇస్మాయిల్ హుసేను వలనను, శిఖరము బురహాన్ నిజాంషా పక్షమున మలికాంబరుచే క్రీ. ౧౫౯౫ లోను, కోటయొక్క రెండవ ద్వారములోని చిన్న కిటికీ మలికాంబరు ఆజ్ఞవలనను గట్టఁబడినటుల నితర శాసనములు తెలుపుచున్నవి.

## అజంటా

ఔరంగాబాదు జిల్లాలో భోకర్దన్ తాలూకా ఉత్తర భాగముననున్న సాలారుజంగు మంత్రిగారి జాగీరులో నజంటా యూరున్నది. దీనికి సమీపమున నున్న గుహాలను జూడవలెననిన యాత్రికులు ఔరంగాబాదు నుండి అజంటా వరకు మోటారులోఁ బోయి యచ్చటి నుండి బండ్లమీఁద నారుమైళ్ల దూరములో నున్న ఫరదాపూరు చేరి యచ్చటనున్న విశ్రాంతి గృహములో విడియుదురు. అచ్చటినుండి సుమారు నాలుగుమైళ్ల దూరములో నున్న అజంటా గుహాలను జూచుటకు బండ్లమీఁద వెళ్ల వచ్చును. భోజన పదార్థములను ఔరంగబాదునుండియేఁ దీసికొని పోవుట మంచిది.

అజంటా గ్రామమొక కనుమ శిఖరమున నున్నది. ఆయిదవ శతాబ్దాంతమున చాళుక్యరాజగు మొదటి పులకేశి యొక్క మొట్టమొదటి రాజధానియై యుండునని ఫ్లీట్లుగారభిప్రాయ పడుచున్నారు. మొదటి నిజాముగు అసఫ్‌జాచే ౧౭౨౪ లోఁ గట్టఁబడిన రాతి కోటచేఁ బరివేష్టింపఁబడి యున్నది. గ్రామములోనున్న సత్రమును, హిందూ దేవాలయ సంబంధములుగ నుండి, శిల్పకళా చాతుర్యము గల పెద్దతాలచే నిర్మితమయి, ద్వారము వద్ద నున్న నదిమీఁది రాతి వంతెనయు నితనిచేఁ గట్టబడినవి. ఇచ్చటి మసీదు ఔరంగబాదు దానినిఁ బోలియున్నది. ఇవిగాక ఈస్టిండియా కంపెనిచేఁ బంపఁబడిన మేజరు గిల్ అను చిత్రకారుని భవనము కలదు. దీనియందే డ్యూకు ఆఫ్ వెల్లింగటను అస్సె యుద్ధము తరువాత నివసించెనని చెప్పెదరు.

బౌద్ధులచే నిర్మింపఁబడి ప్రపంచ విఖ్యాతిఁ గాంచిన యజంటాగుహాలు ఇంధ్యాద్రి పర్వతములలో నున్నవి. ఉత్తర హిందూస్థానము నుండి దక్కను దండయాత్రకు మహమ్మదీయులీ మార్గముననే వచ్చిరి. మహారాష్ట్రులు కూడ నీ గుట్టలఁ దఱుచుగా నుపయోగించుకొనినటుల అస్సె యుద్ధ చరిత్ర తెలుపుచున్నది. ఈ గుహాల అంతమందు రాతి గోడ నుండి యనఁగా సుమారు నూరడుగుల యెత్తునుండిపడు సుందరమైన యేడుజలపాతము లున్నవి.

ఈ సిరు నిలుచు స్వాభావిక రాతి గుండములోఁ బరిశుభ్రమైన నీరెల్లపుడును ఉండును.

ప్రపంచ వ్యవహారముల వదిలి నిశ్చింతతో బుద్ధదేవుని తత్వముల స్మరించుచు నాగరణలోఁ జెట్టుచు బౌద్ధులు ఈ యేకాంతగుహాలలోనే యాత్మీయ జ్ఞానమును సంపాదించిరి, ఆ పూజనీయులైన భిక్షువులు ఇంద్రియ నిగ్రహము నభ్యసించి యర్థ్యర్థులకు నిర్వాణ నిర్వృత్తి మార్గముల బోధించిన పవిత్ర స్థల మిదియే.

చాళుక్య రాజైన రెండవ పులకేశి రాజ్యములోఁ గూడ భాగముగా నుండిన యీ అజంటా గుహాలను క్రీ. శ. ౬౨౯ నుండి ౬౪౫ వరకు హిందూ దేశములో సంచారము చేసిన హుయ్యాయన్ సాంగు దర్శించి యెంతయో పొగడియున్నాఁడు. ఈ గుహాలు శిల్పకళా చాతుర్యమునకును, చిత్రములకు వేయఁబడిన రంగులకును ప్రసిద్ధి చెంది ప్రపంచము నంతను ఆకర్షించుచున్నవి. మొత్తపు గుహాల సంఖ్య ౨౯. ఇవియన్ని యొకే సారి కాక వివిధ సమయములందుఁ బూర్తి చేయఁబడినటుల చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. తొమ్మిదియవ, పదియవ గుహాలు రెండవ శతాబ్దమునకును, మిగిలిన వాటిలోఁ జాల భాగము ఆరవ శతాబ్దమునకును, దక్కినవి యేడవ శతాబ్దమునకును చెంది యుండునని బొంబాయి గవర్నమెంటుచేఁ బంపఁబడిన యార్థిక శాఖాధ్యక్షుఁడగు జేమ్సు బర్జస్ గారభిప్రాయపడుచున్నారు. ఈ గుహాల విషయమై తెలిసికొనఁగోరువారు లేడి హెర్రింగుహాంచే వ్రాయ బడిన „అజంటా ఫ్రెస్కోస్ (Ajanta Frescos. Oxford University Press 1915) అను పుస్తకమును, నైజాము సర్కారు అర్షిక శాఖవారిచే నిటీవలఁ బ్రకటింపఁబడిన నివేదికలను జదువుట యుక్తతమము.

### అలంపూరు

ఇది రాయచూరు జిల్లాలోనున్నది. సగము పాడుపడియున్నది. పర్వతము యొక్క ద్వారమని హిందువులచే నొకప్పు డెక్కువగ గౌరవింపఁబడు చుండెను. ఊరిలోనున్న కోటలోఁ జాల పురాతనమగు దేవాలయము లున్నవి. వీటి కుపయోగింపఁబడిన రాళ్లు చక్కని కోఁతఁ గలిగి, శిల్పచాతుర్యముచే నలంకరింపఁ బడియున్నవి. కొన్ని దేవాలయములు పడఁగొట్టఁబడి యొక మసీదుకట్టఁబడెను. ఇచ్చటి దేవాలయముల కట్టుబడి నితర స్థలముల కంటె నొక ప్రత్యేక విధముగా నున్నది. అనఁగా, ఆ దేవాలయముల యొక్క పైభాగములు సాధారణపు వాటి వలెఁ గాక, గోపురములు అడ్డముగా గొట్టఁబడి, వాటి మీఁద అణఁచఁ బడిన గోళాకారములు గట్టఁబడినవి. దేవాలయముల సమీపమున వివిధ కాలములం దియ్యఁబడిన దానముల సూచించు శాసనము లనేకము లున్నవి. వీటిలోఁ గొన్ని సంవత్ శకమునకు సంబంధించినటులఁ గానఁబడు చున్నవి, అలంపూరు ప్రస్తుతపు జనసంఖ్య ౪౪౬౬.

### అస్సె

ఈ గ్రామమును, యుద్ధరంగమును ఔరంగాబాదు జిల్లాలో ఈశాన్య భాగమందు బిరారు సరిహద్దుననున్నది. మహారాష్ట్ర నాయకులగు సింధియా, రాఘోజిభోస్లేలు అస్సే సమీపమున జూవా, కేల్నానదుల కూడలి యొద్ద సంపూర్ణ బలముతో నుండిరి. వీరివద్ద ౫౦,౦౦౦ సైనికు లుండిరి. క్రీ. శ. ౧౮౦౩ సంవత్సరము ౨౩ సెప్టెంబరు నాఁడు సర్ అర్థర్ వెల్లస్లీ వీరితోఁ బోరాట మారంభించెను. అతనియొద్ద సైన్యము ౪౫౦౦ మాత్ర ముండెను. మహారాష్ట్రుల సైన్యము చక్కగాఁ బనిచేసెను. బ్రిటిషు సైన్యములో మరణ సంఖ్య చాల హెచ్చెను. ౭౪ హైల్యాండర్సు సైన్య మన్నింటికంటె విస్తారము నష్టమును బొంది యెద్దు లనేకములు చచ్చుటచే ఫిరంగులను దీసికొని పోవుట కూడ కొంత కాలము వరకు దుస్సాధ్యమయ్యెను. కాని యొకకొంత సైన్యము ఇంగ్లీషువారికి సహాయము నిచ్చుటచే మొదట గడునష్టము పొందినను తుదకు ఇంగ్లీషు వారే గెలిచిరి. ప్లాసీ యుద్ధము తరువాత నింగ్లీషు వారికి లాభప్రదమైన దిదియే యని వ్రాయఁబడినది. ఈ యుద్ధములో సింధియా మంత్రియగు యాదవరావు భాస్కర్ చంపఁబడెను. ఈ అస్సేయందును, దీని తరువాత రెండు నెలలకే జరిగిన అర్గాం యుద్ధమునందను బొందిన యపజయముతోనే మహారాష్ట్రుల బలము చాల తగ్గెను. ఔరంగాబాదు అజం

టారోడ్డు మీఁదనున్న సిల్లోడ్ గ్రామమునుండి యుద్ధభూమి చక్కఁగాఁ గనఁబడును. ఇచ్చటఁ బ్రయాణికులకు విశ్రాంతి గృహముకూడ కలదు. ఇచ్చటికి అస్సే పదిపన్నెండు మైళ్ల దూరమున నున్నది.

## ఇతుగి

రాయచూరు జిల్లాలో కొప్పలకు ఉత్తర పశ్చిమమున నున్నది. ఇచ్చట నున్న దేవాలయము నీలపురంగుగల చక్కని రాళ్లచేఁ గట్టఁబడి శిల్పచాతుర్యమునకు ప్రసిద్ధిఁ జెందినది. దీనిలోని శాసనము వలన ఈ దేవాలయము ఒకానొక హిందూరాజు మంత్రిచేఁ గట్టఁబడినటులఁ దెలియుచున్నది. ఇతుగికి ఒక మైలు దూరమున కులూరు అను గ్రామమందొక లింగాయతుల పురాతన దేవాలయము కలదు. దీని కియ్యఁబడిన దానములు, భూములును గుడిలో నొక ఱాతఁ జెక్కఁబడినవి.

## ఉదయగిరి

హైదరాబాదు జాల్నా రోడ్డు మీఁదనున్న యొక పట్టణము. జన సంఖ్య ౩౧౩౫. ఇచ్చట నొక బలిష్ఠమైన కోట కలదు. ఢిల్లీ సామ్రాజ్యమేలికలకును బీజపూరు రాజులకును జరగిన యుద్ధములలో బీజపూరుపక్షముఁ జెందిన యీ కోట తఱచుగా ముట్టడింపఁబడినది. క్రీ. శ. ౧౬౩౬ లో షాజహానుని సైన్యాధిపతి ముట్టడించి దీనిని జయించెను. నైజాము కిలేదారునుండి మహారాష్ట్రులు అహమ్మదు నగరమును దీసికొని చౌతు అను పన్నును చేయుటచే నైజామునకును మహారాష్ట్రులకు నిచ్చట ౧౭౬౦ లో యుద్ధము జరిగెను. సలబతు జంగు, నిజాము అలీ సోదరులు కొంత హైదరాబాదు నుండి వచ్చి ౪౦౦౦౦ సైన్యముతో ఉదయగిరి నాక్రమించిరి. ౬౦,౦౦౦ సైన్యముతో మహారాష్ట్ర వీరుఁడగు సదాశివరావు ఉదయగిరి సమీపించినప్పుడు పై సోదరులు ధారూరుపోవఁ బ్రయత్నించిరి. కాని ముట్టడింపఁబడిరి. రెండు దినములవరకు ఘోరమైన పోరాటము జరిగి, చివరకు మహమ్మదీయులు ధారూరుకు నిరువది మైళ్ల దూరములో నున్న యొక కోటకుఁ బోయిరి. ధారూరు కోటకుఁ బోయిన వారి నోడించుట కష్టమని తలంచి యిప్పటనే వారి సెనుకొని మహారాష్ట్రులు సంపూర్ణ విజయము నొందిరి.

దీని ఫలితముగా జరిగిన యొడంబడిక ప్రకారము సంవత్సరమునకు అరువది లక్షలు అదాయము వచ్చు జిల్లాలు మహారాష్ట్రుల కీయఁబడెను. కనుక హైదరాబాదు ప్రాంతము, బీరారు, బీజపూరు, బీదరు రాజ్యములోఁ గొలఁది భాగములు మాత్రము నైజామునకు మిగిలెను.

## ఎల్బర్గా

కొప్పలకు పశ్చిమోత్తరమున ౨౧ మైళ్ల దూరమున నున్నది. పశ్చిమ చాళుక్యులకు మొదలు సామంతులుగను ప్రతినిధులుగను నుండి వారిబలము క్షీణించిన తరువాత స్వంతరాజ్యమును స్థాపించుకొనిన సిందలకు రాజధానిగా నుండినటులఁ దలంచఁబడు చున్నది. శాసనముల వలన తెలిసినంత వరకు వీరిలో ముఖ్యుఁడు రెండవ ఆచుగి. ఈతఁడు పన్నెండవ శతాబ్దపు మొదటి భాగములో రాజ్యము చేసెను. అతఁ విక్రమాదిత్యుని అజ్ఞప్రకారము హొయిసలుల నెదుర్కొని గోవాపట్టణము దీసికొనినట్లు అతని శాసనము తెలుపు చుండుటచే విక్రమాదిత్యుని సార్వభౌమత్వము నొప్పుకొని యుండినటులఁ దెలియుచున్నది. ఈతని తరువాత రాజగు రెండవ భద్రుఁడుఁడు కాలచుర్యుల స్త్రీని వివాహమాడి పశ్చిమ చాళుక్యుల అనంతరము కళ్యాణి నాక్రమించుకొనెను. ఈతఁడు కొంచెము కాలమే స్వతంత్రుఁడుగాఁ నుండి యుండునని ఫ్లీటుగారు వ్రాయుచున్నారు. ఏలయన క్రీ. ౧౧౫౦–౫౧ లో సిఘణుని యొక కుమారుఁడగు విక్రముఁడు కాలచూరి రాజగు సర్వమునకు సామంతుఁడుగా ఎల్బర్గా రాజధానిలో నేలుచుండినటులఁ దెలియుచున్నది. ఈతని తరువాత నీ వంశస్థుల జాడ కనఁబడుటలేదు.

## ఎల్లోరా

ఈ గ్రామము ఔరంగబాదునకు పశ్చిమోత్తరమున ౧౪ మైళ్ల దూరమున నున్నది. దీనికి సుమారొక మైలు దూరమున తూర్పువైపు ఎల్లోరా గుహ లున్నవి. గుహలకును గ్రామమునకు మధ్య ఇందూరు సంస్థానమును (౧౭౬౫–౯౫) ముప్పది సంవత్సరము లేలిన రాణి అహల్యాబాయిచే నెఱ్ఱని రాతిచే గట్టింపఁ బడిన సుందరమైన దేవాలయము కలదు. ఈమె భర్తయగు మల్హారీ హోల్కరు యుద్ధములో మరణించిన తరువాత మను

మఁడు రాజ్యమునకు వచ్చెనుగాని యాతనికి పిచ్చియెత్తి కొలఁదికాలమే జీవించుటచేత నహల్యాబాయి కడుసామర్థ్యముతో రాజ్యము నేలెను. పై గుడియొద్ద "పలు" అను రాజుచే త్రవ్వింపఁబడిన యొక చెఱువుకలదు. ఈతఁడే ఎల్లోరా గ్రామమును స్థాపించెననియు, గుహలలోని కైలాస దేవాలయమును దయారు చేయించెననియుఁ దెలియుచున్నది.

ఎల్లోరా గుహల జూడఁబోవువారు సాధారణముగా దౌలతాబాదు స్టేషనునుండి వెళ్లెదరు కాని ఔరంగబాదు నుండి బయలుదేరుటయే ఉత్తమము. దీనివలన ఈ మార్గము మీదనున్న సుప్రసిద్ధమగు దౌలతబాదు, రౌజా, ఖుల్దాబాదులను జూడవచ్చును.

ఎల్లోరా గుహలు వానిలోని చెక్కడపుఁ బనికి చాల సుప్రసిద్ధమైనవి. ఇవి మొదట పదియవ శతాబ్దములో నరేబియా దేశపు భూగోళ శాస్త్రజ్ఞుఁడగు మెహసుది ప్రసిద్ధిఁజెందిన యాత్రా స్థలమని పేర్కొనెను. తరువాత చరిత్రలో ఈ గుహలను గురించి క్రీ. శ. ౧౩౦౬ లో విను చున్నాము. దక్కనుకు దండయాత్ర చేసిన మొదటి మహమ్మదీయుఁడగు అల్లాయుద్దీను యొక్క సరదారుఁడొకఁడు గుజరాతు దేశపు రాజు భార్యను ఢిల్లీకి ఖైదిగాఁదీసికొనిపోయి సుల్తానుని మహలులో నుంచెను. దక్కనుకు మరియొక దండయాత్ర పోవుచున్నదని యామెకుఁదెలిసినపుడు తన కుమార్తెయగు దేవల దేవిని గురించి కనుగొనుమనియు, వీలు అయిన యెడల ఢిల్లీకి తీసికొని రమ్మనియు సుల్తానుని కోరెనఁట! అతని సరదారులు వెదకి నిష్ఫలులైరి. ఒకనాఁడు సుల్తాను అల్లాయొద్దీను దేవగిరి (దౌలతాబాదు) వద్ద విడిసి యుండగా కొంత మంది యెల్లోరా గుహలఁ జూచుటకుఁబోయిరి. సందర్భవశమున దేవగిరికిఁ బోవుచున్న దేవల దేవి యచట వీరి కంటఁబడగా నామెను సుల్తానుకొప్పఁజెప్పిరి. ఈమె యాతని కుమారుఁడగు ఖిజర్ ఖానున కిచ్చి వివాహము చేయఁబడెను. ఎల్లోరా గుహల సంఖ్య ముప్పదికంటె నెక్కువ. మూడవ నాల్గవ శతాబ్దముల నుండి ఆరవ, ఏడవ శతాబ్దముల వరకు వీటి చెక్కడపుఁబని జరిగియుండునని యూహింపఁ బడుచున్నది. ఇవి బౌద్ధ, బ్రాహ్మణ, జైన దేవాలయము లని మూడు విధములుగా భాగింప వచ్చును. మొదటి తరగతి పండ్రెండింటిలో బుద్ధుని యొక్కయు, రెండవ తరగతి పదునేడింటిలో శివ, విష్ణు, మహిషాసుర, దుర్గ, పార్వతి, రావణ, భైరవ, గణపతి, వరాహ, బ్రహ్మ, కాళి, లక్ష్మి మొదలగు వారియొక్కయు, మూడవ తరగతి సుమారు మూఁడింటిలో మహావీరునియొక్కయు చిత్రములు చెక్కఁబడినవి. బ్రాహ్మణమునకుఁ జెందిన పదునారవ గుహలో నున్న కైలాస లేకరంగు మహల్ దేవాలయము హిందూ దేశములోని గుహల దేవాలయములలో నత్యుత్తమమైనది.

ఈ గుహల వివరములఁ దెలిసి కొనఁదలచిన వారు నైజాము ప్రభుత్వపు అర్కియాలజికల్ శాఖవారిచేఁ బ్రచురింపఁ బడిన "A guide to Ellora Cave Temples" అను పుస్తకమును జదువుట మంచిది.

## ఔరంగబాదు

ఇది "కౌం" అను చిన్ననది యొద్దనున్నది. అహమ్మదు నగరు నిజాంషాహి రాజుయొక్క రీజంటుగా నుండిన అబిసీనియా దేశస్థుఁడగు మలికాంబరు అనువాఁడు ౧౬౧౦ లోఁగట్టి దీనికి ఖిర్కీ అని పేరిడెను. అహమదు నగరు రాజ్యము ఢిల్లీ మొగలు చక్రవర్తిచే జయింపఁబడిన తరువాత దానిని మరల సంపాదించుటకు కుతుబుషాహి, అదిల్ షాహిల సహాయముతోఁ బ్రయత్నముచేసి నిష్ఫలుఁడయ్యెను. మొదటి సారి ౧౬౨౧ లో ఖిర్కీయొద్ద నోడింపఁబడెను. రెండవసారి ౧౬౨౧ లో బుర్హానపూరు నుండి ఖిర్కీకి తరుమఁబడెను. ౧౬౨౨ షాజహాను తనతండ్రి మీఁద దిరుగఁబడినపుడు షాజహాను సహాయార్థము మలికాంబరు తనసైన్యము నడిపెను. కాని దానివలన అతని కేమియు లాభము కలుఁగలేదు. ౧౬౨౬ లో మలికాంబరు చనిపోఁగా ఖిర్కీకి ౧౪ మైళ్లదూరమునందున్న రౌజా గ్రామములోఁ బాతిపెట్టఁబడెను. ౧౬౩౫ లో ఔరంగజేబు దక్కను రాజప్రతినిధిగా నియమింపఁబడి, దక్షిణమునకువచ్చి ఈ ఖిర్కీలో ౧౬౫౩ వరకుండెను. గండ్రిగాజ్ఞాను సారము ఢిల్లీకి వెళ్లి మరల వచ్చి పదవితో వచ్చి ఈపట్టణమందు నివసించి, దీనికి ఔరంగబాదు అను క్రొత్త పేరుపెట్టెను. ఇచ్చట మూఁడు సంవత్సరము లున్న తరువాత గోల్కొండ మీఁదికి దాఁడివెడ

లెను. శివాజీ తనకు గలిగిన యపజయములచే ౧౬౬౬ లో ఔరంగజేబునకు లోబడి ఢిల్లీకి బోవునపుడు ఔరంగబాదునందు కొంత కాలముండెను. ౧౬౮౦ సు॥ శివాజీ చనిపోగా నాతని కుమారుడగు శంభాజీ మొగలులతో పోరాటములు మరల ప్రారంభింప బుర్హానుపూరు ముట్టడించబడెను. దక్కను రాజప్రతినిధి యగు ఖాన్ జహాన్ మహారాష్ట్రుల సరిగ నెదుర్కొన కుండుటచే ఔరంగజేబాతనిని ఢిల్లీకి బిలిచెను. మరుసటి సంవత్సరము తాను స్వంతముగా దక్కనుకువచ్చి ఔరంగ బాదులో కొంత కాలముండి ౧౬౮౬ లో బీజపూరును ముట్టడించుటకు వెళ్లెను. మరల ఈతడు ఔరంగబాదుకు వచ్చినటుల చరిత్ర కారులు తెలుపుటలేదు. ౧౭౦౭ లో ఔరంగజేబు మరణానంతరము నిజాముల్ ముల్కు దాని నాక్రమించెను. ఔరంగబాదునకు ౧౩ ద్వారములున్నవి. వానిలో పాకకల్ ద్వారము కాలామసీదులును మలిక్ అంబరుచే కట్టబడెను. ఔరంగజేబు కాలములో గట్టబడిన బిబీకామక్బరా (ఔరంగజేబు భార్య) మక్బరా జుమ్మామసీదు నీటివసతులు పురాతన రాజమందిరములు మరియు నితర గోరీలు చూడదగి యున్నవి. ఔరంగ బాదునుండి అజంటాగుహాలకు పోవుటకు మంచి బాటయు ఏర్పాటులునుగలవు. ఈ పట్టణమునకు ఉత్తరమున రెండు మైళ్ల దూరమునయున్న గుహాలుకూడ చూడదగినవి. ఔరంగబాదు పట్టణపు జనసంఖ్య ౩౬౩౮౬.

## కందహార్

ఇది నాందేడునకు ౨౫ మైళ్ల దూరముననున్న పురాతనపు కోట. నాల్గవ శతాబ్దములో నిచ్చట రాజ్యము నేలిన సోమదేవుని స్థానమని చెప్పెదరు. ఈతని కళ్యాణ పురాధీశ్వరుడగు బల్లహుడు చంపి ఈ రాజధానిని దీసికొనెను. ఆ సోమదేవుని మరణానంతరము పుట్టిన యాతని కుమారుడు మాధవవర్మ ఓరుగల్లు కాకతీయ వంశ స్థాపకుడని చెప్పబడుచున్నాడు. ఢిల్లీశ్వరుడగు మహమ్మదు తోగ్లక్ చే బీదరునందుంచబడిన ఇమాదుల్ ముల్కు సేనాధిపతి ౧౩౪౪ దక్కనులోనే చంపబడిన తరువాత యతని సైన్యములు కందహారులో నుండెను. ఢిల్లీశ్వరునిచే నియమింపబడిన యధికారితో ఈ కోటను మొదటి భూమిని రాజున కిచ్చి వైచెను. మొగలులకు జెందిన నసూరు ఖానుడు క్రీ. శ. ౧౬౩౦లో దీనిని ముట్టడించెను. అతని నోడించుటకు నిజాంషాహీల సరదారుడగు సరఫరాజు ఖానుడు ప్రయత్నించెను కాని పూర్తిగా నోడి పోయెను.

## కనకగిరి

ఇది రాయచూరు జిల్లాలో ముద్గలునకు ముప్పది మైళ్ల దూరమున నున్నది. విజయ నగర రాజ్యమునకు సామంతుడైన యొక పాలిగారుని రాజధాని. ఈతడు రాయచూరు జిల్లాలో జాల భాగము నాక్రమించి యుండుటయే గాక ఆనగొంది గుట్టలలో నారు దుర్గములను గలిగియుండెను. వెనుకటి నైజాముల కాలములో నాపాలెగారుని వంశస్థులు సంస్థానము నేలుచుండిరి. వీరిలో నొకరు తిరుగబడి దోమకొన సాగి నందున బట్టుకొనబడి చంపబడి సంస్థానము నైజాము రాజ్యములో గలపబడెను. ప్రస్తుతము పాలిగారుని వంశస్థునకు ఒక జాగీరున్నది. కనకగిరిలో పెద్ద దేవాలయమును, జుట్టు పట్ల చక్కని నీటిస్థానములును గలవు.

## కల్యాణి

కళ్యాణి యనునది గుల్బర్గా జిల్లాలో నున్న యొక పురాతన పట్టణము. నర్మదా తుంగభద్రానదులకు మధ్య నుండిన కుంతల దేశము నేలిన చాళుక్య రాజధానులలో నొక్కటి. ఇది యాంధ్రులకు సంబంధించిన ప్రదేశము.

ఈ నగరము ఎప్పుడు నిర్మితమైనదో సరియైన చరిత్రాంశములు తెలియవు. క్రీ. శ. ఆరవ శతాబ్దములో చాళుక్య రాజగు పులకేశి, చోళ రాజధానియగు కాంచీపురమును ధ్వంసము చేసినందున, చోళ రాజు కల్యాణిని నాశనము చేసినట్లు ఒక శాసనము వల్ల తెలియుచున్నది. మరియు పదియవ శతాబ్దములో రాష్ట్రకూట రాజగు రెండవ అకాలవర్షుడు ఈ "ప్రసిద్ధమై వైభవోపేతమగు యిన కల్యాణి"ని స్వాధీనము చేసికొనుటకు ప్రయత్నించినట్లు కనబడుచున్నది. దీనినిబట్టి కల్యాణి క్రీ.శ పదియవ

ముల క్రింద యవనాశ్వలను రాజు ఇచట రాజ్యము చేసినటులను, అతని రాజధాని దౌలతాబాదు కోటనుండి రౌజా వఱకున్న స్థలము నాక్రమించినటులను చెప్పెదరు. వెనుకటి కాలపు పురాతన చెఱువు లిచ్చట అనేకములున్నవి. రౌజా, ఔరంగబాదు పట్టణముల నిర్మాణమున కుపయోగింపఁబడిన పాషాణములు పైపట్టణపు శిథిలముల నుండియే యుపయోగింపఁ బడినవని యిచ్చటనున్న పురాతన మందిరముల రాళ్లు ఇటుకలు సూచించు చున్నవి.

## గుల్బర్గా

గుల్బర్గా యిప్పుడు ఆ పేరే గల జిల్లాకు ముఖ్యపట్టణముగానున్నది. ఇది యిప్పుడు జి. ఐ. పి. రైల్వే లైను మీఁద నున్న గొప్ప స్టేషను. ఇది యొకప్పుడు కృష్ణరాయల వీరవిహారమునకుఁ దావలమైన భూమి. పూర్వకాలమునందు వలెనే నేఁటి కాలమునందును ప్రసిద్ధి చెందిన ప్రదేశము.

ఈ పట్టణము "కలబరిగి" యని యాంధ్ర ప్రబంధములందుఁ బేర్కొనఁ బడినది. దీని జన సంఖ్య ౩౫,౭౨౦ ఇత్వాడీ పురము గుల్బర్గా సూఫీలకు ప్రధాన స్థలము.

ఈ పట్టణమును మహమ్మదీయులు వశపఱచుకొనుటకుఁ బూర్వము, ఇది ఓరుగల్లు హిందూ రాజుల రాజ్యములోనిదై విశాలమగు నగరముగా నున్నట్లు కొన్ని చరిత్రాంశములు గలవు. మహమ్మదీయులు ఓరుగల్లు రాజులను జయించిన సందర్భమున "గుల్బర్గా" నామము చరిత్రయందు మొట్టమొదటఁ బేర్కొనఁ బడినది. క్రీ. శ. ౧౩౪౭ లో మొంగలులకును, బహామని రాజులకును గుల్బర్గా యాక్రమణమును గూర్చి గొప్ప యుద్ధము జరిగెను. ఈ సంగ్రామమునందు బహామని రాజగు జఫరు ఖానుఁడు జయించి, గుల్బర్గాను తన రాజ్యమునకు రాజధానిగాఁ జేసికొనెను. ఈ జఫరు ఖానుఁడే "అల్లాయుద్దీన్ హాసన్ గంగూ బహామని" అను పేరుతో బహామని వంశమూల పురుషుఁడయ్యెను. గుల్బర్గాయందుఁ దన స్థానమును నిలుపుకొనుటకు, బహామని రాజులును, దాని నాక్రమించుటకు వరంగల్లు, విజయనగర రాజులును ఘోరముగాఁ బోరిరి. ఉభయ పక్షములును జయాపజయముల పాలయిరి.

క్రీ. శ. ౧౫౧౮ లో గుల్బర్గా విజాపుర నవాబుల స్వాధీనమయ్యెను. మొంగలు చక్రవర్తుల సేనాపతులు అనేకసారులు దీనిపై దండెత్తిరి. క్రీ. శ. ౧౬౫౭ లో మీర్జుమ్లా యను సేనాపతి యాక్రమించెను. ఔరంగజేబు మరణానంతరము స్వాతంత్ర్యము ప్రకటించిన నిజాముల్ ముల్కు ఏలుబడిలోనికి వచ్చెను.

బహామని రాజగు అహమ్మదుషావలీ (క్రీ. శ౧౪౩౫) రాజధానిని బీదరుకు మార్చిన తరువాత గుల్బర్గా ప్రాముఖ్యము తగ్గెను. గుల్బర్గా నేలిన రాజులు కట్టిన భవనములు మసీదులు క్రమక్రమముగా శిథిలము లయ్యెను. ఈ కట్టడములన్నియుః చక్కని శిల్పకళా సౌందర్యము గలవి.

కొంత కాలము క్రిందటివరకు నిర్జనమై, పాడుబడి యుండిన ప్రదేశము ఇప్పుడు పూర్వాను భవనములను నమ్ముటకు వీలులేనంత సుందరముగా నున్నది. రైల్వేస్టేషను నుండి చక్కని భవనములు రమ్యోద్యానములు, అధికారుల మందిరములు వ్యాపించి యున్నవి. కాలపురుషుని మహాశక్తిమునకు నల్లగనున్న పురాతన దుర్గము, ధవళకాంతుగల మందిరముల మధ్యనుండి నగరమున కొక విధమయిన శోభను చెప్పుచున్నది. నగరప్రవేశమునకు ఈ మధ్య నిర్మితమయిన సొంపయిన ద్వారము గలదు.

గుల్బర్గాలో దర్శనీయమయిన ప్రదేశము చెఱసాల. ఇది యాధునిక పద్ధతులపై నిర్మాణమైనది. ఇందు ఖయిదీల నివాసమునకు పరిశుభ్రమగు గదుల శ్రేణులు, వస్త్రములు నేయుటకు, గుడారములు కుట్టుటకు, సోడావాటరు సిద్ధము చేయుటకు, కాగితముల పరిశ్రమకు, తివాచుల నల్లుటకు వివిధ భవనములు గలవు. ఖయిదీలచే తనే చెరసాల కట్టింపఁ బడినది. ఖయిదీల చేతనే యిచ్చటి వస్తువులు సిద్ధముచేయఁ బడుచున్నవి. ఇచ్చట సిద్ధమయిన వివిధ వస్తువుల విక్రయము వలన, సర్కారు వారికి జయిలు వ్యయములుపోఁగా మంచి లాభము వచ్చుచున్నది. ఇట్లు లాభప్రదమయిన సంస్థ హిందూదేశములో నిది యొక్కటియే.

౫౦౦ సం॥ నుండి గుల్బర్గా నేలిన రాజుల గోరీల శేషములు సుందరమైనవి గలవు. ఈ గోరీలకు సమీపములో బందా నవాజు దర్గా కలదు. ఇది క్రీ. శ. ౧౬౨౦ లో నిర్మితమై నట్లు తెలియుచున్నది. ఇది యొక మహమ్మదీయ మహాత్ము

ని సమాధి. మహమ్మదీయులు దీని నెక్కువగఁ బూజ్యభావముతోఁ జూచెదరు. ఈదర్గాలోని యంతర్భాగమునకు మహమ్మదీయులను దప్ప నితరులను బోనియ్యరు. మహమ్మదీయ ప్రభువులు నేపలీ దర్గాకు బహుమానములు నెక్కుఁగానించి యున్నారు. ఈదర్గా యుత్సవము ప్రతి సంవత్సరము సెప్టెంబరులో మహావైభవముతో జరుగును. నిజాం ప్రభువు వారు ఉత్సవసందర్భమున దర్గాను దర్శించి భక్తి పూర్వకముగ నెుక్కులను జెల్లించెదరు. ఈదర్గాకు సమీపమునకే రుకునుద్దీన్ యోగిదర్గా, సిరాజుద్దీన్ దర్గా, చోరుగుంబదు, అను ప్రదేశములు గలవు.

గుల్బర్గాకోట శిథిలావస్థలో నున్నది. ఈకోటలో నొక హిందూ దేవాలయము మసీదుగా మార్చఁబడినది గలదు. కోటలో అసంపూర్తిగ నిర్మితమయిన గొప్ప మసీదు గలదు. దీని పనితనముయొక్క శ్రేష్ఠత్వమును గూర్చి విద్వాంసులు మిక్కిలి పొగడియున్నారు.

గుల్బర్గాయందు శరణు బసవప్ప దేవాలయము గలదు. ఇది దక్షిణ హిందూస్థానములోని లింగధారులకు ముఖ్యయాత్రాస్థలము.

## గౌతల

ఇది, ఔరంగాబాదు జిల్లాలోని కన్నడీ పట్టణమునకు ఉత్తరమున నేడుమైళ్ల దూరముననున్న యొకగుట్ట. దీని పశ్చిమ భాగమునుండి ఖాందేశమునకు బోవు లోయయు, లోయ శిఖరము నొద్ద నొక సుందరమైన చెఱువుయొక్క శిథిలములున్నవి. దీనిసమీపమున గౌతల గ్రామపు చిహ్నములు గానఁబడుచున్నవి. ఈచెఱువుకుఁ దూర్పున లోయకు నూరడుగుల యెత్తున నొకచిన్న శిఖరమున్నది. ఇది యే కొన్ని శతాబ్దముల క్రింద గౌతమ ఋషి నివసించుచుండిన స్థలమని చెప్పెదరు. దీనికెదుట నజంటా, యెల్లోరా గుహలను బోలు నాలుగు గుహలున్నవి. ఇవి కూడ నాఋషియును నాతని శిష్యులును దయారు చేసిరని చెప్పెదరు.

## చితాపూరు.

చితాపూరు రాయచూరు జిల్లాలో ముద్గల్లునకు పశ్చిమోత్తరమున ౧౩ మైళ్ల దూరమున నున్నది. ౧౫౬౫ సంవత్సరములో విజయనగరపు రామరాజును, గోల్కొండ, అహమ్మదునగరు, బీజపూరు రాజులును బోరాడిన తాలి కోటకుఁ గడు సమీపమున నుండుటచేఁ బ్రసిద్ధిఁ జెందినది. యుద్ధరంగము తాలికోట గ్రామమునకు ముప్పది మైళ్ల దూరమున నున్నది, చితాపూరు సమీపమున రాక్షసి, తుంగుదల్ పద్ద కృష్ణానదికి కాలిదారి యున్నది. అచ్చట హిందువులు బలిష్ఠమగు కోటలను గట్టిరి. వాటి చిహ్నము లిప్పటికి నున్నవి. చితాపూరునకు అవలి యొడ్డున సుల్తానుపూరు పద్ద మహమ్మదీయులు విడిసిరి. అచ్చటి వారు దాఁటి వత్తురని యూహతో అచ్చటి హిందువులు తమ సైన్యముల నెక్కువ చేసిరి. కనుక నితర కాలిదారులలో సైన్యము లు సన్నగిలెను. దానిని లాభముగాఁ గొని మహమ్మదీయులు రాత్రులందు తటాలున వచ్చి, నదిని దాఁటి మరుసటి దినమున తాలికోట యుద్ధము చేసి హిందూ సైన్యమును వారి రాజును నాశనము చేసిన యుద్ధరంగము చితాపూరునకు కొన్ని మైళ్ల దూరముననే యున్నది.

## జలదుర్గము.

ఈ కోట ముద్గల్లున కుత్తరమున పదునారు మైళ్ల దూరమున కృష్ణా నదిలోని యొక పెద్ద ద్వీపపు పశ్చిమ భాగమున నున్నది. పరిసర ప్రాంతముల శాసనములు ఇది పండ్రెండవ శతాబ్దాంతమున దేవగిరి యాదవులచేఁ గట్టఁబడి నటుల దెలుపు చున్నవి.

## జాల్నా

దక్కనులో నతి పురాతనమగు పట్టణములలో నొకటి. కండ్లికనది యొక్క కుడి గట్టుమీఁద నున్నది. ప్రస్తుతపు జనసంఖ్య ౧౬౯౧౨. ఎచ్. జి. వి. రైల్వే మీఁది స్టేషను. ఇచ్చట సీతారాములు తమ వనవాస కాలమున నివసించిరనియు నప్పుడు ఇది మొదట జానకీ పురమని పిలువఁబడు చుండెననియుఁ జెప్పుచు వారు నివసించిన స్థలమును జూపెదరు. ఒక మహమ్మదీయ వర్తకుఁడు చాల ధనమును వెచ్చించి పట్టణమును బాగుచేయించి జాల్నా యను పేరునుఁదరువాతఁ బెట్టెను. అక్బరు కాలములో (౧౫౫౬—౧౬౦౫) వాతని సరదారులలో నొకరి



నిలయపుసభ్యులు-శతావధానులగు చళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు.

జాగీరుగా నుండెను. యువరాజగు సలీము కోరిక ననుసరించి చంపఁ గొట్టఁబడిన "అయినె అక్బరీ" అను పుస్తక గ్రంథకర్తయగు అబుల్ ఫజల్ కొంతకాలమిచట నివసించెను. ఈతఁడు దానియల్ యువరాజునకు వ్రాసిన యుత్తరములు జాల్నానుండి వ్రాయఁబడినవి. ఔరంగజేబుకూడ సింహాసనారూఢుఁడగుటకు మును ఇచ్చట కొంతకాలము నివసించెను. తరువాత మొగలులకు మహారాష్ట్రులకును దఱుచుగ యుద్ధ రంగమయ్యెను. తుదకు అస్సే యుద్ధము తరువాత నైజాము క్రిందికి వచ్చి యిప్పటికిని నైజాము రాజ్యములోనున్నది.

మలికాంబరు ప్రతినిధిగా నుండిన జంషీదు ఖానుచేఁ గట్టఁబడిన జామా మసీదును, మొదటి నైజాముచేఁ బదునెనిమిదవ శతాబ్దములోఁ గట్టఁబడిన కోటయు, గణపతి, భైరవ, పదునెనిమిదవ శతాబ్దాంతమున జీవించిన ఆనందస్వామి యొక్క దేవాలయములు దర్శింపఁ దగినవి. ఇచ్చటి వారిజ పళ్లు ప్రసిద్ధియైనవి.

## తుల్జాపురము

ఇది ఉస్మానాబాదు జిల్లాలో నున్నది. ప్రస్తుత జనసంఖ్య ౫౯౨౨. ఇచ్చట నున్న ప్రసిద్ధిఁజెందిన "తుల్జ లేక భవాని" దేవి ఆలయము పేరటనే యీ పట్టణము కట్టఁబడినది. ఇచ్చటి మూఁడు కట్టడములు ముఖ్యమైనవి. మొదటి దానిలో మహాదేవుఁడును, రెండవ దానిలో దేవియొక్క శయ్య, నగలు, ద్రవ్యమును, మూఁడవ దానిలో దేవియు నున్నవి. ఈమూఁడును పదునారవ శతాబ్దపు తరువాతవని యభిప్రాయపడుచున్నారు. ప్రతి రాత్రియు బ్రాహ్మణులచే దేవియొక్క పవళింపు ఉత్సవము జరుగును. పశుపు మీఁద బయలు గౌరవము దేవికియేఁ జెంది యున్నది. కాన మహమ్మదీయుఁడు కాని హిందువుకాని పశువు మీఁద శయనించ రాదని నొక కథకలదు. కర్నల్ మెడోస్ ఇచ్చట ననేక సంవత్సరములు నివసించి తన "తారా" అను నవలలో ఈపట్టణముయొక్క చరిత్రను అందముగను, బూర్తిగా వర్ణించినాఁడు. క్రీ. శ. ౧౬౫౮ లో నిప్పటి దేవాలయము బీజాపూరు రాజ్యపు సేనాధిపతియగు అఫ్జలు ఖానుచేఁ దోచికొనఁబడెను తరువాత శివాజిచే జంపఁబడి యాతనికిఁదుంచి శిక్ష దొరకెనని జను లిప్పటికిని సంతసించుచున్నారు.

## దేవ పర్గము

రాయచూరునకు వాయువ్య మూలనరెండు మైళ్ల దూరమున నున్నది. ఒకానొక పాలిగారుని నివాసస్థలము గా నుండెను. అతనిచేఁ గట్టబడిన బలిష్ఠమైన కోట కలదు. మొదటి నైజాము ఈతని సహాయమును బొందెను. ఈ కోట కడపటి ఏలిక తన బలము రాను రాను క్షీణించుటను నెఱిఁగి దుర్గముననుఁ దనకుటుంబము నంతటిలోఁ గొలువుఁదీర్చి చుట్టుఁ బ్రాగ నారంభించెను. అది కొంత కాలిన తరువాత నదివరకే నేర్పఱుపఁబడిన తుపాకి మందులో నా చుట్టను బారవేయఁగా నది మంచి సకుటుంబముగా భస్మీపటలమయ్యెను.

## దౌలతాబాదు

దీనినిఁ బూర్వ కాలములో హిందువుల స్వాధీనమందున్నప్పుడు "దేవగిరి" యని పిలుచుచుండిరి. ఢిల్లి చక్రవర్తియగు మహమ్మదు తుఘ్లకు తన రాజధాని నిచ్చటికి మార్చినప్పుడు దీనికి దౌలతాబాదు అని నామకరణము చేసెను. ఇట్లు క్రీ. శ ౧౩౩౯ నుండి దేవగిరి దౌలతాబాదు అనియే వ్యవహరింపఁబడుచున్నది.

పదునెండవ శతాబ్దారంభమునఁ జాలుక్యుల పతనానంతరము, వారికి సామంతులుగా నుండిన యాదవులు స్వతంత్రులై దేవగిరినిఁ దమ రాజధానిగాఁ జేసికొనిరి. రామదేవుఁడను యాదవరాజు (క్రీ. శ ౧౨౯౪) పరిపాలించుచున్నప్పుడు అల్లాఉద్దీన్ ఖిల్జి దేవగిరిని ముట్టడించి, దుర్గాధిపతిని నోడించెను ఇట్టి జయమును బొందుటకు అల్లాఉద్దీనుని మాయోపాయములును, అసత్య ప్రకటనములును గారణమైనవి. రామదేవుని కొమరుఁడు శంకరుని రాజ్యకాలమున మలిక్ కాఫూరు దేవగిరిపై దాడివెడలి దేవగిరి రాజ్యమును ధ్వంసము చేయుటయే గాక, రాజును జంపి దేవగిరిని స్వాధీనము చేసికొనెను (క్రీ. శ. ౧౩౧౨). ఢిల్లిలోని గంద్రగోళములను బురస్కరించుకొని, రామదేవుని యల్లుఁడగు హరపాలుఁడు ఇదే సమయమని తిరుగఁబడి మహమ్మదీయ సైన్యమును వెళ్ల

గొట్టి దేవగిరిని, ఇతర దుర్గములను ఆక్రమించి, దక్షిణాపథ రాజ్యాధిపతిగాఁ బ్రకటించుకొనెను. కావున ఢిల్లీ చక్రవర్తియైన కుతుబుద్దీన్ దేవగిరిపై దండెత్తెను (క్రీ. శ. ౧౩౧౭) హరపాలుఁడు, వాని యనుచరులు పలాయితులుకాఁగా, సుల్తాను వారినిఁ దరిమి పట్టుకొని, చర్మము లొలిచి చిత్రవధ గావించెను. ఇంతటితో యాదవ వంశము అంతమొందెను.

క్రీ. శ ౧౩౩౭ లో ఢిల్లీ చక్రవర్తియయిన మహమ్మదు తుఘ్లకు దేవగిరిపై గల మోహముచే దానిని తన రాజధానిగాఁ జేసికొనెను. ఢిల్లీలోని సకల జనులను దీసికొని దేవగిరి వచ్చిన సుల్తాను గారి చరిత్రము ఈ సందర్భమున విచిత్రమైనదిగా వర్ణింపఁబడినది. దేవగిరి యందుఁ బ్రవేశించిన తరువాత సుల్తాను దానికి దౌలతాబాదని నామకరణము చేసెను. దౌలతాబాదునం దనేక కట్టడములను గట్టించి, రాజమార్గములను వేయించి, కోట చుట్టు చక్కని కందకముఁ ద్రవ్వించి, యనేక విధముల నగరమును వృద్ధి పఱచెను.

దేవగిరి క్రొత్త రూపమును దాల్చుటకుఁ బూర్వము వేర్వేరు వృత్తుల వారు నివసించెడి వేర్వేరు వాడలనేకము లుండెను. ఆయా వాడలలో సైన్యము, ఉద్యోగులు, విద్వాంసులు, వర్తకులు, ఫకీరులు నివసించుచుండిరి. ప్రతి వాడయు జనానుకూలములగు మసీదులకు, గోపురములకు, అంగళ్లకు, బావులకు, కూలివాండ్రకు నిలయమై యుండెను. ఒక్కొక వాడ ఒక్కొక నగరమే.

మహమ్మదు తుఘ్లకు రాజనీతి విహీనతచే బహామని రాజులు తిరుగఁబడి దేవగిరిని స్వాధీనము చేసికొనిరి. బహామని వంశము క్షీణించిన తరువాత దేవగిరి అహమదు నగరు నిజాం షాహీల పాలనలోనికివచ్చి, ౧౬౩౬ లో మొగలుల వశమై, తరువాత అసఫుజా నిజాముల్ ముల్కు స్వాధీన మయ్యెను.

పురాతన దేవగిరి పట్టణపు చిహ్నములుగా నిపుడు కొన్ని కొంపలు మాత్రము గలవు. ఇచ్చటఁ బ్రసిద్ధికెక్కినది దౌలతాబాదు దుర్గము. ఇది ౬౦౦ అడుగుల యెత్తు గల యొక గుట్టమీఁదఁ గట్టఁబడినది. దీనికి రెండు ద్వారములు గలవు. కోట మీఁద ప్రచండమైన తోపి గలదు. దీని పేరు సరస్వతి. ఇందింకను పెక్కు రాతి బొమ్మలు, మసీదులు, శిధిలావస్థలో నున్న చక్కని హిందూ దేవాలయము, శిఖరములు మహాలులు గలవు. కోట చాలవరకు అరణ్యమయముగా నున్నది.

ఇచ్చటు చూడఁ దగిన ప్రదేశములలో ఔరంగజేబు కట్టిన మినారా యొకటి. ఇది మహమ్మదీయ శిల్పమునకు మంచి సాదృశ్యము. ఈ మినారాకు సమీపమున జైన దేవాలయ శిథిలములుగలవు; ఇది యిప్పుడు కారాగారాలయముగా మారినది. పదునైదవ శతాబ్దములోఁ బ్రఖ్యాతి కెక్కిన జనార్దన స్వామివారి గుహ యొకటి కోట శిఖరి మందుఁగలదు. దక్కనునుండి యాత్రికు లనేకు లిచ్చటికి కేతెంచు చుందురు.

## ధారాసివన (ధారాసిం)

ధారాసివన ఉస్మానాబాదు జిల్లాలో ఉస్మానాబాదు పురమునకు రెండు మైళ్ల సమీపమున నున్న కనుమలో ఏడు గుహాలకుఁ బ్రసిద్ధిఁజెందినది. కనుమకు ఉత్తరపు వైపున నున్న నాలుగు గుహాలు జైన సాంప్రదాయమునకును వానికెదుటనున్న మూఁడు వైష్ణవ సాంప్రదాయమునకుఁ జెందినవి. ఉత్తరభాగపువాటిలో ముఖ్యమైన గుహయందు బాసికపెట్టులోను అరచేయిపైకి యుంచి యొడిమీఁద నుంచిన చేతులతోను యోగదీక్షలో నున్న యిరువది మూఁడవ తీర్థంకరుఁడగు పార్శ్వనాథుని విగ్రహ మున్నది. ఎదుట రెండు జింకలు చెక్కఁబడినవి. ఈగుహాలు సుమారు క్రీ. శ. ౬౫౦ లోఁ దొలుచఁబడియుండునని నిర్ణయింపఁబడినది. ఈజిల్లాలోనే „కరుసువా” గుహాలున్నవి. వానిలో సముద్రపు మథనము చెక్కఁబడి యున్నది.

## నల్ దుర్గము.

నల్ దుర్గము ఇప్పుడు ఉస్మానాబాదు అని పిలువబడుచున్నది. కల్యాణిపట్టణమునకు ౪౦ మైళ్ల దూరమున నున్నది. మహమ్మదీయ దండయాత్రకు ముందు దీని యజమానుఁడగు నొకహిందూరాజు కల్యాణి చాళుక్యులకు సామంతుఁడుగ నుండె నని స్థానిక కథతెలుపుచున్నది. ఇచ్చట మహాయున్నతమైన కోటకలదు. తరువాత బహ

మినీ రాజ్యమునకుఁ బశ్చిమపు ఎల్లయందలి బలిష్ఠమైన దుర్గములలో నొకట్టిగా నుండి బహమినీ రాజులచేఁ జాల బాగుచేయింపఁ బడెను. క్రీ. శ. ౧౫౨౦ లో బహమినీ రాజ్యము తునకలైన తరువాత ఈదుర్గము బీజపూరు ఆదిల్‌షా రాజుల క్రిందికి వచ్చెను. వారును దీనిని జాల వృద్ధిపరచిరి. అహమ్మదు నగర బీజపూరు వారికి ఎల్లపుడును ఈ కోటకయి వివాదగ్రస్తముగా నుండెను. తరువాత మొగలురాజ్యపు సొత్తై దానిక్షీణత తరువాత నైజామునకు వచ్చెను. రాయచూరు దోఆబుతోఁ బాటు నీ జిల్లా క్రీ.శ. ౧౮౫౩ సంధి ననుసరించి ఇంగ్లీషు వారి కియ్యబడెను గాని మరల క్రీ శ. ౧౮౬౦ లోఁ దిరిగి నైజామునకు ఇచ్చివేయఁ బడెను.

## నాందేడు.

ఇప్పుడు నాందేడు జిల్లా ముఖ్య పట్టణము. జనసంఖ్య ౨౧౪౩౦. ఎచ్.జి.వి ఆర్. మీఁద నున్న స్టేషన్. గోదావరి నది యొడమ యొడ్డున నున్నది.

„షాజహానా నామా" యను పుస్తకములో నిది తెలంగాణమునకు రాజధానిగా నుండినటుల వ్రాయఁబడినది. దీనికి నందగిరి యని వెనుకటి పేరు. ఇచ్చటి కోట శిథిలావస్థలో నున్నది. చాళుక్య రాజగు నందుఁడు ఇచ్చట రాజ్యము చేసెననియు నితని సంతతి వాఁడగు మాధవ వర్మ కాకతీయ వంశ స్థాపకుఁడనియుఁ బ్రతాప చరిత్ర తెలుపుచున్నది. ఏడవ శతాబ్దమందు నిది మహారాష్ట్రులకు ఉనికి పట్టుగా నుండెను. నాందేడు సమీపమున మలికాంబరు అక్బరు సేనాధిపతిచే ౧౬౦౩ లో నోడింపఁబడెను. ౧౬౩౧ లో మొగలు సైన్యాధిపతియగు ఆసఫ్ ఖానుఁడు బీజపూరునకు నాందేడు మీఁది నుండియే బోవుచుఁ గొన్ని దినము లిచ్చట నివసించెను. ఔరంగజేబు మరణానంతరము బహాదుర్‌షా హైదరాబాదునకుఁ బోవుచుండఁగా శిక్కు మత స్థాపకుఁడగు నానకు మనుమఁడు గురు గోవిందుఁడు (సిక్కుల పదియవ గురువు) రెండుమూఁడు వందల సైన్యముతో నాతనిఁ జేరవచ్చెను. గురు గోవిందుఁడు సదా మతోన్మాదులకును, ప్రాపంచికులకును వివిధ జనాళికిని నుపన్యాసము లిచ్చుచుండెడి వాఁడు. ఒకనాఁడు గోవిందుని పాటల సహింపఁజాలక ఒక యఫ్ఘనుఁడు అతనిని నిచ్చట బొడిచి చంపెను. (౧౭౦౮) ఈతని గోరితో „గురుద్వార" మను సిక్కుల గుడి కట్టఁబడినది. దేవాలయముకదు సుందరమైన వెండి రేకుల ద్వారములతో నొప్పుచున్నది. ఇచ్చట సిక్కుల జనసంఖ్య యెక్కువ. వారికొరకు నొక కాలేజి ప్రజల చందాలచే నడుపఁబడుచున్నది. అనేక కర్మాగారములను గలిగిన ఈ పవిత్ర పట్టణమునకు హిందూదేశము నంతటి నుండియు యాత్రికులు వచ్చుచుందురు.

## నిర్మల.

ఇది ఆదిలాబాదు జిల్లాలోనున్నది. డిచ్చిపల్లి స్టేషను నుండి జనులు పోయెదరు. మొదట గోల్కొండ నవాబులకును, తరువాత నైజాములకును గప్పము కట్టుచుండిన యొక సామంతరాజు యొక్క దుర్గము. క్రీ.శ. ౧౭౫౨ లో మహారాష్ట్రుఁడుగా నుండిన ఇచ్చటిరాజు మరికొందరినిఁ జేర్చుకొని ఔరంగబాదు నుండి గోలకొండకు బుస్సీతోఁ బోవుచున్న నైజాము సలాబతు జంగు నెదుర్కొనెను. నిర్మల యొద్ద యుద్ధము జరిగి రాజు చంపఁబడెను. తరువాత నైజామునకుఁ జెందిన ఫ్రెంచి యధికారులు కోటను బాగుచేసిరి. నిర్మలకుఁ గొన్ని మైళ్ల దూరమున గోదావరినది ప్రవహించుచున్నది.

## పరెండా.

ఇది ఉస్మానాబాదు జిల్లాలో నున్నది. కురడ్వాడి స్టేషను నుండి జనులు వెళ్ళెదరు. ఇచ్చట నున్న బలిష్ఠమగు కోట బహమని రాజ్యపు సుప్రసిద్ధ మంత్రియగు మహమ్మదు గవానునిచేఁ గట్టఁబడినది. క్రీ. శ. ౧౬౦౫ లో అహమదు నగరము మొగలులచేఁ స్వాధీన పరుచుకొనఁబడిన తరువాత వారి రాజధాని పరెండాకుఁ గొలది కాలము వరకు మార్పఁబడెను. పరెండాను గూడ ముట్టడించుటకు వారు ప్రయత్నముఁ జేసి యప్పుడు నిష్ఫలులైరి. చివరకు ఔరంగజేబు దక్కనులో యువరాజుగా నున్నపుడు దీనినిఁ బూర్తిగా నాశనముఁ జేసెను. ౧౭౦౭ లో అహమ్మదు నగరమున ఔరంగజేబు మరణ వార్త యతని కుమారుఁడు కాంబక్షు పరెండాలో నే వినెను.

## పైఠణ్.

ఇది ఔరంగాబాదు జిల్లాలో గోదావరీ తీరమం దున్న ఒక పురాతన పట్టణము. దీనికి హిందూ వాఙ్మయ మునందు ప్రతిష్ఠాన పురమని ప్రసిద్ధి కలదు. మంగి పైఠణ్ అనియు, బ్రహ్మపురి ప్రతిష్ఠాన మనియు నామాంతరములు కలవు. ఈ పట్టణ మెప్పుడు నిర్మాణమయినదో ప్రామాణిక చరిత్రాంశములు గనబడవు. అశోకుని యొక్క శాసనమునందు ఈ పురమును, ఈ రాజ్యమును జయించినట్లు గలదు. క్రీ. శ. మొదటి శతాబ్దములో ఆంధ్ర రాజులకు రాజధానిగా నుండెను.

హిందూ పురాణ గాథలను బట్టి ఈ నగరము బ్రహ్మచే నిర్మింపబడెను. బ్రహ్మ దేవుడు దీనికి "బట్టణ" మని పేరిడెను. అనంతరము వృద్ధిలోనికి వచ్చిన యితర పట్టణముల ప్రసిద్ధిని జూచి యోర్వలేక, దీనికి "ప్రతిష్ఠానము" అని నామకరణము చేసెను. ఈ కారణమున దీనికి మిగుల పవిత్రత వచ్చెను. ఈ వివరములన్నియు "ప్రతిష్ఠానమాహాత్మ్య" మను స్థల పురాణమునందు గలవు.

బ్రహ్మ తరువాత శాలివాహనుడు దీని కధిపతియయ్యెను. ఈ శాలివాహన వంశజులే "ఆంధ్ర భృత్యుల"ను పేరుతో రాజ్యమేలిరి (క్రీ. శ. ౧౫౦). ఆంధ్ర భృత్యుల యనంతరము "శాతకర్ణి వంశజులు" అధిపతు లయిరి. వీరందరు నాంధ్రులే, ఈ యాంధ్ర రాజుల పరిపాలనము ప్రతిష్ఠానము నుండి కృష్ణా తీరము నందలి అమరావతి (ధరణి కోట) వరకు వ్యాపించి యుండె ననుటకు నిదర్శనములు గలవు. ఆంధ్ర శాతకర్ణుల యనంతరము నాల్గవ శతాబ్దము నుండి యీ పుర మెవ్వరి యాధిపత్యము క్రింద నుండెనో స్పష్టముగా దెలియదు. అప్పుడు దక్షిణా పథమును కదంబులు, గాంగులు, పల్లవులు ఏలినట్లు గలదు. వీరును, మరికొన్ని సామాన్యరాజ వంశములును తరువాత చాళుక్యులకు లోబడెను. పండ్రెండవ శతాబ్ద మధ్య భాగమున కాలచుర్యులును, తరువాత హోయి సళులును, అనంతరము యాదవులును రాజ్యాధిపతులయిరి. ఈ యాదవ వంశములోని చివర వాడగు రామపాలుని నిధనానంతరము (౧౩౧౮) మహమ్మదీయులు రాజ్యాధికారు లయ్యిరి. అప్పుడు మహమ్మదీయుల సైన్యము ప్రతిష్ఠాన పురమునందే విడిసి యుండెను. పదునాల్గవ శతాబ్దములో అహమ్మదు నగర నిజాంషాహీల వశమయ్యెను. అప్పుడు దీని పేరు మంగి పైఠణ్. తరువాత నిది విజాపురము వారి వశమయ్యెను, క్రీ. శ. ౧౫౯౯ అక్బరు కుమారుడగు దానియాల్ రాజ కుమారునకును, విజాపుర రాజ కుమారితకును పైఠణు నందే వివాహము జరిగెను. తరువాత క్రీ. శ. ౧౭౨౦ లో హైద్రాబాదు నందు క్రొత్త రాజ వంశము ప్రారంభమగు వరకు పైఠణు చరిత్ర యేమియు దెలియరాదు. అప్పుడది యాక్రొత్త రాజ్యమున కొక సూబాస్థాన మయ్యెను. పదునెనిమిదవ శతాబ్దాంతమందు మహాదాజీ సింధియాకును, రాజపుత్ర సైన్యమునకును పైఠణునందే ఘోర యుద్ధము జరిగెను. మహారాష్ట్రులు గెలిచిరి.

పూర్వ కాలమునుండియు పైఠణ్ వర్తక స్థానముగా బ్రఖ్యాతి జెంది యున్నది. కాని యావిశాల నగర మిప్పుడు నామమాత్రావశేష మయినది. శిథిలచిహ్నము లిప్పుడు గూడ గానిపించు చుండును. ఇచ్చట కొంత శిల్పకళ కలదని చెప్పుట కర్హత గలది. మౌలానా సాహెబు దర్గా యొకటియే. ఒకానొక హిందూ దేవత యాగ్రహమున భస్మీపటలము గాకుండ నీ మహమ్మదీయ యోగి యీ పురమును గాపాడియున్నాడట! ఈతని సమాధి ఒక హిందూ దేవాలయ శిథిలములపై నిర్మిత మయినది.

ప్రస్తుతపు నగరములోని మందిరములలో జాల భాగము రెండుమూడంతస్తులు గలవి కొన్నింటికి జాబాలు గలవు. వీధు లిరుకుగను, హెచ్చు తగ్గులుగను నుండును. హిందూ దేవాలయము లనేకములు గలవు. అందు శివాలయమును, ఏకనాథ్ అను హిందూ యోగికి జెందిన రెండు గుహలును చాల ముఖ్యమయినవి. దేవాలయములలో గొన్నింటిని శాలివాహనుడు గట్టించెనని చెప్పెదరు గాని యది విశ్వాసార్హమయిన విషయము గాదు. రెండు దేవాలయములపై ౧౫—౨౦ వేల రూపాయల చొప్పున నాదాయమువచ్చు ఆస్తి కలదు. ఇచ్చటి మసీదులు శిల్పకళకంతగా బ్రసిద్ధి చెందినవి కావు.

మానభావులు (మహానుభావులు) అను నూతన మత సాంప్రదాయమును కృష్ణభట్టను బ్రాహ్మణుఁడు నాల్గవ శతాబ్ద మధ్యభాగమున నిచ్చట స్థాపించెను. ఈతని సిద్ధాంతములు పలువిధ విగ్రహారాధనమును ఖండించి, వేదబోధితమైన ఏకేశ్వరోపాసనమును బోధించును. ఈ సాంప్రదాయికులు సర్వసంగ పరిత్యాగులై, సంసార విముఖులై, శ్వేతవస్త్రములు గైకొన వలెను. వీరికి కృష్ణ భగవానుఁ డొక్కఁడే పూజార్హుఁడు. వీరు సాత్వికాహారులు. ఉదకమే వారి పానీయము.

## ఫుల్మమ్రి.

ఇది ఔరంగబాదునకు ఈశాన్య మూల బదునాఱు మైళ్ల దూరమున ఫుల్మ్రస్త్రానది మీఁద నున్న సుందరమైన మామిడి చెట్లలో నున్నది. ఇచ్చట పురాతన హిందూ దేవాలయము లనేకములు కలవు. దక్షిణపు ద్వారము వద్ద నున్న సంస్కృత భాషా శాసనము చదువుటకు వీలులేనంత చెడిపోయినది. దానిలో ౧౧౬౬ శకము (౧౨౪౪) అనునది మాత్రము తెలియుచున్నది.

## బీదరు.

నైజాము రాజ్యములో బీదరు జిల్లాకు ముఖ్యస్థలము. రామాయణ మహాభారతములలోఁ జెప్పఁబడిన విశాలమైన విదర్భ దేశమున కిదియే రాజధానియని చెప్పఁబడుచున్నది. ఓరంగల్లు రాజులు దక్కనులో నున్నత స్థితిలో నున్నప్పుడు ఇచ్చటి మహాదేవ దేవాలయము మీఁద స్థాపించి యనేక కానుక లర్పించిరి. క్రీ.శ. ౧౩౨౩ సంవత్సరములలో అలఫ్ ఖాన్ వలనను తరువాత మహమ్మద్ తుఘ్లకువలనను నిది ముట్టడింపఁబడెను. ౧౩౪౪ లో బీదరు కోట తుఘ్లకు అల్లుఁడగు ఇమాముల్ ముల్కు తబ్రీజిచే ఆక్రమింపఁబడియుండెను. హసన్ గంగు బహమని యను పేరితో గుల్బర్గా యందు బహమని రాజ్యము స్థాపించిన జఫరుఖాన్ ౨౫,౦౦౦ గుఱ్ఱములతో బీదరు కోటవద్దకు వచ్చెను. వరంగలు రాజునుండి సహాయము వచ్చునంతవఱకు ఇమాముల్ ముల్కు నుండి యతని యుద్ధములను భరించలేదు. ౧౪౩౦ లో పది యవ బహమని రాజగు అహమ్మదుషావలి ప్రస్తుతమున్న పట్టణమును గట్టి కోటను ముట్టడి చేసెను. దక్కనులో బీదరును మించిన ఆరోగ్యకరమైన స్థలము లేదని మేడోస్ టెయిలర్ వ్రాసియున్నాఁడు. అహమ్మదుషావలి యిచ్చట తరచుగా నివసించుచు ౧౪౩౫ లోఁ జనిపోయెను. తరువాత రాజ్యమునకు వచ్చిన అల్లావుద్దీన్ షా యిచ్చటనే రాజ్యరూఢుఁ డయ్యెను. ఈతనికి విజయనగర రాజులకును సదా పోరాటములుఁ జరుగుచుండెడివి. ఈతఁడు ౧౪౫౮ లోఁ జనిపోగాఁ కుమారుఁడు హుమాయూనుషా రాజ్యమునకు వచ్చెను. తెలంగాన రాజు కప్పము నియ్యక తిరుగఁబడుటచే పెద్ద సైన్యముతో నలుగొండకు వెళ్లి కొండవీడు విప్లవకారుల నడంచి వారికి సహాయముగా నుండిన తెలంగానా రాజు నెదుర్కొనెను. ఒరిస్సా రాజు సహాయము వచ్చుటచే నచ్చట జరిగిన యుద్ధములో బహమని రాజునకు గొప్ప యపజయము గలిగెను. ఇంతలో బీదరునందు గడబిడలు జరుగుటచే బహమని రాజు మరలిపోయెను. ౧౪౬౧ లో ఈతఁడు చనిపోగా నతని కుమారుఁడు రాజ్యమునకు వచ్చెను. గాని యెనిమిదేండ్ల పిల్లవాఁడగుటచే మంత్రియగు మహమ్మదు గవానుచే రాజ్యమేలఁబడెను. ఈతని సమయములో ఒరిస్సా తెలంగాణా రాజులు కలిసి బహమని రాజ్యము మీఁద దండు వెడలి కౌలాస్ వరకు దోచుకొనిరి. తరువాత సంధి ననుసరించి తమ దేశములకుఁ దిరిగిఁ బోయిరి. బహమని రాజుల అంతము తరువాత ౧౪౯౨ బీదరు బెరీదుషాహి రాజుల క్రిందికి వచ్చెను. ౧౬౫౬ లో బీదరును ఔరంగజేబు ముట్టడించి యాక్రమించెను. ౧౬౮౭ లో గోల్కొండ బాదుషాయగు తానీషా ఈ బీదరు కోటలోనే ఖైదీగా నుంచఁబడెను. ఇటుల బీదరు మొగలుల క్రిందనుండి వారి రాజ్యమంతరించిన తరువాత నిజాము స్వాతంత్ర్యుఁడైనపుడు అతని రాజ్యములోఁ గలిసి యిప్పుడును నైజాము రాజ్యములో నున్నది. బహమని రాజుల కాలములో కట్టఁబడిన యనేక రాజభవనములు, మసీదులు, తోఁటలు, స్నాన గృహములు తొల్లింటి సౌందర్యమును గోలు పోయినను వాని వెనుకటి యైశ్వర్యమును జాటుచున్నవి. వీటి యన్నిటిలోను మహమ్మదు గవాను మంత్రిచేఁ గట్టఁబడిన "మదరసా" అత్యుత్తమమైనది. రంగు మహాలు రానిగమును బట్టి ఒకప్పుడు హిందూ దేవాలయమై యుండునని యూహింపఁబడుచున్నది. ఇచ్చట పురాతన శాసనాలు,

టర్కీ స్నాన గృహము, మసీదు జూడఁదగినవి. పట్టణమునకు ఈశాన్యపైపు బహమని రాజుల గోరీలను పడమర ద్వార సమీపమున అమీరు బరీదుషా గోరియు నున్నవి. బీదరులో నిప్పుడు బీదరు వేర్ అను చక్కని లోహపు సామానులు చేయఁబడుచున్నవి. హైదరాబాదునుండి బీదరుకు మోటారు సర్వీసున్నది.

## బీడు.

ఇది బెనూరానది యొక్క యెడమ యొడ్డున నున్నది. బీడ్ జిల్లా ప్రధాన స్థలము. చాల పురాతన పట్టణము. కాని చరిత్ర స్పష్టముగాఁ దెలియుటలేదు. కళ్యాణి రాజ్యాధిపులగు చాళుక్యులకును, దేవగిరి యాదవ రాజులకును లోఁబడి యుండిన ఒక హిందూ సామంత రాజునకు రాజధానిగా మొదటనుండెనని చెప్పుచున్నారు. మహమ్మదు తుఘ్లకు యొక్క దక్షిణ ప్రాంతపు ఒక పరగణాగా నుండెను. అతఁడు ౧౩౪౧లో దక్షిణహిందూ దేశమునుండి తిరిగి వెళ్లునపుడు బీడుకు వచ్చి యక్కడ తీసివేయించు కొనిన తన దంతమును సమీపమునఁ బాతిపెట్టి దానిమీఁద నొక గోరీని కట్టించెను. ఇది ఇప్పటికిని మంచి స్థితిలో నున్నది. షాహజహాన్ ప్రభుత్వపు మొదటి దినములలో మొగలులకును, నిజాం షాహీలకును, బీజాపూరు వారికిని జరిగిన యుద్ధముల సందర్భమున ఈ బీడ్ పట్టణము పలుమారు చేతులు మారుచు వచ్చినది. ఇది మొగలుల చేతిలోఁ బడిన తరువాత దిట్టమైన సైన్యముంచబడి దీని సమీపముననే గొప్ప పోరాటము జరిగినది. ఇప్పుడు బీడ్ ఒక విధమైన తోళ్ల చేతి పనికిఁ ప్రసిద్ధి చెందియున్నది.

## ముద్గల్లు.

ఇది రాయచూరు జిల్లాలో కోటను గలిగియున్న పట్టణము. జన సంఖ్య ౮౫౦౭. ముద్గల్లు క్రీ.శ. ౧౨౪౯–౫౦ లో దేవగిరి యాదవుల యొక్క యధికారి క్రింద నుండెను. యాదవ వంశమునకు సంబంధించిన శాసనము అనేకమారీ చుట్టుపట్ల కనఁబడుచున్నవి. ఇది తరువాత ఓరుగల్లు రాజులచే నాక్రమింపఁబడి తదనంతరము పదునాల్గవ శతాబ్దపు మొదటి భాగములో మహమ్మదీయుల క్రిందికి వచ్చెను. మహమ్మదు తుఘ్లకును ధిక్కరించి యాతని సరదారు దక్షిణమున బహమని రాజ్యమును స్థాపించినపుడు ముద్గల్లు ఈ క్రొత్త రాజ్యము యొక్క సరిహద్దు కోటయై పెద్ద సైన్యమున కునికిపట్టుగా నుండెను. దీనినిఁ దీసికొనుటకు హిందూ రాజులు తఱచుగాఁ బ్రయత్నించు చుండిరి. ౧౩౬౬ లో మహమ్మదుషా బహమని రాజునకును విజయనగర రాజునకు, ౧౪౦౬ లో ఫిరోజుషా బహమని రాజునకును విజయనగర రాజునకును నిచ్చటనే యుద్ధములు జరిగెను. బహమని రాజ్యము తరువాత ముద్గల్లు బీజపూరు క్రిందికిఁ బోయెను. ఔరంగజేబు బీజపూరు ముట్టడి తరువాత దీనిని నాక్రమించి కోటను వృద్ధి పరచెను. ఇచ్చట గోవాకు సంబంధించిన రోమను క్యాథలికుల సంఘము కలదు.

## మైసరం.

హైదరాబాదునకుఁ బదిమైళ్ల దూరమున నున్నది. గోలకొండ ముట్టడి తరువాత ఔరంగజేబుచే నాశనము చేయఁబడిన హిందూ దేవాలయ శిథిలముల నేకములున్నవి. వీటినుండియేఁ గట్టఁబడిన పెద్దమసీదు ఇప్పటికినియున్నది. ఇచ్చట దేవాలయపు ద్వారమున కొన్ని భాగములు హైదరాబాదులోనున్న మక్కామసీదు కొరకు వాడఁబడినవి. ఇచ్చట నిప్పుడు సైన్యము కలదు.

## మోమినాబాదు.

ఇది బీడు జిల్లాలో నున్నది. దీనికి వాయువ్య మూల అంబాజోగి యను పురాతన పట్టణము కలదు. అది కళ్యాణి రాజుల సామంతుఁడగు జైతపాలునకు రాజధానిగా నుండెను. ఈ జైతపాలుని వంశములో మొదట నైదుగురు అన్నదమ్ములుండిరనియు వారినుండియే పంచమ జైనులేర్పడిరనియుఁ జెప్పఁబడుచున్నది. వీరిలో తొమ్మిది వేల మంది బసవనికి శిష్యులై యిప్పుడు పంచ లింగాయతులని పిలువఁ బడుచున్నారు. షాహజహాను, ఔరంగజేబు కాలములలో నాశనమైన పట్టణములలో అంబా జోగియు నొకటి. ఇప్పుడిందు జైన, బ్రాహ్మణ దేవాలయములు, ఇతర కట్టడములు, శిథిలములు మాత్రమున్నవి. ఇచ్చట నున్న శాసనమొకటి ౧౧౬౨ శా. శకములో ననగా క్రీ. శ. ౧౨౪౦ లో యాదవవంశ రాజగు రెండవ సింగన (౧౧౮౧–౧౧౬౯) కాలములో వ్రాయఁ

బడినటులఁ దెలియుచున్నది. అతనికి భోళశంకర రామదేవ యను నిద్దరు బ్రాహ్మణ మంత్రు లుండి మొదటివాఁడు మాళవ, ఘూర్జరుల నడంచి అభీర రాజ వంశమును నాశనము చేసినటులను, ఘూర్జరుల మీఁది రెండవ దండయాత్రలోఁ జనిపోగా నాతని చెల్లెలు లక్ష్మి బ్రహ్మపురిలో నాతని పేరుమీఁద రామనారాయణగుడిని కట్టించి నటుల నున్నది.

ఈ శాసనమును వ్రాసినది రాఘవ పాండవీయము వ్రాసిన కవిరాజు అయియుండు నని డాక్టరు బుహ్లార్ గారు వ్రాసియున్నారు.

## రాయచూరు.

దక్షిణ హిందూ దేశములోని పురాతన పట్టణము లలో రాయచూరు ఒకటి యని చెప్పవచ్చును. దీనికి పడమర భాగమున కోట యున్నది. కోట గోడలో నమర్చఁబడి పురాతన తెలుఁగు భాషలో వ్రాయఁబడిన శాసనము (క్రీ. శ. ౧౨౯౪) ౧౩ అడుగుల పొడవును రెండు అడుగుల వెడల్పును గలిగి పది పంక్తులను గలిగి యున్నది. ఈ దుర్గము గోర గంగయ్య రుద్దివరుఅను వీరునిచేఁ గట్టఁబడినటులను, ఆతఁడు కాకతీయ వంశపు రాజగు ప్రతాప రుద్ర దేవునికి „కుడిచేతిగద” యగుటయేఁ గాక ముఖ్య మంత్రిగను సైన్యాధిపతిగను ఉండినటులను దెలియుచున్నది. కోటకు మూఁడు వైపులఁ గందకముచేఁ బరివేష్టింపఁ బడిన రాతి గోడలును, నాల్గవ వైపు ౨౯౦ అడుగుల యెత్తు గల ఒక పెద్ద రాయియు ఉన్నవి. ప్రభువుల మార్పులతోఁ బాటు కోట కూడ ననేక మార్పులఁ జెంది క్రీ. శ. ౧౫౬౩—౧౬౧౯ వరకు మహమ్మదీయుల యధీనములోఁ గడపటి యవస్థను బొందెను.

కాకతీయ సామ్రాజ్యమంతరించిన తరువాత కొంత కాలమునకు రాయచూరు దుర్గము విజయనగర రాజుల సొత్తు అయ్యెను. కాని వారి నుండి గుల్బర్గాధీశు లగు బహామని రాజులచేఁ దీసికొనఁబడి వారి రాజ్యపు సరిహద్దు బలిష్ఠమగు కోటలలో నొకటిగా నుండెను.

దీనిని మరల నాక్రమించుకొనుటకు విజయనగర రాజులు క్రీ. ౧౪౩౫ లో ప్రయత్నముఁ జేసిరి. బహామని రాజును అహమ్మదుషావలితోఁ బోరాడుచున్న యాతని తమ్ముఁడు వీరి సహాయముచే రాయచూరును „దోఅబు” లోని మఱికొన్ని కోటలను సంపాదించి తాము సఖ్యపడిన తరువాత ననేక సంవత్సరములిచ్చుటచే నివసించెను. పదునైదవ శతాబ్దములో బహామని విజయనగర రాజుల మధ్య జరిగిన పోరాటములోఁ బెక్కు ఈ రాయచూరు „దోఅబు” నందే జరిగెను. కర్నల్ మెడొసుటయిలర్ గారు ఇదియే పశ్చిమ హిందువులకును జైనులకును మఱియు మహమ్మదీయులకును హిందువులకును యుద్ధభూమిగా నుండెనని వ్రాసియున్నారు. క్రీ.శ. ౧౪౪౩ లో హిందూ దేశమునకు వచ్చిన ఖోరాసాను రాయబారియగు అబ్దుల్ రజాకు తన దిన చర్య పుస్తకములో విజయనగర రాజునకును అహమ్మదుషా వలీకిని జరిగిన మూఁడుగొప్ప యుద్ధములను చేర్కొని యున్నాడు. పదునైదవ శతాబ్దాంతమందు బహామని రాజుల బలము క్షీణించిన తరువాత నాదిల్‌షాహి పాలనములో నున్న బీజాపూరు సంస్థానములో నిది కలుపఁబడెను. క్రీ. శ. ౧౫౧౯ లో మరలనిది విజయనగరపు రాజులచేఁ జయింపఁబడి దీనితోఁ బాటు మరికొన్ని కోటలు కూడ నాక్రమింపఁ బడెను. ఇస్మాయిల్ ఆదిల్‌షాహా వీనికొఱకుఁ జేసిన కృషినిష్ఫల మగుటచే నిదివిజయనగరపు వారికిందనే కొన్ని సంవత్సరముల వరకుండెను. గోల్కొండ, బీజపూరు రాజ్యములు ఔరంగజేబుచే గెలువఁబడిన తరువాత, రాయచూరు కూడ మొగలుల యాధీనములోనికి వచ్చి వారి రాజ్యపుక్షీణతతో హైదరాబాదు నిజాముల పాలన క్రిందికి వచ్చెను. క్రీ. శ. ౧౮౫౩ లో జరిగిన యొడంబడిక ననుసరించి రాయచూరు దోఅబు, మరికొన్ని జిల్లాలతో సహా బ్రిటిషు వారికీయ్యఁబడెను. కాని ౧౮౫౭ లో సిపాయిల తిరుగు బాటులో నైజాము ఇంగ్లీషు వారికి నిశ్చలమగు రాజభక్తితో నొసరించిన సహాయమునకుఁ బ్రతిఫలముగా నితరప్రదేశములతో బాటు రాయచూరు జిల్లా నైజామునకుఁ దిరిగి యియ్యఁబడెను.

ప్రస్తుతము కోటగోడలోని కొంతభాగముచే రాయచూరు పట్టణము నావరింపఁబడి విశాలమగు పేటలతో రాయచూరు జిల్లాకు ముఖ్యస్థలముగా నలరారు చున్నది.

ఇది జి.ఐ.పి. అనూ మార్గపు కొనయొు గొప్ప వర్తక స్థలముగా నున్నది. రైలు స్టేషను ఊరునకు ఒకటిన్నర

మైళ్ల దూరములోనున్నది. రాయచూరు జిల్లాలో వెస్టర్నస్ (Westernus) అను ఉత్తమమైన ప్రత్తియు నితరధాన్యములును బండింపఁ బడుచున్నవి. బొంబాయి, మద్రాసులకు అవి సాధారణముగా నెగుమతి చేయబడును. రాయచూరులో ప్రకాశవంతములగు (glazed) కుండలును, శిల్పములను విరివిగాఁ జేయఁబడుచున్నవి. కోటలోని యొక పురాతన రాజమందిరము రాయచూరు జిల్లా ప్రధాన కార్యస్థానముగ నుపయోగింపఁ బడుచున్నది. ఈ పట్టణపు ప్రస్తుతపు జనులు మహారాష్ట్ర భాషను వాడుచున్నారు. రాయచూరు జిల్లా నైజాము రాజ్యములోని మహారాష్ట్ర ప్రాంతములోని భాగమై ఔరంగాబాదులో నుండు ప్రాంతాధికారి క్రిందనున్నది.

## షోరాపూరు.

ఇది యిప్పుడు రాయచూరు జిల్లాలో నున్నది. షోరాపూరు సంస్థానము బేదారులను నాగరికులచె స్థాపింపఁ బడెను. మైసూరు నందలి గత్నగిరి, దక్షిణ మహారాష్ట్రము వీరి యాదిమ నివాసము. పదమూడవ శతాబ్దము నుండి పేరొందినారు. వీరి ముఖ్యులకు నాయకులని పేరు. వీరు బీజపూరు, గోలకొండ రాజులకు సహాయులై ఔరంగజేబుతో యుద్ధము చేసిరి. గోలకొండ ముట్టడి సమయమందు అబుల్ హసన్ సహాయము కొరకు షోరాపూరు ముఖ్యుఁడగు ప్రేమ నాయక్ బేదారుల సైన్యము నంపెను. ఔరంగజేబు ప్రత్యేకముగా సైన్యమును షోరాపూరు పంపఁగా వాఁడు లోఁబడెను. ప్రేమ నాయకుని అన్నకొడుకు పిడియనాయకు ఔరంగజేబును (౧౬౮౧) లోఁబాది మనసబును బొందెను. ఇతఁడు రాయచూరు చుట్టుడిప్రాంతాల సహాయము జేసెను. తరువాత పిడియ నాయకుఁడు తన వాకిన్ ఖేడ దుర్గమును చేరి యిరువది వేల సైన్యమును కూర్చుకొని మొగలు రాజ్యమును కొల్లగొనసాగెను. అతని తన వైపు త్రిప్పుకొనుటకు ఔరంగజేబు అనేక యుత్తరములు వ్రాయుచు: అయ్యా, నీవు మహమ్మదీయుఁడవు కావు. అయినను నా సహోదరుఁడవై యుందువు'' అని వ్రాసెను. చివరకు ఔరంగజేబు బేదారులను ౧౭౦౪ లో నోడించి వాకిన్ ఖేడాను దీసికొనెను. అప్పటినుండి బేదారులకు షోరాపూరు ముఖ్యపట్టణమయ్యెను. ఔరంగజేబు మరణానంతరము వాకిన్ ఖేడాను మరల దీసికొనిరి. ఈ నాయకుల వంశీకులు ౧౮౫౭ వరకు నైజాములకులోఁబడి చిన్న సంస్థానమును కలిగియుండిరి. అప్పటిరాజు చిన్నవాఁడగుటచే ౧౮౪౪ లో కర్నల్ మెడోస్ స్థానాధికారిగా నియమింపఁబడి ౧౮౫౩ లో సంస్థానము అసలురాజునకు ఇచ్చివేయఁబడెను. కాని ఇతఁడు ౧౮౫౭ సిపాయిల తిరుగుబాటులోఁ జేరియున్నాఁడని తెలిసి దేవిడుసన్ కలిసికొంటు అతనిని హైదరాబాదులో ఖైదిగాఁ జేసెను. ఈ రాజునకు మొదట ఉరిశిక్ష విధింపఁబడి తరువాత అయిదు సంవత్సరముల శిక్షగా మార్చఁబడి వేలూరు జైలునకుఁ బంపఁబడుచుండగా తుపాకితో నాత్మహత్య గావించుకొనెను. చివరకు ఈ సంస్థానము పూర్తిగా నైజాము రాజ్యములోఁ గలుపఁబడెను. కర్నల్ మెడోసు వ్రాసిన "Story of my life" అను పుస్తకము చారిత్రక పరిశోధకులు చదువుట చాల యుపయుక్తము.





పశ్చిమాంధ్ర గ్రంథాలయ సభాహ్వానసంఘము, మధిర.



ప్రథమాంధ్ర గ్రంథాలయసభ, మధిర. అధ్యక్షులు శ్రీపింగిలి వేంకట్రామారెడ్డిగారు.

# ఆంధ్రుఁడా!

(శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి)

గీ. ఆంధ్రుఁడను నేను; నాభాషయాంధ్రభాష;
ఆంధ్రదేశంబునాది; యటంచు నీవు
మురిసిపోవోయి! యాంధ్రుఁడా! మఱియ కేమి?
సర్వమధురంబు గద నీదు చంద మరయ.

సీ. కలముచేఁ గత్తిచే గలఁచి దిగ్విజయంబు, రచియించు శ్రీకృష్ణరాయలకును
దెలుఁగున కమృతంబుఁ జివికి జీవముపోసి, తేఁప్చు కవిబ్రహ్మ తిక్కకవికి
అన్యదేశ్యులకవశ్యాధ్యేయమగు గీత, రచనసేసిన త్యాగరాజ కృతికి
అని నుండిపాఱివచ్చిన భర్త్రనెగ్గాడి, యీసడించిన మానరాశి మూర్తి

గీ. కిట్టి పుణ్యాత్ములనుగాంచినట్టి మేటి, కాంధ్ర మాతకుఁ దీరువేలా! ఋణంబు
ప్రతిదినంబును సుకవితారసముతోడఁ, దర్పణము సేసి సలుపు వందనములాంధ్ర!

ఉ. తేఁకువ నీదుపూర్వులమదిం గొని సాంఘికరాజకీయ భా
షాకళలందు వారల విజాత్యమహోన్నతినిం దలంచుచున్
నీకుఁ గలట్టి పెన్ ప్రతిభ నీదుమహత్తర శక్తిఁ జూపి ప్ర
త్యేకత నిల్పుమోయి! పరదేశ్యులు నిన్ను నుదాహరింపఁ గన్.

శా. శూరుల్ పండలుగారు; కార్యములు దక్షుల్; గారు వాక్శూరులున్;
సారోదారులు; గారు దుర్బలులు; నస్వార్థుల్ స్వలాభాతురుల్
గా రీయాంధ్రు లటన్న తొల్లిటి శుభఖ్యాతిన్ మహామంత్ర మ
ట్లారాధింపఁ గదోయి! నీదు ప్రతి కార్యారంభమం దాంధ్రుఁడా!

గీ. ఆంధ్రులన నాంధ్రభాషనా నాంధ్రదేశ
మనిన నుప్పొంగవలదె? నీయంగకములు
అన్యు లాంధ్రులుగామికి నాత్మలందు
వగచుకొనునట్లు చేయంగ వలదె? యాంధ్ర!

# నిజాము రాష్ట్ర కవులు

## వారి పుస్తకముల పట్టిక

1. మల్లికార్జున పండితారాధ్యులు
   శివతత్త్వసారము
2. పాలకురికి సోమనాథుఁడు
   బసవపురాణము
   పండితారాధ్య చరిత్రము
   చెన్నమల్లు సీసములు
   వృషాధిప శతకము
   అనుభవసారము
   చతుర్వేదసార సూక్తులు
   సోమనాథ భాష్యము
   రుద్రభాష్యము
   బసవరగడ
   గంగోత్పత్తిరగడ
   నమస్కారగద్యము
   సద్గురురగడ
3. రుద్రదేవచక్రవర్తి.
   నీతిసారము
4. విశ్వేశ్వర శివదేశికులు
   పురుషార్థ సారము
5. ఉదయాదిత్యుఁడు
   ఉదయాదిత్యాలంకారము
6. గోకర్ణుఁడు
   గోకర్ణచ్ఛందస్సు
7. మారన
   మార్కండేయ పురాణము
8. కోనబుద్ధరాజు
   రంగనాథ రామాయణము
9. కాచవిభుఁడు విఠ్ఠలరాజు
   ఉత్తరరామాయణ ద్విపద
10. భాస్కరుఁడు
    దశగతులు
    భాస్కర రామాయణము (అరణ్య)
11. హుళక్కి భాస్కరుఁడు
    భాస్కరరామాయణము (యుద్ధ)
12. మల్లికార్జునభట్టు
    భాస్కర రామాయణము, (బాలసుందర)
    అభిషిక్త రాఘవము (సం)
    సరస్వతీచంద్రిక
13. కుమారరుద్రదేవుఁడు
    అయోధ్యాకాండము
14. అయ్యలార్యుఁడు
    యుద్ధకాండ శేషము
15. శివదేవయ్య
    శివతత్త్వ రసాయనము
16. జాయసేనాపతి
    నృత్తరత్నావళి
17. కవిభల్లటుఁడు
    గణమంజరి
    విక్రమార్క చరిత్రము
18. కపర్ది
    అపస్తంబ గృహపరిశిష్ట భాష్యము
    అపస్తంబ గృహ్యసూత్ర భాష్యము
    అపస్తంబ శ్రౌతసూత్ర భాష్యము

భారద్వాజ గృహ్యసూత్ర భాష్యము
దర్శపూర్ణి మాస భాష్యము
భారద్వాజ సూత్రభాష్యము

19. విద్యానాథుఁడు
ప్రతాపరుద్ర యశోభూషణము

20. రావిపాటి త్రిపురాంతకుఁడు
త్రిపురాంత కోదాహరణము
ప్రేమాభిరామము
చంద్రతారావళి
అంబికా శతకము
మదన విజయము

21. వేములవాడ భీమకవి
భీమనఛందస్సు
నృసింహ పురాణము
బసవ పురాణము (కన్నడము)

22. కాసె సర్వప్ప
ప్రతాప చరిత్రము
సిద్ధేశ్వర చరిత్రము

23. కుమారస్వామి సోమయాజి
రత్నాపణవ్యాఖ్య

24. గౌరనమంత్రి
లక్షణదీపిక
హరిశ్చంద్ర చరిత్రము
నవనాథ చరిత్రము

25. బమ్మెర పోతరాజు
భోగినీ దండకము
వీరభద్ర విజయము
భాగవతము
నారాయణ శతకము

26. పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుఁడు
శృంగార శాకుంతలము
జైమిని భారతము
అవతార దర్పణము
నారదీయము
మాఘ మాహాత్మ్యము
మానసోల్లాసము

27. సర్వజ్ఞసింగ భూపతి
రసార్ణవసుధాకరము

28. విశ్వేశ్వరకవి
చమత్కార చంద్రిక

29. మడికి సింగన
పద్మపురాణము
సకలనీతి సమ్మతము
భాగవతము 11–12 స్కంధములు ద్విపద
జ్ఞానవాసిష్ఠ రామాయణము
తారావళి

30. చరిగొండ ధర్మకవి
చిత్రభారతము

31. ఏర్చూరి సింగన
కువలయాశ్వ చరిత్రము
షష్ఠస్కంధము

32. బొప్పరాజు గంగయ్య
పంచమస్కంధము

33. వెలిగందల నారయ్య
ద్వితీయస్కంధ భాగము
దశమస్కంధ భాగము
11–12 స్కంధములు

34. హరిభట్టు
రతిరహస్యము
మత్స్య పురాణము
వరాహ పురాణము
నృసింహ పురాణము
భాగవతషష్ఠ ఏకాదశద్వాదశస్కంధములు

35. పట్టమట్ట సోమనాథకవి
సూతసంహిత
బ్రహ్మోత్తర ఖండము

36. మల్లారెడ్డి
శివధర్మోత్తర ఖండము
పద్మపురాణము
షట్చక్రవర్తి చరిత్రము

37. ఎల్లారెడ్డి
వాసిష్ఠము
లైంగ్యము

38. దినవహి మాధయ
విచిత్ర రామాయణము

39. పైడిమఱ్ఱి వెంకటాధ్వరి
చంద్రాంగద చరిత్రము

40. సారంగు తమ్మన్న
వైజయంతీ విలాసము

41. పిడుపర్తి బసవకవి
వీరశైవదీక్షాబోధ
ప్రభులింగలీల

42. పిడుపర్తి సోమనాథుడు
ప్రభులింగలీల, ద్విపద
బసవపురాణము (పద్యములు)

43. సురభిమాధవరాయలు
చంద్రికా పరిణయము
కువలయానందమను చంద్రికా పరిణయ
వ్యాఖ్యానము

44. ఎలకూచి బాలసరస్వతి
యాదవ రాఘవ పాండవీయము
భర్తృహరి మల్లభూపాలీయము
చంద్రికా పరిణయము
నన్నయభట్టీయ వ్యాఖ్య
రంగకౌముది
షడ్భాషా చంద్రిక

45. అద్దంకి గంగాధరకవి
తపతీసంవరణోపాఖ్యానము

46. పొన్నిగంటి తెలగన్న
యయాతిచరిత్రము

47. నెల్లుట్ల నారాయణకవి
వజ్రాభ్యుదయము

48. కాసాదము పెద్దన సోమయాజి
మత్స్య పురాణము
శేషశైలేశలీల
అధ్యాత్మ రామాయణము
ముకుంద విలాసము
యథాశ్లోక తాత్పర్యరామాయణము
రామాయణ సంపూర్ణవ్యాఖ్య

49. కనకబండి గిట్టయ్య
హరిశ్చంద్ర ద్విపద
పోలురాజకథ

50. ఆచ్చిరామానుజాచార్యులు
మోక్షసారము
ముముక్షుజనకల్పము

51. కుందావఝ్ఝుల గోపాలకృష్ణకవి
కృష్ణజన్మ ఖండము

52. సిరిప్రగడ ధర్మసూరి
నలచరిత్రము

53. బొమ్మకంటి నృసింహశాస్త్రి
ధర్మాంగద చరిత్రము

54. నాగనాథుడు
మదన విలాస భాణము
విష్ణుపురాణము

55. బొమ్మకంటి హరిహరుడు
అనర్ఘరాఘవవ్యాఖ్య

56. బొమ్మకంటి అప్పలాచార్యులు
అమరము వ్యాఖ్యానము

57. రావాక లక్ష్మీపతి
భద్రాయురభ్యుదయము

శ్రీకృష్ణవిలాసము
శంకర విజయము
శ్రీమనుపాఖ్యానము
ఏశావివాహము

58. యాముజాల శేషాచలపతి
వసిష్ఠజనక సంవాదము

59. గద్వాల సోమనృపతి
రతిశాస్త్రము
అష్టపదులు యక్షగానము

60. పామనృపాలుఁడు
భార్గవపురాణము

61. చరిగొండ నృసింహకవి
శశిబిందు చరిత్రము

62. చరిగొండె హొన్నయ్య
జ్యోతిష రత్నాకరము

63. బమ్మెర కేసన మల్లనలు
దాక్షాయణీపరిణయము
విష్ణుభజనానందము

64. అనంతామాత్యుఁడు
భోజరాజీయము
రసాభరణము
అనంతునిఛందస్సు

65. పరశురామ పంతుల లింగమూర్తి
సీతారామాంజనేయము
రామమన్మథ విలాసము
జీవన్ముక్తి ప్రకరణము
బ్రహ్మనారద సంవాదము
తారక యోగము
మానస శతకము

66. పరశురామ పంతుల రామమూర్తి
శుకచరిత్రము
వివేకసారము
అధ్యాత్మ రామాయణము
శతకద్వయము
శ్రీరామహృదయము
మనోహర శతకము
రాజయోగ రహస్యము
ఈమలవాయి రామ శతకము

67. మరింగంటి సింగరాచార్యులు
రామకృష్ణ చరిత్రము, నాటకశాస్త్రము
ప్రేమాభిరామము, ధనాభిరామము
నలయాదవ రాఘవ పాండవీయము
అలంకార సంగ్రహము, ఆంధ్రభాషా
భూషణము, నిరోష్ఠ్య రామాయణము
నిరోష్ఠ్యశుద్ధాంధ్ర సీతాకల్యాణము

68. అగస్త్యుఁడు
నలకీర్తి కౌముది
బాలభారతము

69. ప్రతాపరుద్రచక్రవర్తి
కాశిక యను పాణినిసూత్రవృత్తికి రాజరుద్రీయ
మను వ్యాఖ్యానము వ్రాసెను

70. ముడుంబ లక్ష్మణాచార్యులు
లక్ష్మణా పరిణయము

71. ఆసూరి మరింగంటి నరసింహాచార్యులు
తాలాంకనందినీ పరిణయము
యాదవాచల మాహాత్మ్యము

72. ఉద్దమట్టు వేంకటరాయకవి
సర్వోపనిషత్సార సంగ్రహము

73. దొంతి పట్టాభి రామరెడ్డి
ఆంధ్ర పూర్వాచార్య ప్రభావము

74. మల్లినాథసూరి
పంచకావ్య వ్యాఖ్యాత

75. ఏకామ్రనాథుఁడు
ప్రతాప చరిత్రము

76. కృష్ణగిరి వేంకటరమణయ్య
వాసిష్ఠ రామాయణము
అధ్యాత్మరామాయణము
గరుడోపాఖ్యానము (కన్నడము)

77. ఫణికుండలకవి
సీమంతిని కళ్యాణము

78. కుమారస్వామిశాస్త్రి
చెన్నబసవ పురాణము

79. తూము రామదాసుకవి
ఆంధ్రపద నిధానము
మిత్రవిందోద్వాహము
కాళిదాస నాటకము
గోపికా విలాసము

80. త్యాగరాజ మొదలియారు
సుబ్రహ్మణ్య విజయము
ఛందోరత్నాకరము
సంపూర్ణ భారతము

81. సురభి నరసింగరావు
నక్షత్ర ఖేలనము

82. చినమాధవరావు
శూద్రస్మృతి

83. రావుమాధవరావు
రాఘవీయమను రామాయణ వ్యాఖ్యానము

84. బంగారు రంగప్ప
బేతాళ చరిత్రము

85. మిట్టపల్లి సీతారామశాస్త్రి
కాలనిర్ణయ చంద్రిక

86. పానుగోటి జగన్నాథరావు
కుముదవల్లీ విలాసము

87. చెన్నూరు రామన్న
సంపూర్ణ రామాయణము

88. అయ్యమాచార్యులు
చెన్నకేశవ విలాసము
రామేశ్వర విజయము

89. తెనాలిరామలింగకవి (స్వర్ణకారుఁడు)
ధీరజనమనో విరాజితము

90. మంథాన భైరవుఁడు
ఆనంద కందము
మంథాన భైరవతంత్రము

91. నారాయణ పండితుఁడు
సంపూర్ణరామాయణము వ్యాఖ్యానము

92. గోపమంత్రి
సింధుమతీ విలాసము

93. శ్రీనాధుని వేంకటరామకవి
శ్రీరామపట్టాభిషేకమను ఆళ్వారాయ చరిత్రము

94. కస్తూరము కృష్ణమాచార్యులు
భగవద్గీత ద్విపద కావ్యము

95. కాండూరి రామానుజాచార్యులు
తిరువాయిమొరి

96. (జనుములపల్లి) రాజాగోపాలరావువారు
రామచంద్రోదయము
శృంగారమంజరి, భాణము

97. రాజరత్నమ్మరాణి
శ్రీనివాస విలాసము

98. ప్రగడరాజు లక్ష్మీనరసింహామునరసింగ మంత్ర్య
నృసింహ విలాసము

99. సోమనాథకవి
వసుచరిత్రకు విద్వన్మనోరంజనివ్యాఖ్య
చతుర్భుజాభిషేకము

యావన చరిత్రము
గంగాగౌరీ సంవాదము

100. రావూరి సంజీవరాయకవి
రుక్మిణీ పరిణయము
వీరనారాయణ శతకము
త్రివిక్రమ విలాసము
వసుదేవ నందన శతకము
భాగవతము ఏకాదశ ద్వాదశస్కంధములు?

101. రాపాక శ్రీరామకవి
అధ్యాత్మ రామాయణము

102. పరశురామ పంతుల అనంతరామకవి
హనుమద్విజయము

103. బిజ్జలతిమ్మ భూపతి
అనర్ఘ రాఘవము

104. మరింగంటి వేంకటాచార్యులు
మల్లారి చరిత్రము ద్విపద

105. నడికమల్ల కృష్ణారావు
కంబుకంధర చరిత్రము
లీలావతీ గణితము

106. మరింగంటి నరసింహాచార్యులు
శ్రీకృష్ణ శతానందీయము

107. సింహాద్రి వేంకటాచార్యులు
చమత్కార మంజరి

108. అన్నయార్యుడు
సాముద్రిక శాస్త్రము

109. అనుముకొండ పురుషోత్తమకవి
అంగజ విజయము

110. తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు
అచలాత్మజా పరిణయము

111. చెన్నూరు శోభనాద్రి
శృంగారపూర్ణ చంద్రోదయము

112. పండరినాథకవి
అధ్యాత్మ రామాయణము
రామకథా కల్పలత 11000 శ్లోకములు

113. పోవూరి వేంకటాచార్యులు
విశ్వకర్మ పురాణము

114. దొంతర మల్లేశము
అలువాల మాహాత్మ్యము.



సూచన:—ఇంకఁ గొందఱు కవుల పేరులు గ్రంథములు తెలుప వలసి యున్నది. గాని విశ్రాంతిలేమియు విస్మృతి భీతియుఁ గారణములుగా నుదహరింప మానితిమి. పై నుదాహరించిన కవుల పుస్తకములన్నియు లభింపలేదు. కొన్ని మాత్రమె లభించియున్నవి. కవుల కాలములు నివాస స్థలములు ప్రత్యేక చరిత్రము నందుదాహరించెదము. ముద్రణమునకుఁ ద్వరగ నీయ వలసి వచ్చుట చేత కవుల పట్టిక కాల క్రమాను సారముగా నీయ జాలకపోతిమి.

శే. ర.

# నిజాం రాష్ట్రాంధ్ర గ్రంథాలయములు

## హైదరాబాదు

| సంఖ్య | గ్రామము | గ్రంథాలయము | స్థాపన దినము | గ్రంథ సంఖ్య | పత్రికలు | సభ్యుల సంఖ్య | ఆదాయము రూ. | ఖర్చు రూ. | వినియోగము | భవనము | కార్యదర్శి | నిలువ యున్న ధనము. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | రెసిడెన్సి | శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయ | 1—9—1901 | 3246 | 24 | 403 | 94 | 78 | 50 | స్వంతము | బూ. రామకృష్ణరావు | 1857—0—0 |
| 2 | అఫ్జల్ గంజ్ | శ్రీ బాలసరస్వతీ నిలయము | 1922 | 1500 | 21 | 89 | 58 | 32 | 20 | పక్కిహిరి | నా. కోదండరామారావు | 309—8—0 |
| 3 | చిక్కడంబర బజారు | శ్రీ వేమన ఆంధ్రభాషా నిలయము | 1923 మే 1923 | 1005 | 7 | 62 | 50 | 26 | 8 | బాడుగ | ఎం. రాజగోపాలు మొదలియారు | 1720—5—4 |
| 4 | త్రూపుబజారు | ఆంధ్ర సోదరీ సమాజము | 12—4—25 | 100 | | 20 | 5 | 1 | | ఉచితము | పం. వీరరాఘవమ్మ | 44—3—0 |
| 5 | గుల్‌బాగు | ఆంధ్ర విద్యార్థి సంఘము | 6—7—1923 | 384 | 9 | | 3 | 3 | 10 | ఉచితము | మా. రామచంద్రరావు | |
| 6 | సీతారాంబాగ్ | శ్రీ వైష్ణవ గ్రంథనిలయము | 22—2—26 | 600 | 4 | 42 | 15 | i5 | 10 | బాడుగ | శ్రీ. వేంకట నరసింహాచార్యులు | |
| 7 | నాంపల్లి | శ్రీ ఆంజనేయాంధ్రభాషా నిలయము | 1—12—26 | 110 | 10 | 45 | 25 | 10 | 13 | ఉచితము | సమలికంటి వేంకట కృష్ణారావు | |

| సంఖ్య | గ్రామము | గ్రంథాలయము | స్థాపనదినము | గ్రంథ సంఖ్య | పత్రికలు | సభ్యుల సంఖ్య | [illegible] సగటు | [illegible] సగటు | [illegible] | భవనము | కార్యదర్శి | నిలువయున్న ధనము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 18 | మల్లేపల్లి | హిందీప్రచారిణీ గ్రంథాలయము | 7-6-1924 | 200 | 4 | 10 | ... | ... | [illegible] | [illegible] | మల్లెల లక్ష్మీనరసింహారావు | 1[illegible]-[illegible]-0 |
| 19 | కలకోట | విజ్ఞాన ప్రకాశిక గ్రంథనిలయము | 14-2-1928 | 300 | 4 | 10 | 4 | 4 | 6 | సొంతము | పి. వెంకటప్పారావు | 2-9-3 |
| 20 | జగ్గూల్ రావు పేట | పత్రికా పఠనమందిరము | 7-6-1924 | 25 | ... | ... | ... | ... | 4 | ... | కంకిపాటి అమృతరావు | ... |
| 21 | మధిర | ఉస్మానియా గ్రంథాలయము | 1-3-1928 | 1029 | 3 | 5 | 5 | 5 | 5 | సొంతము | మిరియాల నారాయణగుప్త | ... |
| 22 | ఎల్లుపాలెం | శ్రీమహాబూబియా ఆంధ్రభాషానిలయము | 16-7-1911 | 665 | 6 | 30 | 13 | 10 | ... | [illegible] | [illegible] | ... |
| 23 | రేమిడిచర్ల | శ్రీ సిద్ధమల్లేశ్వర గ్రంథాలయము | 1-9-1913 | 1670 | 4 | 22 | 10 | ... | ... | స్వంతము | దే. రాధాకృష్ణమూర్తి | 200-0-0 |
| 24 | మామునూరు | శ్రీ జనార్దన నిలయము | 30-6-1923 | 525 | 3 | 36 | 12 | 12 | 10 | ప్రభుత్వము | మామునూరు నాగభూషణరావు | ... |
| 25 | [illegible] | శ్రీ [illegible] గ్రంథాలయము | 16-7-1922 | 386 | 5 | 34 | 12 | 12 | 10 | సొంతము | [illegible] శ్రీరాములు | ... |
| 26 | బూర్గంపాడ్ | విష్ణువర్ధనాంధ్రభాషానిలయము | 5-4-1924 | 400 | 10 | 30 | 9 | 8 | 20 | ,, | చెన్నూరి మల్లయ్య | 425-0-0 |
| 27 | [illegible] | శ్రీదేశోద్ధారక ఆంధ్రభాషానిలయము | 25-3-1925 | 1205 | 22 | 62 | 40 | 15 | 20 | ... | [illegible] | 80-0-0 |
| 28 | వడికొండ | ప్రతాపరుద్ర ఆంధ్రభాషానిలయము | 3-7-24 | 626 | 4 | 15 | 6 | 8 | 5 | ,, | పెద్ది [illegible] | 88-0-0 |

## కరీమునగరము జిల్లా

౧

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 29 | కరీమునగరము | ఉస్మానియా ఆంధ్ర జ్ఞాననిలయము | 19-10-1923 | 850 | 5 | 205 | 49 | 41 | 32 | స్వంతము | కూరూరి కిషనరావు | 133-14-1 |
| 30 | పాలముపల్లి | శ్రీ గోదరిజన గ్రంథాలయము | 8-1-1926 | 252 | 4 | 18 | 6 | 6 | ... | ఉచితము | యస్. రంగరావు | ... |
| 31 | కోరుట్ల | ఆంధ్రగీర్వాణ శ్రీ వాణీవిలాస గ్రంథాలయము | 15-1-1926 | 500 | 5 | 50 | ... | ... | 10 | స్వంతము | పి. క్రిష్ణమాచార్యులు. | ... |
| 32 | జగిత్యాల | జగదీశ్వర గ్రంథాలయము | 21-5-1923 | 186 | 1 | ... | ... | ... | ... | ఉచితము | హనుమంతరావు | ... |
| 33 | మంథెన | ఉస్మానియా తెనుగు గ్రంథాలయము | 20-7-1923 | 658 | 3 | 40 | 10 | 10 | 4 | బాడుగ | అనభాని గారి క్రిష్ణయ్య | 300-0-0 |
| 34 | హుజూరాబాదు | శ్రీ వ్రిశ్వేశ్వరాంధ్రభాషా నిలయము | 7-4-1922 | 520 | 7 | 35 | 15 | 10 | 10 | స్వంతము | డి. రామకృష్ణారెడ్డి | 71-0-0 |
| 35 | వేములవాడ | శ్రీ రాజేశ్వర మహాత్మ్య ప్రకాశిక | 1924 | 100 | ... | 25 | ... | ... | 22 | ... | సం. రామశాస్త్రి | ... |
| 36 | శిరిసిల్ల | శ్రీ నారాయణాంధ్ర గ్రంథాలయము | 23-2-1925 | 306 | 5 | 76 | 18 | 15 | 8 | తనకొటియిల్లు | వెంకటరావు | 348-0-0 |
| 37 | కాటపల్లి | శ్రీ విజ్ఞానాంధ్ర భాషా నిలయము | ... | 271 | 1 | ... | ... | ... | ... | ఉచితము | నా. హరికిషనయ్య | 12-0-0 |

## నల్లగొండ జిల్లా

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 38 | నల్లగొండ | నీలగిరి గ్రంథాలయము | 18-3-1923 | 510 | 22 | ... | ... | ... | 10 | స్వంతము | వ. వెంకటనరసింహారావు | ... |
| 39 | ,, | శ్రీ ఆంధ్ర సరస్వతీ నిలయము | 18-8-1918 | 815 | 6 | 45 | 14 | 9 | 8 | బాడుగ | ఎర్రబెల్లి వెంకట రంగారావు | 8-5-4 |
| 40 | ,, | శ్రీ భారతీ నిలయము | 1921 | 1020 | 4 | ... | ... | ... | 10 | స్వంతము | అనంతరామరావు | ... |
| 41 | సూర్యాపేట | ఆంధ్రవిజ్ఞానప్రకాశిని గ్రంథనిలయము | 1917 | 498 | 6 | ... | 4 | 8 | ... | ,, | యా. రామనరసయ్య | 28-0-0 |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 53 | మక్తల | శ్రీఆంధ్రవాణీ గ్రంథాలయము | 4-8-24 | 325 | 10 | 40 | 10 | 10 | 20 | బాడుగ | రంగయ్యగుప్త | 60-0-0 |
| 54 | పెదకల్లు | శ్రీవేంకటేశ్వర గ్రంథాలయము | 13-10-26 | 50 | 7 | ... | 3 | 3 | 10 | బాడుగ | వి. రామకృష్ణారావు | 20-2-0 |
| 55 | పాతాపురము | భారతకృషి కేంద్ర గ్రంథాలయము | 13-12-25 | 65 | 5 | 15 | 8 | 8 | 8 | ఉచితము | సంతపురి రామచంద్రరావు | ... |

# మెదకు జిల్లా

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 56 | అందోలు | శ్రీరామ గ్రంథాలయము | 7-10-1924 | 325 | 6 | 20 | 5 | 4 | 10 | ఉచితము | చిదిరె లక్ష్మణశర్మ | 12-0-6 |
| 57 | సంగారెడ్డి | దక్షిణ ఆసంగ గ్రంథాలయము | 26-3-1923 | 245 | 7 | 36 | 20 | 15 | 12 | బాడుగ | గొల్లపూడి లక్ష్మీనరసింహారావు | 32-0-0 |
| 58 | మెదకు | ఆంధ్రభాషా సంజీవని గ్రంథాలయము | 1923 | | | 325 | | | | | పాలపర్తి సత్యనారాయణ | |
| 59 | జోగిపేట | శ్రీజోగినాథ గ్రంథాలయము | 23-5-1924 | 8 | 8 | 48 | 20 | 9 | 5 | స్వంతము | పె. హనుమచ్ఛర్మ | 25-0-0 |
| 60 | సిద్దిపేట | శ్రీఉమా మహేశ్వరాంధ్రభాషా నిలయము | 9-8-1922 | 175 | 5 | ... | 8 | 8 | 10 | బాడుగ | ప. నాగమల్లయ్య | |

# నిజామబాదు జిల్లా

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | చిన్నమల్లారెడ్డి | విద్యావిశారద నిలయము | 31-10-28 | 250 | 4 | 26 | 6 | 6 | 10 | ఉచితము | శతారి | 4-8-0 |

# ఆదిలాబాదు జిల్లా

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 62 | చెన్నూరు | శ్రీగోదావరీవాచనాలయం | 7-4-1924 | 480 | 9 | 84 | 81 | 10 | 10 | అద్దె | చిట్టా రాజన్న | 67-7-8 |

## రాయచూరు జిల్లా

౩

| సంఖ్య | గ్రామము | గ్రంథాలయము | స్థాపనదినము | గ్రంథసంఖ్య | పత్రికలు | సభ్యుల సంఖ్య | [illegible] | [illegible] | [illegible] | భవనము | కార్యదర్శి | నిలువయున్న ధనము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 68 | గద్వాల | చెన్నకేశవగ్రంథాలయము | 29_10_1928 | 851 | 9 | 5 | 11 | 2 | 20 | ఉచితము | ఆరె నాగప్ప | 7_10_0 |



# నిలయమునుగూర్చిన అభిప్రాయములు.

౧. శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఎం. ఏ. (కాంటాబ్.)

"ఆంధ్రదేశమునం దిప్పుడుండు జ్యోతులయం దగ్రగణ్య మనఁదగినవానిలో నియ్యదియు నొకటి. ఇది ప్రాథమికము."

౨. బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు:—

"మ॥ కలవిం దెన్నియొ తెల్గుకబ్బములు పైగా సంస్కృతగ్రంథముల్
లలిమైఁ గొన్ని తురుష్కపుంగవుల సాలంకారపుంగబ్బముల్
తెలుఁగుందేశపుఁ బ్రాజ్ఞులీనిలయముం దీషాపరత్వమ్మునన్
గెలిమిం బొందిరిపోవ నిల్పుకొని వాక్కాంతన్ భజింత్రెప్పుడున్"

౩. రాజమాన్యశ్రీ వేంకటరామరెడ్డిగారు, కొత్వాలు బ॥:—

"ఈ గ్రంథాలయము తెలుఁగువారికొఱకు ప్రత్యేకముగా ఉద్దేశింప బడియున్నది... మొత్తమువీఁడ ప్రతిసభాసదుఁడును విడిగానైననేమి సమిష్టిగానైననేమి ఈగ్రంథాలయముయొక్క క్షేమమును, అభివృద్ధిని గోరుచున్నారు. నేను తెలుఁగులో విద్వాంసుఁడనుకానుగాని నాకుమాతృభాష ఆంధ్రము. కనుక ఈ గ్రంథాలయముయొక్కయభివృద్ధియందు నాకు ప్రత్యేకమగు ఉత్సాహము కలదు........నేనీ గ్రంథాలయసభాసదుల నభినందించుచు, దీనిని దినదిన ప్రవర్ధమానముగాఁజేసి సర్వవిధముల ఆశీర్వదింప పరమేశ్వరుని బ్రార్థించుచున్నాను. నేనును శక్తికొలఁది దీనికి సహాయము చేయుటయందు వెనుదీయను.

౪. శ్రీ వి. ఆర్. శిండె, నిమ్నజాత్యుద్ధరణసంఘాధ్యక్షుఁడు, పూనా:—

"నిలయమును సందర్శించితిని. ఇచటిగ్రంథములను పత్రికలను జూచి యానందించితిని."

౫. సి. రంగనాయకులు నాయఁడుగారు, బి.ఏ., బి.ఎల్., సివిల్ జడ్జి, సికంద్రాబాదు.

"నేను శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమును సంతోషముతో దర్శించితిని; దీని నడుపుచున్న విధానమునుజూచి నాకు చాల ఆనందమయినది. నిలయాభివృద్ధికై కార్యదర్శియు, సభ్యులును మిగుల అభినివేశముతో కృషిసల్పుచున్నారు. హైదరాబాదురాజ్యకేంద్రమందు ఇట్టినిలయమును మిగుల సమర్థతతో నిర్వహించుచున్న ఆంధ్రజనుల యభిమానము అత్యంతప్రశంసనీయము. దీనికి జయమగుగాక.